ఆంధ్రప్రచారిణీగ్రంథమాల. ౫౭.

# ఛత్రసాలుఁడు.

(రెండవభాగము.)

మూలలేఖకులు,

శ్రీయుత బాలచంద్ నానాచంద్‌షాహా వకీల్‌గారు.

అనువాదకులు,

ప్రతివాదిభయంకరం రంగాచార్యులుగారు.

కొంపెల్ల జనార్దనరావుగారు.



మొదటికూర్పు.

ప్రకాశకులు

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు.

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,

పిఠాపురము.

1929.



[వెల ౧-౮-౦

# ప్రధానపోషకులు.



మ. రా. శ్రీ పోతాప్రగడ బ్రహ్మానందరావుపంతులుగారు, ప్రొప్రయిటరు, సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ.



# రాజపోషకులు.

,, శ్రీరాజా ఇనుగంటి వేంకటసూర్యప్రకాశ రావుగారు, ఉండూరు.

,, శ్రీ కలిదిండి వేంకటరామరాజుగారు, భీమవరము.

,, శ్రీ కొప్పూరి సూర్యనారాయణ రెడ్డిగారు, జమీందారు, కాకినాడ.

,, శ్రీ కర్రి చినవేంకటరెడ్డిగారు, మర్చంటు, కాకినాడ.

,, శ్రీ ముత్యాల సుబ్రహ్మణ్యముగారు, రంగూన్.

,, శ్రీ జనచర్ల సత్తెయ్యగారు, రంగూన్.

,, శ్రీ బత్తుల బసవయ్యగారు, రాజమండ్రి.

,, శ్రీ ఆకారపు వెంకన్నగారు, వర్తకులు, ఒరంగల్లు.

,, శ్రీ వెలగల గోవిందరాజుగారి కుమారులు వేంకటరెడ్డిగారు, ఇతిహాసగ్రంథమాలాసంపాదకులు, ఆలపల్లి.

# రాజపోషకులు.

మ. రా. శ్రీశ్రీరాజా వత్సవాయి వేంకట సుభద్రియ్యమ్మ జగపతి బహద్దరు జమీందారిణీవారు, తుని.

---

# పోషకులు.

మ. రా. శ్రీ దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు, కాకినాడ,

,, శ్రీ వాడ్రేవు వేంకటరత్నము పంతులుగారు, పిఠాపురము.

,, శ్రీ ద్వారంపూడి రామారెడ్డిగారు, అనపర్తి.

,, శ్రీ ద్రోణంరాజు వేంకటరమణారావు పంతులుగారు, మొఖాసాదారు, తణుకు.

,, శ్రీ బందా సూర్యనారాయణపంతుగారు బి. ఎ యల్ టి. తణుకు.

,, శ్రీ పండ్రాజు వీరాజుగారు, కాకినాడ.

,, శ్రీ కొవ్వూరి వేంకట రెడ్డిగారు, పిట్టలవేమవరము.

,, శ్రీ కరి పల్లారెడ్డిగారు, మారుటేరు.

,, శ్రీ తేతల గంగిరెడ్డి సోదరులు, పెనుగొండ.

D

# పోషకులు.

మ. రా. శ్రీ దివాన్ బహద్దరు పి. పరాంకుశము నాయుఁడుగారు,
రిటైర్డుస్పెషల్ పోలీసుకమీషనరువారు, చెన్నపురి.
,, శ్రీ అర్జి వెంటయ్యగారు, నరసాపురము.
,, శ్రీ టి. యల్. నరసింహారావుగారు, మూరుటేరు.
,, శ్రీ చిన్న అమ్మిరెడ్డిగారు, రంగూన్.
,, శ్రీ పులగం వెంకన్నగారు, మూరుటేరు.

---

# సహాయులు.

మ. రా. శ్రీ ఉదయరాజు వేంకటరంగారావుపంతులుగారు, దేశముఖ్
సర్‌దేశపాండ్యా, మఠేవాడ, ఒరంగల్లు. (దక్కన్)
,, శ్రీనేరెళ్ళ నరసింహరాములుగారు, కలపవర్తకులు,
ఒరంగల్లు (దక్కన్.)
,, శ్రీగుండాపుల్లయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు (దక్కన్.)
,, శ్రీపింజల సుబ్రహ్మణ్యంచెట్టిగారు, వర్తకులు నెం 16
అన్నపిళ్ళవీధి, జి. టి., మదరాసు.

E

శ్రీగణేశాయనమః.

# పండితాభిప్రాయము

బ్రహ్మశ్రీ కొంపెల్ల జనార్దనరావు, ప్రతివాదిభయంకరం రంగాచార్యులగార్లచే విరచింపఁబడిన "ఛత్రసాలుఁడు" అనునవలను గనియున్నాను. అందలిశైలి మృదుమధురమై విరాజిల్లుచున్నది. కథోద్ఘాటనము రసవంతముగా నున్నది. గ్రంథము చదువుటకు మొదలిడినఁ దుదివఱకును నెడఁబాటులేకుండఁ జదువవలెనను నిచ్ఛ పొడముచున్నది. ఇది వీరరసప్రధానమగు చక్కనినవల కావున, దేశాభిమానులును, భాషాభిమానులునుగూడ దీనికిఁ దగు నాదరము నీయఁదగినదై యున్నది. దీనిని విద్యార్థులకుఁ బఠనీయగ్రంథముగా నియమింప నర్హమై యున్నది.

11-5-27
కాకినాడ

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

# కృష్ణకాంతుని మరణశాసనము

ఇది రసవంతములగు నవలలు మొదలగునవి రచించిన జగత్ప్రసిద్ధుఁడగు శ్రీబంకిమచంద్రునియభిమానగ్రంథము. ఇది మిగుల మనోహరమగుకథ యగుటచే కాకినాడ బెజవాడ రాజమహేంద్రవరము మొదలగు గొప్పపట్టణములలో సినీమాలలో ప్రదర్శింపఁబడుచున్నది. ఈగ్రంథము పునర్ముద్రితమై సిద్ధముగ నున్నది.

దీనివెల చందాదారులకు పోస్టేజితో రు 0—12—0

ఇతరులకు పోస్టేజికాక రు 1—0—0.

శ్రీరస్తు.

# [illegible]

## ద్వితీయభాగము.

### పదునైదవప్రకరణము.

"హృదయేతుహాలాహలమ్."

ప్రచండజ్వాలాముఖీప్రోద్భంగమున నేరీతి నభ్యర్ణస్థానమంతయు విభేదమునందునో, భూకంపాఘాతమున నెవ్విధమున నతివిస్తృతమగు మైదానమున రమ్యతటాక ముద్భిన్నమగునో, యక్షిణీదండప్రభావమున క్షణమాత్రకాలమున నేలీల నపూర్వదృశ్య మగు స్థిత మగునో యామాడ్కినే హీరాదేవివైఖరి మారిపోవుట నోర్ఛాప్రజలెల్లరుఁ గాంచిరి. పంచాననము తననైసర్గిక శౌర్యభావమునఁ ద్యజించి కృపాళుత్వము వహించుటఁ గాంచ నెట్టియాశ్చర్య ముద్భవించునో, క్షుణ్ణవారణముఁ గావించుకొనుగోసంఘముఁ గని సుప్రసన్నమగువ్యాఘ్రమునుజూడ నెట్టిసంతోషము సంభవించునో, యాశీవిషము తన స్వాభావికదౌష్ట్యమును విసర్జించి సౌజన్యవ్యాపారము లొనరించుట వీక్షింప నెట్టిసమాధాన ముదయించునో ఓర్ఛాజనకోటికి నేఁడాయాశ్చర్యము, ఆసంతోషము, ఆసమాధానముఁ గలుగుచుండెను. సభామండపమునఁ గూరుచుండి మహీబాలరాజవంశముపై గరళముఁ గ్రక్కెడుపాము నేఁ డింతశాంతముగను సిఘ్రాతుకముగను నుంటఁ జూడఁ బర్వతసింహునకుఁ గూడ నప్పుడప్పు డాశ్చర్యము గలుగుచుం

డెను. అంబటివీథి సుందరసురభిళకుసుమము వికసించెనను వార్త తెలియఁ బరిభవించెను. ఆశ్చర్యముకన్న నెక్కుడగు నాశ్చర్యము ప్రజలకు హీరాదేవివ్యాపారమునఁ గలిగెను. ఓర్ఛాయందు చంపతరాయలస్వాగతార్థమై గొప్పవైభవముతో సన్నాహము జరుగుచుండెను. నగరపశ్చిమభాగమందలి పృథులప్రవేశద్వారము వివిధపుష్పమాలికలచే నలంకృత మగుచుండెను. ఏమార్గమునఁ జంపతరాయలవాహనము రాజప్రాసాదాభిముఖమై రానున్నదో, యామార్గమున కిరుకెలంకులఁ దోరణములును, వివిధములగుపతాకలును, నలంకృతము లైనవి. విశేషించి చతుర్భుజాలయము కడుంగడు నుత్కృష్టముగ నలంకరింపఁ బడెను. ఆయాలయాలంకారములు గాక తక్కినశృంగార మంతయుఁ గాంచ వీరసింహదేవునికాలమున సార్వభౌమసుతుఁ డగు సలీమునాగమనసమయమునఁ గావింపఁబడిన శృంగారమే యిది యని చెప్ప వచ్చును.

నగరపశ్చిమద్వారమున యువరాజు విమలదేవుఁడు అనేకులగు సరదారులతో నశ్వారూఢుఁడై సంచరించుచుండెను. అనేకజనముల ముఖము లానందముఁ బ్రకటించుచుండెను. అట్లేయాశ్చర్యముఁగూడఁ బ్రకటమగుచుండెను. వారికానందము నగరశృంగారము వీక్షింపఁ బరిభవించెను. ఆశ్చర్యము తత్కారణమును గమనింప నుద్భవిల్లెను. అమేయమగుసంతోషచ్ఛాయ యాదినమున విమలదేవునిముఖమునఁ గన్పట్టుచుండెను. జయసాగరసరోవరతీరమున యువరాజు భ్రీ[illegible] తనకు నియోగించిన కార్య మింతత్వరలో నంతసంతృప్తికరముగ నిర్వహింపఁబడునని—యోర్ఛామహీపాలకుటుంబమునకు మైత్రిచేకూడునని—యాతఁడు స్వప్నమునైనఁ దలఁపలేదు. కాని యాసంఘటనమే జాగ్రదవస్థయందు—ప్రత్యక్షముగఁ గాంచి విమల

దేవుఁ డానందమున మైమఱచిపోవుచుండెను. చంపతరాయ ఛత్రిసాలునియెడ నింతవఱకుఁ దావహించిన సాత్త్వికతనుగూర్చి యాతఁ డింకను గణించెను. రెండునాళ్లక్రిందట సభామందిరమున హీరాదేవిపలికినదియు మాఱునాఁడు శుభకరుని చెవిలోఁ జెప్పినదియు నాతఁడూహింపనైన లేదు. తనతల్లి హీరాదేవి తాల్చినసాధుగోరూపమునఁ గ్రూరవ్యాఘ్రాంతఃకరణము డాఁగియుండెనని యతని కనుమానమైనఁ దక్కియుండినచో భయదుఃఖము లాతని కెట్టిదశఁ గల్గించియుండెనో తెలియరాదు.

## ౨ వ ప్రకరణము

స్వాగతసమయము సమీపించుకొలఁది విమలదేవుని యుత్కంఠ యనుసరించుచుండెను. అతఁడు గడియగడియకు సూర్యునివంకకుఁ జూచుచు నెప్పుడీతఁ డస్తమించును, నెప్పుడు నాకుఁ జంపతరాయ ఛత్రిసాలులకు స్వాగతమొసంగు సమయము ప్రాప్తించు నని తలఁపఁ జొచ్చెను. సూర్యుఁ డాకసమునుండి ప్రతీచీభూమిజంబుపై నవతరించెను. ఇఁక నొక్కక్షణములో నస్తంగతుఁ డౌనని విమలదేవుఁ డాశించెను. సూర్యుఁ డస్తమించెను. ఐన నింక నాతనికి రాజయువరాజులవాహనములు ఢిల్లీనుండి యుటకుఁ గలమార్గమున నేతెంచుచుండ నగపడలేదు. కొంచెమునేపటి కాతనికిఁ బశ్చిమదిశయందెద్దియో, మేఘమువలెఁ గన్పట్టఁ దొడఁగెను. మరల నతఁడు పశ్చిమమునకు వీక్షింప, నింకను భాస్కరుఁడు తొల్లింటివలెనే ప్రకాశించుచున్నట్లు తోఁచెను. "ఇంకను సూర్యుఁ డస్తమింపలేదు; మేఘములచాటున డాఁగియుండె" నని యతఁడు తలఁచెను. ఆతనియౌత్సుక్యమింకను వృద్ధిఁబొందెను. పశ్చిమదిశను బ్రకాశించుసూర్యుఁడు మెల్లమెల్లఁగఁ దనవంకకే సాగివచ్చుచున్నట్లతనికిఁ దోఁచుచుండెను.

అతఁడు గమనాశ్చర్యభరిత మగుదృష్టితోఁ దనదిక్కునకు నరుదెంచు
బుందేలఖండసూర్యునిపై పునఃఁ జూడసాగెను.

ఛత్రిసాలునిగాంభీర్యపూర్ణమగునానందము, విమలదేవునిస్నే
హచిహ్నితమగుచూడ్కి వీనియందే స్వాగతకృత్యము లన్నియు నెఱ
వేఱెను. ప్రతాపవంతుఁ డగురుద్రప్రతాపునిచరణపరాగమునఁ బునీ
తమయిన పుణ్యప్రదేశమున నవతికాలమునఁ బ్రవేశింపనున్నాఁడనను
తలఁపునఁ జంపతరాయల యన్యభావము లన్నియు నంతరితము లయి
పోయెను. మార్గమునఁ దనపై వర్షించుపుష్పములు రుద్రప్రతాపుని
వర్ణనీయాచరణములమాడ్కి నాతనికిఁ గన్పట్టఁదొడఁగెను. తననామ
మున వెల్వడినజయధ్వనులు రుద్రప్రతాపునియశోదుందుభిధ్వానము
లవలె నాతనికి వినఁబడసాగెను. పుష్పాగురుచందనాదిసౌగంధ్యమెల్ల
దశదిశల నించినరుద్రప్రతాపునికీర్తిసౌరభమువలె నాతని కనుభూత
మగుచుండెను. ఇవ్విధమున నోర్చాయం దాదరసత్కారముల నం
దుచుఁ జంపతరాయలు చతుర్భుజాలయముదిక్కునకు సాగుచుండెను.

పర్వతసింహునియత్యంతనిరోధమున చంపతరాయలాతనినిమం
త్రణ మంగీకరించుతఱి మొదట చతుర్భుజస్వామిదర్శనముఁ గావిం
చుకొని పిదప రాజభవనముఁ బ్రవేశింపఁ దనకిచ్ఛకలదని తెలియఁజేసి
యుండెను. కావుననే చతుర్భుజాలయముఁగూడ చాలనుదాత్తముగ
సింగారింపఁబడెను. నగరద్వారమున నతనికి స్వాగత మొసంగ యువ
రాజువిమలదేవుఁ డంపఁబడెను. చతుర్భుజాలయమున పర్వతసింహుఁ
డనేకులగుతనసరదారులతోఁ గూడి కూరుచుండి యుండెను. చంపత
రాయుచ్ఛత్రిసాలులయెడఁ గాని వారియనుచరునియెడఁగాని తిర
స్కారదృష్టితోఁ జూడరాదనియు, వారిదర్శనమున సత్యానందముఁ
గనుపఱుపవలయు ననియు వారితో ప్రేమవినయయుక్తముగ మాటాడవ

లయుననియుఁ దమమాటలవలనను జెయ్వులవలనను దమ కసూయ కాని ద్వేషము కాని నుంతయు లేనట్లు వారికి సంపూర్ణవిశ్వాసముఁ గలిగింపవలయుననియుఁ దుదకు వారినిఁ దమకుఁ బరమోపకారులుగఁ బాటించి వారియెడ స్నేహాదరవిశ్వాససూచకంబగువర్తనఁ జూపవలయు ననియు పర్వతసింహునకు హీరాదేవి కటువుగ నాజ్ఞ యొసంగియుండెను. పర్వతసింహుఁడును దనరాణియాజ్ఞను జాలచక్కగను నేరుపుతోడను బాలించెను. చంపతరాయలు సపరివారుఁడై యాలయమునఁ బ్రవేశించుచుండఁ గాంచి పర్వతసింహుఁడు కపటమగు తనకృతజ్ఞతయనుయవనికయందుఁ దనమచ్చరముఁ గప్పిపుచ్చుటకై సాదరముగ లేచి నిలువఁబడెను. సదాచరణము, సాదరసత్కారము, కృతజ్ఞత యనుశృంఖలల నిబద్ధమయిన యాతనిజిహ్వ మర్యాదాక్షేత్రమునఁ జక్కగఁ బనిచేయసాగెను. ఆతనినేత్రములు ద్వేషభావమును బాగుగ నడఁచియుంచి యుద్ధాహ్వానందమును బ్రదర్శింప నారంభించెను. తనభార్యవలన నేర్చినపాఠములను దనయాశాంబికప్రేమయుఁ గపటవర్తనము నంతయు యథార్థమని చంపతరాయలకుఁ దోఁచునంతయుత్తమముగఁ జంపతరాయలయెదుట నప్పగించెను. అతనికిఁ దనపూర్వకృత్యములయెడఁ జాల పశ్చాత్తాపము గలిగెనని యెంచి చంపతరాయ లతనికిఁ దనహృదయమున స్థాన మొసంగి యతనియపచారముల మన్నించెను.

ఓర్ఛామహీరాజవంశజుల కింక నెట్టివిరోధము లేదనియు సంపూర్ణమగుసఖ్యము లభించెననియు భావించి యువరాజులగుఛత్రిసాలదలపతిరాయులుఁగూడఁ జాలఁగ నానందించిరి. ప్రశంసనీయమగు నీకృత్యమునకై వారు విమలదేవునిఁ గడుమెచ్చుకొనిరి. చతుర్భుజదేవాలయామునుండి బయలుదేరినదిమొదలు రాజమందిరద్వార

ముఁ జేరువనుండుచు దలపతిరాయ విమలదేవులకు ఛత్రసాలుఁడు విమలదేవుని యొక్క సఖ్యముల పరిణతివలన బుందేలఖండస్వతంత్రత మెల్ల ప్రాప్తించునో బోధించుచునే యుండెను.

అలంకృత మగురాజప్రాసాదద్వారమున హీరాదేవి చాల మంది చెలికత్తెలను వెంట నిడికొని చంపతరాయలకును యువరాజఛత్రసాలునకును మంగళనీరాజనము లొసంగ సంసిద్ధయై నిలువఁబడి యుండెను. ఆమె యిట్టిస్వాగత మొసంగుటఁ జూడఁ జంపతరాయలకుఁ జాల సంతోష మొదవెను. "ఈస్వాగతము నాకుఁగాదు. నాయందు సంచరించు స్వాతంత్ర్యభావమున" కని కూడ నాతఁ డొకటి రెండుసారులు జనులతోఁ బలికియుండెను. కొంచెము సేపటికిఁ జంపతరాయల కారతి యిచ్చుటకునై యొకప్రౌఢ సర్వచు గజగమనమున ముందునకు వచ్చెను. బంధుప్రేమ, పితృస్నేహము, గురుభక్తి, యన్నియు నొక్కమూర్తిఁ దాల్చి తనయెదుట నిలిచెనో యని చంపతరాయలకుఁ దోచెను. ఆతఁడు లోలోననే మిక్కిలి సంతసించెను. తన కింతటియాదరసత్కారములఁ గావించునట్టియు, నీరాజన మొసంగునట్టియుఁ బ్రౌఢకాంతవైపున కతఁడు రెండుమారులు చూచుసరి కామె యెవ్వరో కాదు పర్వతసింహునిరాణి హీరాదేవియే యని యతనికి స్పష్టమయ్యెను. పర్వతసింహుని నేఁటివర్తనముఁ జూచి చంపతరాయలు ఆశ్చర్యచకితుఁడై యుండెను. హీరాదేవివర్తనముఁ గాంచి యాతఁడు స్తంభితుఁడై పోయెను. హీరాదేవి భీకరరాక్షసి యనియు సర్పవ్యాఘ్రముల మించినదనియుఁ జంపతరాయలు బాగుగ నెఱిఁగి యుండెను. కావుననే యతఁడు నేఁడు హీరాదేవి యిట్లు వందించుటకు మాఱుగ దనకారతినొసంగుటయందే తన్నుఁ బాధ్యగ నెంచుకొనుటఁ గాంచి మేరమీఱినయాశ్చర్యము నందెను.

చంపతరాయ యిట్లు పలికెను. "హీరాదేవీ! నేఁడు పర్వత సింహుఁడు నీవుఁ గలిసి మీ యాచరణమునఁ జూపిన ఖేదమువలనఁ బరమేశ్వరునకుఁగూడ మిక్కిలి యాశ్చర్యము గలుగును. బుందేలఖండస్వాతంత్ర్యమార్గమును వికృతకంటకాకీర్ణ మొనరించుటకును, బుందేలుల స్వాతంత్ర్యప్రేమము నశింపఁజేయుటకునే యీ శ్వేతుఁడు మీనుమ్మల వృష్టించెను. కాని స్వాతంత్ర్యమునకై దివారాత్రములు పోరాడు నా పంటిపోరాసవుపరు మీరు పూజ నల్పుచుంటఁ గాంచి నీశ్వరుఁడుఁగూడ మిమ్ముల రక్షించుటయందు గొప్పతప్పుఁ జేసితినని చింతించును. కాని మనవింధ్యవాసిని—మనస్వతంత్రతాదేవి—యోంకారుద్రప్రతాపుని వంశీయుఁడు తనయెడ భక్తుఁడగుటఁ జూచి మిక్కిలిసంతుష్టయగును. హీరాదేవి! నేను రణదులహాఖానను బట్టి బంధించితి ననుసనహాచార మింకను ఢిల్లీబాదుషాకడకుఁ జేరలేదు. కాని పదిదినములలో నైన నీవార్త తప్పక యరని చెవులఁ బడును. అప్పుడా మహాగ్రుఁడు ధర్మాంధుఁడగు పాదుషా తనబలమునంతనుగూర్చి బుందేలఖండమును ధ్వంస మొనరించుయత్నము నల్పును. బుందేలఖండమున క్త్రి వికటసంకటము రానున్నది. కాని, మొదటినుండియు మేల్కొలిపి యుంప నుద్దేశించి నేను నమస్తవీరులు నేతెంచి బుందేలఖండస్వాతంత్ర్యావై జయంతీతలమునఁ గూడవలయు ననియు బుందేలఖండబల మంతయుఁ బ్రోవులిడవలయుననియుఁ బ్రార్థనాపత్రిక బుందేలఖండమునం దంతటను బంచితిని. నేఁడు మీర లాప్రార్థనాపత్రమును సత్కరించుచున్నారు. ఉదారస్వాతంత్ర్యధ్యేయము నాదరించుచున్నారు. ఓంకారాజకులము రుద్రప్రతాపునిరక్తమున నేర్పడినది. పర్వతసింహునిప్రతిరోమకూపమునను రుద్రప్రతాపుని తేజము తాండవించుచున్నది. కావుననే యనేకదినములు నృగాలావాసమునగ హ్వర

మున నిరసించియు సింహకిశోర మ్ముచితసమయమున స్వప్రతాపముఁ బ్రదర్శింపక మానునట్లు, ప్రతాపసింహకిశోరుఁడగు పర్వతసింహుఁ డుచితసమయమున సృగాలసాహచర్యము వీడి స్వాతంత్ర్యప్రాప్తికై నిజప్రతాపముఁ బ్రకటించుచున్నాఁడు. ఈశ్వరానుగ్రహమున మా యుద్దేశము నెఱవేఱుఁగాక. మామనోరథము సాఫల్యముఁ గాంచుఁ గాక.”

హీరాదేవి కిప్పుడు తనయుద్దేశము నిస్సందేహముగ నెఱవేఱు నని బాగుగ నమ్మిక కలిగెను. ఆయుద్దేశము—నామనోరథము నామె హాస్యమునఁ బైశాచికముగఁ బ్రతిబింబించెను. ఆసమయమునఁ జంపత రాయ లామెను శ్రద్ధాయుక్తముగఁ దిలకించి యుండినచో నతఁడు రాజభవనమున నొక్కనాఁటికిఁ బ్రవేశించియుండఁడు. అతఁడు తనయెదుట హృదయంగమ మగుభావిస్వతంత్రతాచిత్రమును జిత్రించుకొనుచు రాజభవనసోపానముల నెక్కుచుండెను.

సగము రాత్రి కడచిపోయెను. నిశాకాంతుఁ డప్పుడప్పుడే నీలనిశాసహవాసంబున విసివి సుధాపాన మొనరింప స్వర్గోన్ముఖుఁడై యఱిగియుండెను. తారారమణీమణులు యథేచ్ఛముగ నంతరిక్షమున నాట్యము నల్పుచుండిరి. బేతవానదీవిమలతోయంబు లోర్ఛారాజభవనమును స్పృశించుచుఁ బ్రశాంతముగఁ బ్రవహించుచుండెను. శాంతిదేవి యెల్లెడల నిష్కంటకముగ రాజ్యమేలుచుండెను. చంపతరాయులహృదయంగమస్వతంత్రతాచిత్రము మాత్ర మింకను బూర్వమువలెనే యతనినయనసాన్నిధ్యమునఁ జిత్రిత మగుచుండెను. స్వతంత్రతాదేవీచిత్రము రచించుసమయమున నందాతఁడు బేతవానదీనిర్మలనీరముఁగూడ నుపయోగపఱచెను. ఐన నది కాఁదగినంతమంజులముగఁ గాలేదు. స్వతంత్రతాదేవీమానసమున వెలిగెడిప్రజానురాగ

శ్యజ్యోతినిఁ జంపతరాయలు తనచిత్తమున నంతచక్కఁగ రచింపఁజాల
కపోయెను. ప్రజామాంగళ్యమున నెన్నెని పరస్పరవిరుద్ధము లగుసుఖ
సాధనములు, నధికారములు, మనోభావములు, సంకల్పములు, సమా
విష్టము లగుటవలన స్వతంత్ర్యాదేవీముఖతేజ మెంతశాంతముగా
గాని యుగ్రముగఁ గాని యుండవలయునో, యెంతశోభనముగఁగాని
భయావహముగఁగాని యుండవలయునో, యెంతకృపామయముగఁ
గాని, కఠోరముగఁగాని యుండవలయునో, చంపతరాయలు నిర్ణయిం
పఁజాలకుండెను. అతఁ డొక్కసారి యాదేవీముఖమునఁ గ్రోధరక్తవ
ర్ణము నిడెను. ఆసమయమున నందు స్వతంత్ర్యావిషయ మగుయువకు
లకల్యాణముఁగూడఁ బరిశీలింపిత మగుచున్నట్లును, పరకల్యాణమునఁ
గ్రమక్రమముగఁ దనసోదరులకల్యాణ మూహించి యగుచున్నట్లును
నతనికిఁ దోఁపసాగెను. యువకులకల్యాణము నతికట్టు నాసముఖమునఁ
బలువర్ణముల నిడఁగోరఁ దనసోదరులకుఁగూడ నందు చోటినీయట్లేల్ల
దని యతనిమనోనేత్రమునకు గోచరింపసాగెను. యువకుహృదయము
బుందేలురయభ్యుదయము స్వతంత్ర్యాదేవీముఖమునఁ జిత్రింప నతఁ
డు మిశ్రితమనోభావచ్ఛాయను స్ఫుటీకరింపఁ గోరి యున్నైనచో సుచ్ఛ
భావములు యువకులవంకకుఁ బోయి నీచమనోవికారములు బుందేలు
రపాలున నుండ వారు సేవావృత్తి యుండే తమ్ముఁ దాము ధన్యులుగ
నెంచుకొందు రని యాతనికి సందియము వొడమఁదొడఁగెను. కావు
నే యింకను జంపతరాయలు, సరియగుస్వతంత్ర్యాచిత్రమును రచింప
సమర్థుఁడు కాకుండెను. అంతప్రయత్నించినను దాను చిత్రింపఁజాల
కుండిన యాస్వతంత్ర్యాసుందరిఁ బొంది తమ్మాంగముమీఁ గాక్య మెట్లు
నెఱవేర్చుటయని యోజించి చంపతరాయలు కొంతసేపు చింతించెను.
అతఁ డిట్లు తలఁపసాగెను. « మనము స్వతంత్ర్యాదేవిఁ బొందఁజాల

కున్నను దదాలయమార్గమున ముందునకు సాగుచున్నారము. ఆల యాధిష్ఠాత్రి యగు దేవి మనకు వికృతరూపమునఁ గన్పడకుండినను నున్నతమగు తదాలయశిఖరము మనకు స్పష్టముగఁ గానవచ్చుచున్నది. జీవితక్షణభంగురతవలనఁగాని మతనికృష్టతవలనఁగాని, సంచాలకాభావమువలనఁగాని మనకుస్వతంత్రతాదేవీదర్శనము లభింపకున్నను దదాలయపర్యంతము నవశ్యము పోఁగలము. పిమ్మట నాదేవీదర్శనము ప్రాప్తియు మనవెనుక యువరాజు ఛత్రసాలుఁ డవశ్యము సాధించును. ఈవిషయము నాలోచించి చంపతరాయలు నిదురించుటకై తన సెజ్జవంకకుఁ బోవుచుండెను. ఇంతలోఁ దానూహింపనైనఁజాలని యాస్వతంత్రతాదేవితానే నిద్రితుఁడైన ఛత్రసాలకుమారుని చెంత నిలువఁబడి యాతనివైపునకుఁ బ్రసన్నతాపూర్వకముగఁ జూచుచున్నదని యతనికిఁ దోఁచెను. ఆమె ఛత్రసాలునికరమున మాలిక నిడఁగోరుచున్నదని యతఁ డూహించెను. అతఁ డమితసంతోషమున నిట్లు పలికెను.

« స్వతంత్రతాదేవీ ! నీవు నాకుమారుని ధన్యు నొనర్పఁగోరుచున్నావు. నీమూలమున బుందేలఖండమంతయుఁ బవిత్రము కానున్నది. బుందేలఖండ మాంగళ్యపథమును నీవుజ్జ్వల మొనరింపఁబోవుచున్నావు"

సుందరి తనసుఖస్వప్నమునుండి యొక్కమ్మడి మేల్కాంచి చంపతరాయలవైపునకుఁ జూచి యిట్లనెను.

« మహారాజా ! నేను విజయను. "

చంప—నీవు విజయవా ! అట్లయినచో విజయాన్వితుఁడు కాక స్వతంత్రతాదేవీమందిరద్వారమును ఛత్రసాలుఁ డెట్లు తెఱవఁగలఁడు!

విజయ మరల మనోహరస్వరమున నిట్లనెను:—"ప్రభూ! నేను డాంధేరరాజ కుమారిని విజయను."

చంప—నీవు కంచుకిరాయలపుత్రిక వగువిజయవా! నీచేతనే కదా వింధ్యవాసిని ఛత్రసాలునిగళమున మాల వేయించినది. నీవింతరాత్రివేళ నిట నేమిచేయవచ్చితివి?

విజ—రాణిహీరాదేవి యౌదార్యసత్కారముల వాస్తవికస్వరూపమును దమకు వెల్లడిసేయుటకే నేనిటకువచ్చితిని. తమరు నాకిచ్చుటఁ గనుపింపకుండుటచే యువరాజు ఛత్రసాలుని మేల్కొలుప యోజించుచుంటిని. ఇంతలోఁ దమరే వచ్చితిరి. మహారాజా! పర్వతసింహుఁడును రాణిహీరాదేవియుఁ దమకుఁ గావించిన యుదాత్తగౌరవసమ్మానములవలనఁ దమరు చాల సంతుష్టులైనట్లు కన్పట్టుచున్నారు!

చంపతరాయ లాశ్చర్యమున విజయనైపుఁ జూచుచు నిట్లుపలికెను:—సరి! ఇంతటి ప్రేమభరితమగు సమ్మానమున నెవ్వరు సంతుష్టులుగారు! హీరాదేవీపర్వతసింహులిరువురు నిప్పుడే యనుతాపాగ్నిఁ బరితప్తులై పరిశుద్ధులై వెలువడిరి. వారిపూర్వదుర్విచారములన్నియు నశించిపోయినవి. ఉజ్జ్వలస్వాతంత్ర్యప్రకాశము వారిమనసుల వ్యాపింప నారంభించినది. తమకు మహోబారాజవంశ మెంత యుపకార మొనర్చెనో వారు గ్రహించిరి. ఆరాజకులమును వారు తమకన్న గురుతరస్థానమున గారవింపఁగోరుచున్నట్లు వారు తమమాటలయందు సూచించిరి. వారు యోగ్యమగుస్వాతంత్ర్యమార్గమునుండి తొలఁగిపోయినతోడనే యిఁక వారు నాలోకమును వీడిపోయి రని నేనెంచితిని. ఇపుడు వారు మరల నన్నుఁ గలిసికొనిరి. నేఁటిహీరాదేవి యథార్థముగ దేవియనుటకు నర్హురాలు. ఇట్టిప్రేమాస్పదుఁ డగు

సోదరుఁడు, గుణవతియగు దేవియుఁ గావించినసత్కారమువలన నేనెంతో సంతుష్టుఁడఁ గాచుందును !"

విజయ చాల వినయపూర్వకముగ నిట్లనెను:—"మహారాజా! తమకుఁ గావించిన యీసత్కారమంతయు వట్టికృత్రిమము. వాంఛితము. కేవలమృగతృష్ణ. మృగతృష్ణయందు సంపూర్ణమగు జలాభాస ముండియు నొక్కజలబిందువైన నుండనట్లు నేటిసత్కారము వట్టికపటము. అందు వాస్తవమగుస్నేహము సుంతయు లేదు."

చంప—నీవట్లు పలుకుట సత్యము నవమానించుట. నేటివఱకుఁ బరులమాటల విశ్వసించుటవలననే యోగ్యామహీంద్రాజవంశములనైర మింతవఱకుఁ బెరిఁగినది. ఇఁకముందునుండి నైకమత్యము నంది స్వాతంత్ర్యసంపాదనకై ప్రయత్నించుట మాని నీవంటి యల్పబుద్ధియగు బాలికవాక్యముల నమ్ముట నేను శ్రేయమని తలంపను. ఎవ్వరిప్రోద్బలముననో, నీవు నన్నుఁ దప్పుదారిఁ బట్టింప వచ్చినచో, నేను నీపలుకుఁ బాటింపను.

విజ—మహారాజా ! నేను తమ్ముఁ దప్పుఁద్రోవఁబట్టించుటకును దమలో వైరముఁ బెంచుటకును వచ్చితినని తమరేల తలపవలయును ! హీరాదేవి సత్యమూర్తిగను విజయ యసత్యమూర్తిగను మీకుఁ గన్పట్టుటకు హేతువేమి ! నేటివఱకు హీరాదేవి తమయెడ నెట్టిచర్యల నొనరించియుండెనో. మొదట నొక్కసారి యవి పరికింపుఁడు. అట్టిమాత్సర్యమున, వట్టినికృష్టమనోవ్యాపారమున నట్టిమాయికవర్తనమున సాత్త్వికప్రేమ యెట్టు లుద్భవిల్లఁగలదో యోజింపుఁడు. ఢిల్లీలోఁ దమకుద్వాదశసహస్రాధికారిత్వము లభించెననియుఁ, దమ రమీరులుగ నొనరింపఁబడిరనియు నెప్పుడు హీరాదేవి వినెనో యప్పటినుండియు, నామె యీకపటరూపము ధరించినది, తమ్మ్వప్రాస్థనా

పత్రికపైఁ దనకు విరుద్ధముగ గుప్తమంత్రణముఁ గావించినట్టియు, రెండుదినములక్రిందటనే సభామందిరమునఁ దనకు విరుద్ధముగ జనుల రెచ్చగొట్టుటకై యత్నించినట్టియు, హీరాదేవి యొక్క-శూరురాలుగ విపరీ యు, వరళయు, సత్యసంధయు నెట్లాయెను. ఏకోమలపరివృత్తులు హీరా దేవిని శాశ్వతముగ వదలివైచెనో, ఏయాదరసత్కారచింత హీరా దేవిని సంవత్సరములనుండి స్పృశించుట లేదో, ఏమైత్రికల్పనలు హీరాదేవి యొక్కఁడును దనచెంతనడుగైన నిడనీయలేదో, ఏస్వాతం త్రతాప్రేమను హీరాదేవి మాత్సర్యాగ్నియం దాహుతి యొనర్చి నదో, యాకోమలమనఃపరివృత్తులు, నాయాదరసత్కారచింత, యా మైత్రికల్పన, యాస్వాతంత్ర్యప్రేమము, నెట్టియనుభవాంతరము లేక యే, మఱి యేపరిబలకారణాంతరము లేకయే స్వయముగ నుజ్జీవితము లుగాఁగలవా! అంతరంగికములు బహిరంగములునగు హేతువు లెవ్వి యు లేకయే, యొక్క-రెండుదినములలో [illegible] స్నేహము, మచ్చరమునుండి యా[illegible]కినుండి దేవి, యేప్పుడు యెట్లు సంభవమగును! [illegible] కేవల కప టమయమనియు, నూహాభరిత మనియు [illegible] కారణ ములు చాలవా!”

విజయమాటలు విని చంపతరాయలు చకితుఁడయ్యెను. అతడు హీరాదేవిపూర్వవృత్తములను నేఁటిచర్యలను, నొండొంటితోఁ బోల్చు చుండెను. విజయ మఱింత యావేశమున నిట్లనియె:—ఇన్నికారణ ములుఁజాలకున్నచో, హీరాదేవిచైతన్యమునకు మఱియొక నిదర్శనము నీగలను. మహీబారాజకుటుంబమును సమూలముగ విధ్వస్త మొనరింప నామె, ఢిల్లీకేగి పాదుషాతోఁ దమదురణదులహాఖానుని బంధించినవృ త్తాంత మంతయుఁ జెప్పుటకై మాతండ్రిగారిని బంపియుండెను.

తండ్రిగారిమాటలపై రోషనారాబేగమునకు నమ్మకము కలుగకుండుటచే వాఁడిప్పుటచే బంధింపఁబడిరి. అది యప్రస్తుతము. రోషనారాబేగము తండ్రిగారిమాటలు విశ్వసించి యుండినచో నేఁడీమహామొగలురాజవంశమున కింతటియాపద వచ్చియుండునో కదా! మహారాజా! ఢిల్లీపాదుషాహలనుఁ దమకు సమూలవిధ్వంసముఁ గల్గింపఁగోరు నాహీరాదేవి తానేఁడా తమతో నింతటిసఖ్యవర్తన మొనరించునది ?

చంప——హీరాదేవి తొల్లింటివర్తనములు నాజ్ఞప్తియం దున్నవి, కాని నేఁటియామెచర్య బొత్తుగ మాయికమని యెట్లు చెప్పనగును !

విజ——ఆర్యా! హీరాదేవి మొదట ఘాతుకి. ఇప్పుడు రాక్షసి యైపోయినది. తొలుత నీచములగు హీరాదేవిచర్యలు నేఁడు ఘోరములగుచున్నవి. మున్ను హీరాదేవియుద్దేశ మమానుషమై యుండెను. అది నేఁడాసురమయి పోవుచున్నది. హీరాదేవి మాయావిని యగు బుందేలఖండశూర్పణఖ. ఆమె పూర్వప్రస్తుతవ్యాపారములయందు భేదము వొడమియే యుండుఁగాక. ఆమెయందు గుణములుమాత్ర మెన్నఁడును గలుగఁజాలవు. వ్యసనియగువాఁ డొకవ్యసనమునువీడినైచినను, వెంటనే ఘోరతరమగు మఱియొకవ్యసనమునఁ జిక్కును. ఇట్లే హీరాదేవి మునుపటితననైచ్యమును వీడినది. కాని వెంటనే యామె నవీనమగు నాసురస్వభావమును స్వీకరించెను.

చంప——హీరాదేవియందు సద్గుణములు రావని యంగీకరింపవచ్చును. కాని యామెస్వభావ మాసురమైపోయినదని యెట్లంగీకరింపనగును! ఆమెస్వాగతము పూర్తిగమాయాన్వితమని యెట్లు చెప్పఁగలవు!

విజయ ముఖముపై వెలయు సత్యభావమునఁ జంపతరాయల దృష్టి నాటుకొనిపోయెను.

విజ — నేను ప్రత్యక్షముగఁ జూచినదియు వినినదియు నాధారముగఁ గొని నేనీమాటఁ జెప్పుచుంటిని.

చంప — నీ వేమి చూచితివి. ఏమి వింటివి.

విజ — నేనామె ముఖముననే యామె మనసున నడఁగియుండు నాసురభావప్రసారమును గాంచితిని. ఇదికాక నేఁటి యాస్వాగతవిధాన మిషఁ బన్ని యామె యేఘాతుకకృత్యమును గ్రాహింపఁగోరుచున్నదో నేను స్వయముగ వింటిని.

చంపతరాయ లాతురతతో నిట్లడిగెను:— ఏమి! ఆ రాక్షసకృత్య మేదియో చెప్పుము.

విజ — మహారాజా! నింద్యమగు నా హీరాదేవికృత్యము తుచ్ఛమగు నామె యుద్దేశమును నోట నుచ్చరించుటకూడఁ బాతకమని తోఁచుచున్నది. ఆమాట చెప్పుటకు నొకటి రెండు గంటలు పూర్వమే హీరాదేవిముఖ మతిభయావహమైపోయెను. ఆమాట విని ఘోరకరణునివంటి యాగాఢశత్రుఁడు గూడ భయభీతుఁడై పోయెను. నా కామాట వినునరికిఁ బ్రాణసంకటమై పోయెను. ఆమాటయే నేనిప్పుడు పలుకవలసివచ్చినది. చెప్పకయుఁ దప్పదు — మహాత్మా! హీరాదేవి రేపటిభోజనమున విషము గలిపి తమప్రాణములఁ గొనఁగోరుచున్నది.

చంప — ఏమి! హీరాదేవి నాకు విషమీయఁగోరుచున్నదా! కాదు. కాదు. అట్లెన్నఁడుఁ గాజాలదు. నీవసత్యము పలుకుచున్నావు.

విజ — లేదు. మహారాజా! నేనిప్పుడు నసత్యముఁ జెప్పను. తమరు నమ్ముఁడు. నేను నిజముఁ జెప్పుచున్నాను. వింధ్యవాసినీదేవి

సాక్షిగఁ జెప్పుచున్నాను. నేనెప్పుడు నసత్యముఁ బలుకుట యెఱుఁగను.

చం——ఏమీ నీమాట యథార్థమే యగునా ? హీరాదేవి నాకు విషమిడఁగోరుచున్నదా ?

విజ——ఔను. మహారాజా ! యథార్థము. విజయ యెప్పుడు సత్యమునే పలుకును. తమరు నన్ను విశ్వసించినను సరే. విశ్వసింపకున్నను సరే. ముజ్జోక్కనాతి చెప్పుచున్నాను. రేపటిభోజనమున విషము కలుపఁబడును. మొదటినుండియుఁ దమ రేదేనిఁ బ్రతిక్రియ నాలోచింపకున్నఁ బశ్చాత్తపింపవలసివచ్చును. తమవంటిరత్నము వోవుటవలన బుందేలఖండమునందలి స్వాతంత్ర్యప్రేమికు లగునాత్మలు దుఃఖమగ్నములై పోవును. ఈదౌర్భాగ్య యగువిజయ తన్నుఁ దా దోషినిగ నెంచికొని పశ్చాత్తాపమునఁ బరితప్తయై పోవును. మహారాజా! తమరు నామాటల నమ్మక హీరాదేవివలలోఁ జిక్కకుందురుగాక. నిష్కారణముగ నాత్మనాశనమునకుఁ గారణభూతులు గాకుందురుగాక.

చంప——విజయా ! నీవు చెప్పినది సత్యమే కావచ్చును. కాని నాకింతను నమ్మిక కలుగుటలేదు. నీమాటల విశ్వసించి యెద్దియేఁ గార్యము నేయఁ బిదప నీమాట లసత్యములుగఁ బరిణమించినచో వ్యర్థముగ లోకమున నాకు నగుబాటు వాటిల్లును.

చంపతరాయలమాటలు విని విజయకుఁ జాల విచారము గలిగెను. అతనితో నింకనేమియు సంభాషింపకయే యటనుండి వెడలిపోవలయునని యామె యొకమారు తలఁచెను. తనమాటలపై నాతనికి విశ్వాసము లేనప్పుడు కానున్నదేదియో యగునని యెంచెను. కాని తానాయాలోచన మొనర్చునది యెవ్వరిఁగూర్చియో——తనప్రాణప్రియుఁ

డగుఛత్రసాలుని తండ్రినిఁగూర్చి యని యామెకు జ్ఞప్తికిరాఁగా నామె యీయాలోచనమును విడిచిపెట్టెను. అన్నితెఱఁగులయవమానముల సహించియు, సాధ్యమగునంతవఱకుఁ బ్రయత్నము సల్పి చంపతరాయలను విషప్రయోగమునుండి తప్పించుట యామె తనముఖ్యకర్తవ్యమని యెంచెను. ఆమె మిక్కిలి వినీతయై యిట్లనెను.

" మహారాజా! నామాటపైఁ దమకు విశ్వాస మొదవుట కేమి యొనరింపనగును. నామాటలందలి యాథార్థ్యము తమయెదుట నెట్లు ప్రమాణితముకాఁగలదు? "

చంప—ఎద్దియేనిఁ బ్రత్యక్షప్రమాణముఁ జూపిన విశ్వసింప వచ్చును.

ఆసమయముననే చంపతరాయల శోకమంగళమూర్తి గాంభీర్యభరితముగఁ దనవంకకు వచ్చుచుండుట కానవచ్చెను. అతఁ డేమియో పలుకఁబోవుచుండ నింతలో నామూర్తియే యిట్లుగడించెను.

" చంపతరాయా! నీవు నన్ను గుఱుతించితివా! "

చంప—" ఆ "

మూ—నీవు బాగుగ నెఱుఁగుదువుగదా నాకసత్యమన్నఁ గడు నేవగింపని!



చం—ఆ.

మూ—నామాటయందు నీకు విశ్వాసముండునా!

చాలసేపటివఱకు యోజించి చంపతరాయ లామొదటియుత్తరమునే యొసంగెను.

అదివిని యాభవ్యమూర్తి ప్రసన్నతతో నిట్లనెను:—

" చంపతరాయా! ఈబాలికమాటలయం దవిశ్వాసము వీడుము. ఈమె సత్యమూర్తి. ఈమె నీతోఁ బలికినదంతయు నిజము. "

చంపతరాయ లేమియు ననలేదు.

మూ—హీరాదేవియాచరణముల విమర్శించుటకు నాకధికారము లేదు. ఐనను నీకుఁ బ్రతీకారమొనర్చుట కామెపన్నినయుపాయము నాకిష్టము కాదు. నీకుఁబ్రతికృతి యొనర్చుటకై నీప్రాణములఁ గొనుటకై నేను హీరాదేవికన్న నెక్కువయాత్మైక్యముతో నున్నాను. నిన్నీలోకమునుండి పంపివైచుటయే నాతీవ్రప్రతిజ్ఞ. ఐనను నేను హీరాదేవియానురమార్గము నవలంబింపనేరను. చంపతరాయా! యుద్ధక్షేత్రమున నాతో ద్వంద్వయుద్ధముఁ జేసి చచ్చుట నీకిష్టమైనచో నీయమాటల సంపూర్ణముగ విశ్వసించి రేపటియాపదనుండి కాపాడుకొను నుపాయ మరసికొనుము. నాప్రతిజ్ఞను స్మరించుచు—నా శత్రుఁ డన్యహస్తమున, నదియు నింతనీచముగఁ జంపఁబడుట నేను సహింపఁజాలను."

చంపతరాయలు చాల కలఁతఁజెందెను. అతఁడు తనఖడ్గపుం ఖముపైఁ జేయియిడి యెదుటివ్యక్తివంకకుఁ జూడసాగెను. ఆసమయమున మరల నావ్యక్తి మిక్కిలిశాంతభావమున నిట్లుపలికెను:—

"శస్త్రప్రయోగమున కిది సమయముగాదు. నాకోమలమనోవృత్తిప్రేరణచే నిన్నిపుడు హీరాదేవిఘోరకృత్యమునుండి రక్షింపఁ గోరుచున్నాఁడను. నీపైఁబడనున్నయాపద నీకు నేను మున్నుగనే తెలియఁజేయ యత్నించితిని. కాన నీహృదయముగూడఁ గొంతకరఁగియుండును. ఇట్టిసమయమున మనయాయుధములు సంపూర్ణముగఁ బనిచేయఁజాలవు. చండకరుఁడు భూమిని సంతప్త మొనరించుచుండ వైరాగ్నిఁ బ్రజ్వలింపఁజేయు మనమస్తములఁగూడ బాగుగఁ గాల్చుచుండ, నెదుట శవరాశి పడియుండ, రుధిరప్రవాహములు ప్రవహించుచుండ, నారక్తమునసే మనమిరువురము సంసిక్తులమై యుండ నానమ

యమున మనశత్రుములు ప్రియుక్తములు కానలయును. ఇట్టిశాంతి మయ మగునిశాసమయమున, శయనాగారమున నెవ్వను నెట్టివీరున కుఁగాని జచ్చుటకుఁగాని చంపుటకుఁగాని యిచ్చవొడమఁబోదు."

చంపతరాయల కామాట సమ్మత మయినది. అతఁడు కృపాణమునుండి తనచేయి తీసివైచెను.

ము—చంపతరాయా! నాకార్య మంతయు విజయ కావించివైచినది. ఇంక నేను పోవుదును. నీవీమెమాటయందు విశ్వాస ముంతువుకాదా!

చం—ఉంతును.

కొంచెముసేపటిలో నాభవ్యమూర్తి యదృశ్యమైపోయెను.

విజ—మహారాజా! ఇప్పుడు నామాటయందుఁ దమకు విశ్వాసము కలిగినదా?

చం—శుభకరణునిమాట నెవ్వరు విశ్వసింపరు! శుభకరణుఁడు నాకు శత్రువు. స్వాతంత్ర్యమునకు శత్రువు. ఐన నాతఁడు సత్యమునుండి తొలఁగునని స్వప్నముననైన నేనంగీకరింపఁజాలను. విజయా! హీరాదేవిసమ్మాన మంతయు వట్టినటన యని నాకిపుడు సంపూర్ణవిశ్వాసము గలిగినది. తనవంచనం బడి రేపు నేను మరణింపవలయు నని యామె వాంఛించుచున్నది. దానినుండి తప్పించుకొనుట కుపాయముఁగూడ నేదియేని నీవే యుపదేశింపుము.

విజ—(మిగులసంతసముతో) మహారాజా! తిమరు దయయుంచి నాపలుకుఁ బాటించి నాప్రయత్నమున సఫలనగుటకవకాశము నాకొసంగినారు. రేపుభోజనసమయమునఁ దమయెదుట నిడుభోజనపాత్రము స్వీకరింపక యెద్దియోదోసము నెంచి దానిఁ ద్రోసివేయుఁడు.

ఇదికాక, హీరాదేవి తమ్మేపదార్థము భుజింప ననురోధ మొనర్చునో దానిం దమరు భుజింపవలదు. అంతే—ఇఁక హీరాదేవి యాట యేమియు సాగదు. రేపుదయముననే నేను మొదట గిరిజతోఁ గలిసికొని వృత్తాంత మంతయు నడిగెదను. ఏదేని విశేషవిషయ మున్న సత్వరమే తమ్ముఁ గలిసికొని తెలియఁజేసెదను. కాని భోజనసమయమువఱకుఁ దమ్ము నేఁ గలిసికొనకున్నచో నేనిప్పుడు చెప్పినట్లు చేయుఁడు.

చంప—(శాంతముగ) సరియే. నాకంతయుఁ దెలిసినది. కాని నీకు హీరాదేవివార్త లెఱింగించుచుండు నీగిరిజ యెవరు!

విజ—ఆమె హీరాదేవికిఁ జాల విశ్వాసపాత్రి యగునొకదాసి. కాని గిరిజ యామె యయోగ్యకథాకార్యములకుఁ జాల వగచుచుండును. ఆగుప్తమంత్రణావృత్తాంత మామెయే నాకెఱింగించెను.

చం—ఇప్పు డిటఁ గల్గు రాజులు సరదారులు నందఱు నానాఁటి మంత్రణయందుఁ బాల్గొనిరా?

విజ—చిత్తము. మఱియు నప్పటినుండియు వీరందఱు నిచ్చట నిలిచిపోయిరి.

చం—నాప్రార్థనాపత్రము నవమానించుటకుఁ, దద్విరుద్ధముగఁ బ్రజలఁ బ్రోత్సహించుటకు, స్వాతంత్ర్యప్రయత్నముల విఘ్నమాపాదించుటకు, నన్నివిధములఁ బడఁద్రోయుటకునై కదా యానాఁటి మంత్రణము జరిగినది. స్వధర్మమును నాశనముసేయ, బుందేలుఁ బుందేలత్వమును శూన్యమొనర్చ, దేశమును బరాధీనముఁ గావింపనే కదా యానాఁడు వీరందఱు సమావేశమైరి! బుందేలురసంఘశక్తిని, ఐకమత్యమును విధ్వంస మొనర్పుటయే కదా వీరిముఖ్యాశయము! ఓపరమేశ్వరా! ఇట్టి నికృష్టకార్యములు నీవెట్లు చూడఁగల్గుచుంటివి! ఇట్టి హృదయశూన్యులగు రాక్షసులు నీన్యాయ్యరాజ్యమున మనుష్యులలోఁ

గలసి మెలసి యెల్లు నివసింపఁగనుచున్నారు. సరే. ఇక్కడి కిదియు నైనది! బుందేలఖండపురాజసంస్థానములనుండి నా ప్రార్థనాపత్రిక కుత్తరము లభించినది. బుందేలఖండస్వాతంత్ర్యపతాకక్రింద నొక్క ప్రభువైన నిలువరాఁడని యిఁకఁ దెలిసిపోయినది. ఇఁక వారిమిత్రత్వ శత్రుత్వములు నిర్ణీతము లైనవి. కావున మొదట నీయింటివేగుల నాశ మొందింపవలయును, మంచిది. విజయా! ఇఁక నీవేగుము. నీవు ఝాంసీదుర్గమున కేగినపిదప నీజననియగు సుఫలాదేవికి నాసందేశ మొండె ఱిఁగింపుము. మహారాజు చంపతరాయ లామె పుత్రికాలలామనిస్తులగుణ జాలముఁ గాంచి యెంతయు సంతసించె ననియు, బుందేలఖండమున సుఫలాదేవివంటిమాతలే యుండుదో దేశౌన్నత్యస్వాతంత్ర్యముల విలంబ మేమియు నాశంకింపరాదనియు, నాపలుకులుగ నీవామెతోఁ జెప్పుము. యథాసాధ్యముగ నామె కంచుకిరాయల నుచితమార్గము నకుఁ ద్రిప్ప యత్నించునదిగ నాప్రార్థన యనికూడఁ దెలియఁజేయుము.

విజ—(కంచుకి యున్నవాఁడై) మహారాజా! ఇంకను దండ్రి గారి నుచితమార్గమునకుఁ దెచ్చుటకుఁ బ్రయత్నమా! ఇప్పు డాయన ఢిల్లిలోఁ బంధింపఁబడియున్నారు.

చం—నాకతనిసమాచారము పూర్తిగఁ దెలియదు. నీకుఁ దెలిసినది చెప్పుము.

అటుపై విజయ కంచుకిరాయలు హీరాదేవితోఁ గలిసికొనుట, రహస్యాలోచనము సలుపుట, తదనుసారముగ ఢిల్లి కేగుట, యచ్చట బద్ధుఁడగుట—యావద్వృత్తాంతము నాతనికిఁ జెప్పెను. అది విన నాతనికిఁ జాల నక్కజము జనించెను. అతఁ డిట్లనెను:—"ఇపుడు రోషనారదినములుగూడఁ గడచినవి. ఐన నామె కడుదుష్టురాలు. క్రూరురాలు. కంచుకిరాయలఁ దనకడ బద్ధునిఁజేసి యామె యొనర్చి

దేమి యుండును? కనుకనే వైళము రణదులహాఖానుని నాకడనుండి విముక్తునొనరించెద. ఏలయన, నాతని విడలక కంచుకిరాయలకు విముక్తి కలుగదు. (కొంచెము ఆఁగి యోజించి) ఒరుఁ డెవ్వడేనేగి రోష నారతో రణదులహాఖానువృత్తాంతముఁ దెల్పినను నామెకు నమ్మిక ముండదు. కాన రణదులహాఖాను స్వయముగ నటకేగి తనదుస్థితిఁ దెలిపికొన్నచో నప్పుడు రోషనార తాన కంచుకిరాయల సాదరముగ విడిచివైచును."

విజ—అట్లగునెడలఁ దమకు గొప్పకష్టము సంభవించునుగదా! తమరు రణదులహాఖానుని బంధించి యుంచితిరని పాదుషా యెఱుఁగఁ గనే తత్సేనలు తమరాజ్యము ముట్టడించును. ఇది పాదుషాతోఁ గల హముసకు సమయము కాదని తమకు బాగుగఁ దెలియనే తెలియును.

చంప—ఎట్టకేల కెద్దియో యొక్కతెఱఁగున నేను రణదుల హాఖానుని బంధించినవార్త పాదుషా కెఱుకపడక మానదు. ఇట్టి యెడ ముందుగనే రణదులహాఖానునివదలివైచుట మేలని నాతలఁపు. ఢిల్లీలో దర్బారుదినపేళఁ బాదుషా మాయెడఁ జూపినమంచితనమునకు మాఱుగ రణదులహాఖానును విడుచుట చాలమంచిది. దీనపేమియుఁ గాకున్న నధమపక్షమున లోకనిందకు వెఱచియైనఁ బాదుషా కొంత కాలము విప్లవముఁ గావింపకుండుటమాత్రము నిక్కువము. ఆయవ ధిలోనే నేనీగృహచోరుల నణఁచి వైతును. ఏగూఢనీతిచే నేను దర్బారున సమీరుపదవిని నధికారిత్వమును స్వీకరించితినో, రణదుల హాఖాను నింకను బందెమునుంచుటవలన దానికేమియు ఫలము చేకు అదు—జయసింహునియాయోజనము జరిగనున్నది. ఎంతవఱకు బుం దేలఖండ మంతయు నుచితరీతి సిద్ధపడదో, యెంతవఱకు నిచ్చటిదేశ ద్రోహులు పూర్తిగఁ గడతేఱకుందురో, యంతపర్యంతముఁ బాదు

హాను బహిరంగముగ నెదుర్కొనుట తగదు. అతనిని మాయచే నుంచఁదగును. ఇంతలో నతనితోఁ బగపెంచుట బుందేలఖండమునకు హానికరము. రణదుల్లహాఖానును వదలివైచుటవలన నాకేమియు నష్టము గలుగదు. నీవు నాయెడఁ గావించినయుపకృతికిఁ బ్రతికృతి పూర్ణముగ నెట్లును దీఱదు. ఐన నేను నీజనకునిఁ దప్పక కడుశీఘ్రముగ విడిపింతును. రణదుల్లహాఖానుని విడిపించివైచి ఢిల్లీకిఁ జేర్చురా రేపు వేకువనే యెవనినైన మహోబాకుఁ బంపుదును. ఇఁక నీవు చనుము. చింతాశంకలఁ దక్కియుండుము. నీతండ్రి యనతికాలముననే ముక్తుఁడై యేతెంచును.

విజయ యటనుండి బయలువెడలెను. అప్పటి నామెహృదయమంతయుఁ గృతజ్ఞతాభావములు నిండియుండెను. పోవుచున్న దామె ద్వారకంటకమున నిట్లనెను:—" మహారాజా! తమరు మాకెంతయో నుపకార మొనర్చితిరి. ధాంధేరు రాజవంశము దీనికై తమకెప్పుడును కృతజ్ఞమై యుండును. ఈశ్వరుఁడు కటాక్షించినచో స్వాతంత్ర్యసంపాదనమున తమకు మొట్టమొదట ధాంధేరునుండియే సాయము లభింపఁగలదు."

చంపతరాయలశయనగృహమునుండి వెలువడి విజయ వెడలిపోయెను.

* * * *

మఱుచటినాఁడు పెందలకడనే విందుసన్నాహము పెద్దయాడంబరమున జరుగుచుండెను. శుభకరణుఁడుదక్క బుందేలఖండమందలి రాజు లెల్లరు నాఁటివిందునఁ బాల్గొనిరి. పర్వతసింహాసనపీఠము చంప

తిరాయనిదండనే యుండెను. నడుమనడుమ నాతని సంతోషపఱచు టకై పర్వతసింహుఁ డెద్దియేనిసత్కారచేష్ట నాచరించుచుండెను. హీరాదేవి మిక్కిలిశ్రద్ధతో వడ్డించునేర్పాటులఁజూచుచుండెను. ఇంత మందిపరిభవర్యులైక్యమందిరనియు వీరెల్లరు స్వాతంత్ర్యప్రాప్తికై పోరాడుదురనియు, ఛత్రిసాలుఁడు లోలోన నుప్పొంగిపోవుచుండెను. తనజనకునిఁ జంపతిరాయల నించుకగూఢవిచారనిమగ్నునిగఁ గాంచి యతఁడు చాలఁగనచ్చెరువందెను. తనమనోరథము లెల్ల సఫలములు కానున్నవని హీరాదేవి తలఁచుచుండెను. సన్నాహ మంతయు నయి నది. హీరాదేవి మనసునఁ గులుకుతెరగలు లేవఁదొడఁగెను. తనము ఖమైఖరినుండియే జనులకుఁ దనతోపలిగుట్టుజాడ తెలియునేమోయను భీతిచే నామె యించుకతడ వటనుండి తొలఁగియుండెను. భోజనారం భసమయ మాయెను. చంపతిరాయలు విచారనిద్రనుండి యొక్కసా రిగ మేల్కాంచెను. పక్వాన్నభరితమగుతనముంగిటిబంగరుపాత్రముఁ దిలకించి యతఁడిట్లనెను:—“నేను బంగరుపాత్రమున భుజింపను. కాన దయసేసి నాకొకకొకపాత్రముఁ దెప్పింపుఁడు.”

హీరాదేవి నేఁడెట్లేనిఁ జంపతిరాయలఁ గడుసంతుష్టునిఁ జేయఁ గోరుచున్నదని పర్వతసింహుఁడు తలఁచుచుండెను. అతనియాకోర్కె నుఁదీర్చుటకై నవ్వుచు నతఁడిట్లనెను:—“మఱొకపాత్రి మేల! నాపా త్రము వెండిది. రండు నేఁడుమనయిరువురిపాత్రముల మార్చుకొం దము. ఈనప్రేమమయమగువ్యాపారము మనకెల్లపుడు స్మరణయం దుండుగాక.”

చెంతనున్నపాచకుఁడు పర్వతసింహునియాజ్ఞను నైళంబ పాలిం చెను. పర్వతసింహుఁడు గడుహర్షమున నున్నపాత్రమందలిపదార్థ ముల భుజించుట కారంభింపఁ జంపతిరాయలకు మరల నొకసారి విజ

యు చెప్పినది నిక్కము కాదా యనిసందియము గలిగెను. ఇంతలో హీరాదేవి తిరిగి యటకు వచ్చెను. పాత్రములు మాఱియుండc జూచి యామె కడు క్షుభితహృదయమున నిట్లనెను:—

« ఏమైనది! పాత్రము లెవరు మార్చిరి! ఇపు డేమగునో! ఇందు సగముపదార్థములు తినివైచిరే!"

హీరాదేవివ్యాకులతc గాంచి పర్వతసింహుcడు నవ్వుచు నిట్లు పలికెను:—« లోకమున మైత్రి స్థిరపఱచికొనుటకై యుష్ణీషముల నన్యోన్యము మార్చుకొనుచుందురు. మేము మాపాత్రలను మార్చుకొంటిమి! ఇందాశ్చర్యపడుటకు నాతురతపడుటకు నేమున్నది!"

ఆసమయమునc జంపతరాయలు దృఢగంభీరదృష్టితో హీరాదేవివంకc జూచుచుండెను. ఆమెకుc దనభవిష్యము విస్ఫుటముగc గన్పట్టcదొడcగెను. ఇంకcదనసౌభాగ్య మొకటిరెండుగంటలకన్న నెక్కువసేపుండదని యామె తెలిసికొనెను. శత్రునాశముకొఱకు పన్నినపన్నుగడ తననాశమునకే యయ్యెనని యామె కెంతయు శోకము గలిగెను. ఆశోకముననే యామె యింక మాటాడక తనశయనాగారమునకరిగెను.

చంపతరాయ లింతతడవు గంభీరముగ హీరాదేవిమనోభావములc బరిశీలించుచుండెను. ఆమె పోవుటతోడనే యాతcడు పర్వతసింహునిచేయిc బట్టుకొని యిట్లనెను. « ఈబంగరుపాత్రయందలిపదార్థముల విషము కలిసియున్నది. ఇందొకకబళమైన భుజింపరాదు."

చంపతరాయలు పర్వతసింహునిభోజనమధ్యముననే మాన్పించినను ఫలమేమియు లేకపోయెను. ఒక్కగంట యగునరి కాతనిపై విషప్రభావము కన్పడcజొచ్చెను. వివిధౌషధము లొసంగcబడినవి. ఓర్ఛాలోని గొప్పగొప్పవైద్యు లెన్నియుపాయము లొనర్చిరి. కాని

హీరాదేవికలిపినవిష మనన్యప్రతిఘటనీయప్రభావశాలియై యుండెను. పర్వతసింహునిశరీరపాటవ మంతకంతకుఁ గృశించిపోవుచుండెను. రాజవైద్యులందఱు నిఁక గడియ రెండుగడియలలో మహారాజుగారు కాలున కతిథులు గాఁగలరని చెప్పిరి. ఉపస్థితులగువారెల్లరు మిక్కిలి దుఃఖతప్తులైరి. విమలాదేవిసంరోదనము మితిమీఱిపోయెను. తుదకుఁ బర్వతసింహుఁడు మతిశక్తులనన్నిటిఁ బ్రోగిచ్చెను. "నాకొఱ కెవరును విచారింపకుఁడు. నేనొనర్చినఘనకార్య మేదియునుఁ దలచికొని నాకొఱకుఁ బ్రజలు దుఃఖించుటకు నేనట్టిదేమియు నాజన్మమునఁ గావించియుండలేదు. బిడ్డా! విమలా! నేఁడు నేనిన్ను బంధనములనుండి విడిపించుచున్నాను. ఇఁక నీవాపాలికి హీరాదేవికడనుండకుము. ఈశ్వరుఁడు నీకు మంగళమొసంగుఁగాక!"

పర్వతసింహుఁడు చాలఁగఁ జెప్పఁగోరుచుండెను. కాని బాధ మిక్కుటమగుచుండుటచే నేమియుఁ బలుకఁజాలకుండెను. కొంచెమునే పాగి యతఁడు మరల మెల్లమెల్లగనిట్లనెను:—

"చంపతరాయా! నేటిదనుక నేను మీయెడఁ గావించిన యనుచితనీచవర్తనమునకై నన్ను మన్నింపఁగోరుచున్నాను. నన్ను క్షమించితిమని వచింపుఁడు."

చంపతరాయలు రుద్ధకంఠమున నిట్లనెను:—నేను మిమ్ము క్షమించితినో లేదో మీకెల్ల తెలియనగును! ఈశ్వరకృపవలన నెట్లో మీరీయాపదనుండి తొలఁగితిరేని, నేను మిమ్మెంతగ క్షమించితినో మీకెఱుకవగును.

పర్వ—ఇంక నేఁబ్రతికెదనని యాసించుట వ్యర్థము. నేటివఱకు నేఁగావించినదుష్కృత్యములవలనఁ గలిగెడునరకపీడ యెల్లను గలుగును. కాని యది యీవిషవేదనవలననే కొంత మచ్చుచూప

మొదలిడినది. ఇఁక శ్రేబనుకునాశ నిరర్థకము. మృత్యువునాకుఁ జాల చేరువగఁ గన్పించుచున్నది.

తర్వాతఁ గొంతతడవు పర్వతసింహుఁడు విశ్రాంతికొఱకాగెను. కొంచెమాగినవెనుక మరల నాతఁడు చిక్కనయెలుంగుతోఁ బలుకసాగెను:—

"ఆహాంతకి యిట లేదుకద!"

హీరాదేవి యట లేదని యతనికిఁ దెలిసినతోడనే మఱల నాతఁ డార్కృశించుచున్నస్వరముననే యిట్లనెను:—

"బాగున్నది. అవసానకాలమున నాపాతకిని కన్పడకుంకుట యు నదృష్టమే. చంపతరాయా! కొంచె మింకనుఁ జెంతకురంము. హృదయము తేలికపడునంతదనుక నేను సుఖముగ మరణింపఁజాలను. ఈసమయమున నిటఁగూడియున్నరాజు లందఱి యెదుట నేనియోర్ఛరాజ్యమును మీకిచ్చుచున్నాను. మీరీసింహాసనమున ఛత్రసాలు నాసీనుఁ జేయుఁడు.

చంప—వలదు. మీయిచ్ఛకోర్కె నెఱవేర్పఁజాలను. ఓర్ఛ రాచగద్దెకు నుత్తరాధికారి యువరాజు విమలదేవుఁడే కాన ఛత్రసాలుఁడు స్పృశింపనైనఁజాలఁడు. విమలదేవుని గద్దెపైఁ గూరుచుండఁ బెట్టి కాపాడుచుండుటమాత్రము నాకర్తవ్యమగును.

పర్వతసింహుఁడు కడునాశ్చర్యమున నిట్లు పలికెను:—ఏమి! విమలదేవుఁడు గద్దె నెక్కునా! చంపతరాయా! విమలదేవుఁడు రాజసింహాసనారూఢుఁడగుటకు నర్హుఁ డెన్నఁడునుఁ గాఁడు. అతఁడు నా కొడుకుకాఁడు. శాస్త్రసమ్మతముగ నుత్తరాధికారియుఁ గాఁడు. నాను వాస్తవమున నుత్తరాధికారులు మీరే. కనుక నేనోర్ఛరాజ్యమును మీకిచ్చివైచుచున్నాను. ఛత్రసాలుఁ డోర్ఛాసింహాసనముపైఁ గూ

రుచుండుట నాకోరిక. విమలదేవుఁడతనితో నుండి సౌఖ్యమునఁ దన కాలముఁ బుచ్చవలెను. వింధ్యవాసినికూడ మహోత్సవసమయమున నిదియే తనయిచ్ఛగాఁ దెలిపెను. విమలా! నీవెవరివో నాకుఁజెప్పుము. పిదప నేను బెడిదంపునరకమునకుఁ బోవసిద్ధపడుదును.”

ఆసమయముననే హీరాదేవి కర్కశరవమున నఱచుచు నాగదిలోనికిఁజొచ్చివచ్చెను. ఆమె యిట్లు పలికెను:—“నరకమునకుఁ బోయినను సరే. విమలదేవునిఁ గూర్చి యొక్కపలుకైనఁ బలుకవలదు. నీవు స్మృతితప్పి పేలుచుంటివి. కనుక నీతోడను నిచ్చటిరాజులందఱి తోడనుఁ జెప్పుచుంటిని. విమలదేవుఁడే యోర్ఛాకు యువరాజు. అతనికే గద్దెలభించును. ఏతద్విరుద్ధముగ నొరునెవ్వనిని సింహాసనమధిష్ఠింపఁజేయ నెవ్వరునుఁ బ్రయత్నింపరాదు.”

ఇదివినిన పర్వతసింహునకు మేరలేనిక్రోధము కలిగెను. ఆక్రోధమూలమున నాతనికి మృత్యువు కొంతముందుగనే లభించునేమోయని యెల్లరకు భయము గలిగెను. లేచి నిలుచుటకై యతఁడు చాలవ్యాకులయత్నము సలిపెను. నిలువ సాధ్యముకాదని కూర్చుండనైనఁ బ్రయత్నించెను. అదియు నశక్యమగుటచేఁ బట్టరానికోపముతో నాతఁడు హీరాదేవివంకఁ జూడనారంభించెను.

ఇంతలో హీరాదేవి యతనిచెంతకు వచ్చి నిల్చి తనసౌభాగ్యాలంకారముల దీసి విసరివైచుచు, లలాటమందలి తిలకముఁ దుడిచివైచుచు నిట్లు పలికెను:—“హీరాదేవి నీభార్యకాదు. ఓర్ఛారాజమాతపైఁ గోపముఁ జూపుటకు నీకేమియు నధికారములేదు.

పర్వతసింహునికోపము పరమావధి నందెను. తనదేహమున మిగిలియున్న సమస్తశక్తినిఁ బ్రోవుసేసి యతఁడిట్లనెను:—

"పో! పాపినీ! రాక్షసీ! హంతకురాలా! చండాలురాలా! అధమురాలా!—" ఇంక నాతని కెక్కుడు పలుకుటకు శక్తి లేకపోయెను!

---

## పదునాఱవప్రకరణము.

### కార్యసాఫల్యమునకు విఘ్నము

అరణ్యాధిపతి యగు పంచాననము నానావన్యమృగముల పాలిటి భయంకర సంహారకారి యైనను స్వసంతానముపై దాని కత్యధికమగు ప్రేమ యుండును. సూర్యదేవుఁడు విశ్వము నాత్మతేజస్తప్తము నొనరించుచున్నను గగనోద్యానవిహారిణి యగు ముగ్ధకన్య (కన్యారాశి) పై శీతలదృష్టిప్రసారమే యొనరింపఁగోరును. తేజస్వులగు సూర్యచంద్రులనైతము లుప్తప్రాయులుగ నొనర్చి యహంకారగర్జనములతో గగనవీథినెల్లెడలఁ దాండవించు మేఘదేవుఁడు నిజాశ్రితులపై నానందమునఁ గృపావర్షముఁ గురియుచున్నాఁడు. ఆవిధముననే ఢిల్లీసింహాసనముపైఁ గూరుచుండి ప్రజల ననేకవిపత్తులపాలొనర్చు మతధర్మాంధుఁడగు పాదుషా కూడ నంతఃపురమున ననేకవిధముల సంతానానందమున మగ్నుఁడగుచుండును. ఆసమయమున నతఁడు మతావేశము, రాజ్యతృష్ణ, అధికారమదము, మున్నగు దుర్గుణములచే విముక్తుఁడై, ప్రేమస్వరూపుఁడై యుండును. దైవప్రార్థనమునఁ గుదురని మనశ్శాంతి, పండితులతో డిధర్మవిమర్శనమునఁ గలుగని సుఖము, కుమారులు వదువుల చేఁ

గలుగని యానందముఁ దనప్రియపుత్త్రిక యగుబదరున్నీసాను గాంచు టప్పుడనే తనకుఁ గలుగునని యతఁడు చాలకాలమునుండి యెఱిఁగియే యుండెను. తనకుమారులు తనవలెనే దురాశాపూరితులై తత్సంసిద్ధులై తన్ను సింహాసనభ్రష్టునిఁ గావింప వెనుకాడరనుభయంకరశంకా పీడితుఁడై యాతఁడు యథాశక్తిని వారికి దూరముగనే యుండెడి వాఁడు. రాజపుత్త్రియగు జేబున్నీసా తక్కుంగలయంతఃపురకాంత లనే పోలి స్వసఖీపరివృతయై యుండెడిది. అంతఃపురమునందలి యావశ్యకకార్యములందే మగ్నయై యుండెడిది. అందుచేఁ బాదుషాదృష్టి విశేషముగ నావంకకుఁ బోవుటలేదు. బదరున్నీసా మందహాసవదన. నిష్కపట. సరళ. మిగుల బుద్ధిమతి. మఱియు బాల్యమునుండియుఁ దండ్రియగు నలంఘీ రామెను బహువిధములఁ బ్రేమించుచుండెను. రాజకీయము లగుచిక్కులచేఁ దనమనము వ్యాకులితమైనప్పు డాతఁడు రాజసభనుండి వెలికి వచ్చి కుమార్తెయగు బదరున్నీసామందిరముదెస కరుగుచుండును.

నేఁడాంతరంగికరాజసభలో దేవగడముగ్గవిషయము చర్చింపఁబడెను. అందుచే సార్వభౌముని మనసు కొంచెము వ్యాకులిత మయ్యెను. బహదూర్ఖాఁ కోకా చిరకాలమునుండియు ముట్టడించియున్నను దానిని స్వాధీనపఱచుకొనలేకయ్యె. శీఘ్రముగఁ దనసాయమునకై యొకమహాసైన్యము రానున్నదో యట్టిది యెత్తివేయఁబడునని యతఁ డొకపత్త్రముఁ గూడ నంపెను. ఈవిషయమును జర్చించుటకే నేఁడు పాదుషాహ దనయిష్టసభ్యులఁ గూడి యంతరంగికసభాస్థానమునఁ జాలసేపు కూరుచుండనయ్యెను. తుదకు జయసింహుఁడు దేశమున నందందు విచ్ఛిన్నులై తిరుగుచున్నకొంతసైన్యమును నొకమాసములో రప్పించి, దేవగడమునకుఁ బంపెదనని చెప్పెను. అట్లే నిశ్చయించి

పాదుషా యాంతరంగికసభనుండి వెడలి వచ్చెను. అట్లయ్యు నాతని మనసు శాంతి నందలేదు. అందుచే బదరున్నీసామందిరమున కేగవలసిన యావశ్యకత కలిగెను.

పాదుషాకుఁ బరమప్రియయుఁ బ్రధానపత్నియు నగునాయషాబేగము మందిరమునకు సమీపముననే యమునాభిముఖముగు బదరున్నీసానివాసస్థానముండెను. దానిపడమటిభాగమున పావన[illegible]ప్రవాహముండెను. ఎదుట గృహోద్యానము [illegible] యగు నాయషాబేగముయొక్కయు దక్షి[illegible] ముఅజ్జముయొక్కయు నివాసస్థానము లుండెను. [illegible] బరివేష్టితమై యీస్థానము బదరున్నీసాదివ్యసౌందర్యముచే [illegible] ముగుచుండెను. అనేకమందిరములను దాటుచు, ననేకములగు విలాసస్థానములందును సమీపస్థములగు సుందరదృశ్యములందును మందిరములందును వినంబడు మధురసంగీతముఁ గొంచెమైన నాలకింపక పాదుషా బదరున్నీసానివాసస్థానముఁ జేరెను. ఆసమయమున బదరున్నీసా యమునానదీప్రవాహము వీక్షించుచు సాలోచనయై కూర్చుండి యుండెను. [illegible]గమనవార్త వినఁగనే స్వాగత మొసంగ నామె బయటికి వచ్చెను. ఆమె యత్యంతప్రసన్నవదనయై [illegible] కాన్పించినను జాలసేపటినుండి చింతావృతయై కూర్చుండియుండుటచే నామెముఖమున స్తబ్ధతాగాంభీర్యములచాయ యించుక కాన్పించుచునే యుండెను. అట్లయ్యు నామె నిసర్గసరళయగుటచే దేవతవలె నుండెను. ఆమెను గాంచఁగనే యౌరంగజేబు మహానందమునఁ దనచింతలనన్నిటి మఱచిపోయెను. బదరున్నీసా యతని వెంటనిడికొని సమీపమునున్న పెద్దగదిలోనికి వచ్చెను. పాదుషా కూర్చుండినంతఁ బ్రథమమున లోకాభిరామాయణ మారంభమయ్యెను. కాని యామె మొదటివిచారమామెను

గంభీరముగనే యుండుటచే, సంపూర్ణముగఁ బరిస్థితి నొసంగకుండుటచే బాదుషా కామె చింతాకారణముగ నయ్యెను. సార్వభౌముఁడు ప్రసన్నుఁడై యుండుటఁ గాంచి యామె యీసమయముఁ దనకార్యసిద్ధికై మిగుల నుపయుక్తమైనదిగఁ దలఁచి తనప్రసంగము నీవిధముగఁ బ్రారంభించెను.

“ మహారాజా! ఆకసమందలి యీనక్షత్రము లెల్లప్పు డీఁగాడుచునే యుండును. కాని యాయాటలయందు వానిమనసెన్నఁడు విరక్తిఁ గనదు. యమునాప్రవాహము రాత్రిందివము లిట్లు ప్రవహించుచునే యుండినను దానిమనసు గూడ విసుఁగునందుట లేదు. కమలము లెల్లప్పుడును బుట్టుచునే యుండును. వికసించుచుండును. వాఁడిపోవుచుండును. విదళితము లగుచుండును. ఐనను నవి నిరతానందమున నుండును. వాని కీర్తిప్రాపదయొక్కయు, విచారముయొక్కయుఁ దలఁపే యుండదు. కాని మానవునియవస్థఁ బరికింపుఁడు. వానిస్వేచ్ఛాభోగములకై యింతసామగ్రి సమకూడియే యున్నను సామాన్యముగ వాఁడువిచారమగ్నుఁడే యైయుండును. సుఖావకాశములు మిగులఁ గొలఁదిగనే యుండును. విహంగము లెగురుచు నెగురుచు నలసి విశ్రాంతిఁగొన నప్పుడప్పుడు వృక్షములపై వ్రాలుచందమున మానవుఁడును స్వకార్యముల నాయాసముఁ జెంది వివిధవిలాసములవంకకుఁ బరుగెత్తుచుండును. అట్లు బాగుగఁ బరుగెత్తినను వానికి సంపూర్ణస్వేచ్ఛ దొరకదు. నేఁటివఱకు [illegible], స్వేచ్ఛాప్రదములగు చిన్నవస్తువులుండఁగనే మా [illegible] గ్నుఁడై యేల యుండవలయుననువిషయమునే యాలోచించుచుంటిని. ”

తనకొమరితె గంభీరవదనము నవలోకించి యౌరంగజేబుగూడ

మిగుల గాంభీర్యమున నిట్లనెను:—“ అమ్మాయీ! మానవునిబుద్ధి యెల్లపుడు ముందునకే పరువెత్తుచుండునని బహుశః నీవెఱింగియుండవు. తనకు లభ్యమగువస్తువునుండి క్రమక్రమముగఁ దనమనసు దొలఁగించి దుర్లభమగువస్తువుపై మనసు నిల్పుట మానవస్వభావము. వానిచింతాకష్టముల కదియే కారణము. కాని మఱియొకదృష్టిఁ జూచిన నదీ మానవునియుత్తమత్వమే యగును. దానిచే వానియాశయము లున్నతములై వానియభివృద్ధికిఁ గారణ మగుచున్నవి. ఒకసాధారణసైనికుఁడు సేనాని యగుట కిచ్ఛగించును. సాధారణసేనాపతి మంత్రిత్వము నాసించును. ఆమంత్రి సింహాసనసంపాదనేచ్ఛ నుండును. ఈవిధముగఁ బ్రతివ్యక్తియు నున్నతమర్యాదాపదవులకై నిరీక్షించుచుండును. తుద కొకసామాన్యసైనికుఁడుగూడ నవకాశము లభించిన మకుటసింహాసనాధికారి యగుచుండుటయే దీనికి ఫలము. ఒకదేశముపై నధికారములభించినంతనే చుట్టుప్రక్కల నున్నదేశములపై వానిదృష్టి ప్రసరించుట సహజము. తనయొద్దనున్నభోగసామగ్రి యంతయుఁ జాలదని యెంచి యతఁడు పరవస్తువుల నపహరించు దురాశకు లోనగును. ఈదురాశయే చాబరు నల్పమగుసమర్కండుదేశమున నుండనీయక యతనిచే హిందూస్థానము నాక్రమింపఁజేసెను. అక్బరునకు సింహాసనారూఢుఁడగుసమయమునఁ గలరాజ్యముచే సంతృప్తి కలుగలేదు. అతఁడు తనజీవన మంతయు హిందుస్థానమందలి యన్యరాజ్యముల జయించుటయందే కడపివైచెను. వంగవిహారదేశముల నతఁడు స్వాధీనము చేసికొనెను. రాజపుత్రస్థానమందలి చాల రాజ్యముల నతఁడు తనసామ్రాజ్యమునఁ గలిపెను. గుజరాతుపైఁ దనయధికారము స్థాపించెను. బుందేలఖండస్వాతంత్ర్యము నంతయుం గించెను. హిందూస్థానమందలి విశేషభాగములపై మొగలులయధికా

రము స్థాపింపఁబడినను దక్షిణభాగ మింకను సామ్రాజ్యాంతర్గతము కాలేదు. దానిని స్వాధీనపఱచుకొనుటకై నేను ప్రయత్నించుచున్నాను. ఇది యంతయు మానవుని యుచ్ఛ్రాశయత్వమునకును ధైర్యశాలిత్వమునకును ఫలము.

బద—కేవలము దమయొక్కయుఁ, దమసంతానముయొక్కయు సుఖమునుగోరి యింతటిమహాసామ్రాజ్యము స్థాపించినవారు తమ యుచ్ఛ్రాశయములు,దురాశలు నెందఱిమానవులయభిలాషలఁ జంపినవై చుచున్నవో యెందఱు తన్మూలమున నపరిమితములగు నాపదలపాలగుచున్నారో, యెందఱు తిండిలేక పరమదరిద్రులగుచున్నారో తెలిసికొనుటకై యెన్నఁడైనఁ బ్రయత్నించిరా! ఈగౌరవసంపదలమూలమున నెందఱు నిర్ధనులుగ నొనర్పఁబడిరో! ఇంతటిసుఖవిలాససామగ్రి సమకూర్చుట నెందఱు స్వసుఖములఁ గోల్పోయిరో! దేశదేశవిజయమునకై యెందఱువనితలు విధవలైరో! బిడ్డలు దిక్కుమాలినవారైరో కదా! ఇంతటిమహాసామ్రాజ్యస్థాపనమున నెందఱు నిష్పాపులు వధింపఁబడిరో!—దేవరవారు నన్నుక్షమింతురుగాక. భగవంతుఁడిట్టిదోసముల సైరించునా! నిర్భాగ్యులుగూడ భగవంతుని భృత్యులే కదా!

ఔరం—(సగర్వముగ) ఆభగవంతునియిచ్ఛల నంద తెలియఁగఁజాలరు. తచ్ఛాసనములఁ దెలిసికొనుట సుసాధ్యమగుకార్యము కాదు. కాని యతనిదృష్టికిఁ బ్రపంచమంతయు సమానమే యనుట మాత్రము నిస్సంశయము.

బద—ప్రపంచమునంతను సమానదృష్టితోఁ జూచుభగవంతుఁడు, మానవులఁ దనభృత్యులుగ నెంచుపరమేశ్వరుఁ డిట్టినిర్బంధముల నేల యిచ్చగించును! ఏదియేనొకవ్యక్తి సుఖవిలాసములకై

లక్షలకొలఁదిజనులమరణమును, గోట్లకొలఁదిమానవులదారిద్ర్యమును నతఁ డెట్లు సహించును!

పాదు—(సాశ్చర్యముగ) అమ్మాయీ! బదరున్నిసా! నేఁడు నీవిట్టిపొరబాటుమాటల నాడనేమివచ్చినది! నీవంశ మింతటి గొప్ప సామ్రాజ్యాధిపత్యము వహించుట భగవంతునియౌదార్యముగ నీవెంచుటలేదా! నిన్నిట్టిపదవి నుంచినవానికి నీవు కృతజ్ఞవు కానక్కఱ లేదా! మఱియు మనయీమాట లన్నియు భగవంతునికి సమ్మతము లుకాకున్నచో న్యాయాధికారులుఁ, పండితులు, దేవదూతయాజ్ఞకు విరుద్ధములని యనరా!

బద—మనకారణమున భగవంతునిసృష్టిభృత్యుల కెట్టిహాని యుఁ గలుగనప్పుడే మనకు భగవంతునియౌదార్యముఁ దలపనగును. కృతజ్ఞతమాటయా! ఆభగవంతుఁడు తనసేవకు నెట్టిస్థితిలో నుంచిన నందుండియే వాఁడతనియెడఁ గృతజ్ఞుఁడై యుండఁదగు. పండితన్యాయాధికారులప్రసంగముల కేమి! వారికి రాజధనమునుండి యాత్మజీవనమునకై కావలసినంతయుపాధి లభించుచున్నది. అన్యాయముపాల గుప్రజకూడ నేపండితునో, న్యాయాధిపతినో, తనపక్షమునఁ గలిపికొన్న, నాతనికి దండము కల్గుననుభీతి లేకున్న, నప్పు డాతఁడు తద్వ్యతిరేకముగఁగూడ ఫత్వా నొసంగఁగలడు. ఇట్టిస్థితిలోఁ బ్రతివ్యక్తి యుఁదనకార్య మేది భగవత్సమ్మతమైయున్నది, యేది తద్విరుద్ధముగ నున్నదియని యాలోచించుకొనవలయును.

ఔరం—భగవత్సృష్టి! దానిఁ జూచుటయుఁ దెలిసికొనుటయు మనశక్తికి బాహ్యములు.

బద—మహారాజా! భగవంతునిసృష్టి సామాన్యమానవునికిఁ గూడ సుజ్ఞేయమగునంత సౌష్ఠవముఁ గలిగియున్నది! ఒక్కసారి దేవగ

వారు గగనమును దేవ దృష్టిఁ బఱపుదురు గాక. అచ్చట వేలకొలఁది, లక్షలకొలఁది నక్షత్రములు కన్పట్టుచున్నవి. కాని వానిలో నొక్కటి యును దన స్థానమును దాటి పోఁగోరుచుండుట లేదు. తనప్రకాశము నధికముఁ గావించుకొనఁగోరి యెన్నఁడు నేనక్షత్రమును రెండవనక్ష త్రపుగాంతిపై నధికారము వహించుట లేదు. సృష్టిశాసనము తన్నే స్థితినుంచిన నది యాస్థితినే ససంతోషముగ నున్నది. ఏకర్తవ్యనిర్వహ ణమునకై తాను జన్మించినదో యాకర్తవ్యము నెఱవేర్చుచున్నది. దాని కెట్టినూతనదురాశయుఁ బుట్టదు. తన్మూలమున నది యెట్టియ యోగ్యానుచితకార్యము నొనర్చుట లేదు. ఈనక్షత్రములు మాత్ర మాపరమేశ్వరునిసృష్టిలోనివి కావా! స్వసంఘమునఁ దిరుగుట, యాత్మీ యపరిధుల వెలుఁగుటయు, వానికి భగవత్సృష్టిమూలముననే కలిగి నవిగదా! ఇట్టిస్థితిలో నన్నిటికన్న ముందుగ మనము వానికార్యము లనే యుదాహరణముగఁ గొనవలయును. కాన, నెల్లరురాజులుఁ దమ తమరాజ్యములతో నేల సంతృప్తి నందరాదు! నిష్కారణముగ నన్య రాజ్యములపై నధికారము వహింపనేల? హిందూస్థానమును దాము స్వాధీనమొనర్చుకొనుటకుఁగాని హిందువులస్వాతంత్ర్య మపహరించి వారిని దమబానిసలుగ నొనర్చుకొనుటకుఁగాని సమర్కంధు మొగ లాల కెట్టియధికారము కలదు!

ఔరం—అమ్మా! నీవింకను నజ్ఞానురాలవు. సంపూర్ణ మగు ప్రపంచానుభవముఁ నీకు లేదు. సృష్టిశాసనము, బలవత్తరుఁడు, నధిక తరబుద్ధిశాలియు నగువాఁడు పరులదౌర్బల్యాజ్ఞానములవలనిలాభముఁ బొందఁజూచుచునే యుండునని మనకు నేర్పుచునే యుండును. ఈనక్ష త్రములకు శక్తిసామర్థ్యములే యున్న నవి యెల్లపుడు యుద్ధమొనరిం చుచునే యుండుట నీవు చూడఁగలవు.

బద—మహారాజా! ఇది యంతయు మాయాబుద్ధిమత్త్వము. స్వరక్షణమునకై యేర్పఱచుకొనినది. పవిత్రుఁడగునాయీశ్వరుఁ డెన్నఁడును బలవంతులగువారందఱుఁ దమకన్న దుర్బలులను బ్రమకనీయకుండుటను సహింపఁజాలఁడు. సామాన్యముగఁ బశుపక్షులు తమకన్న బలహీనులగువాని నంతమొందించుట మనము చూచునే యున్నాము. కాని ప్రాణులనెల్ల నుత్తముండ నేనని చెప్పుకొనుమానవుఁడు తనదురాచరణములను సమర్థించుకొనుటకై యిట్టిమిషఁ గొనుట కేమియుఁ గారణము లేదు. భగవంతుఁడు మానవునకిఁ బుద్ధి నిచ్చియున్నాఁడు. మనసునఁ బ్రేమము సమభావము నొసఁగినాఁడు. యుక్తాయుక్తవిచక్షణజ్ఞాన మొసంగినాఁడు. ఇట్టిస్థితిలోఁ బరులసౌఖ్యమునకై పాటుపడుటయు వారిమహాత్త్వాభివృద్ధులఁ దోడ్పడుటయుఁ బ్రతిమానవునికిఁ గర్తవ్యమై యున్నది. బుందేలఖండమందలి సైనికులయొక్కయు యోధులయొక్కయు సంఖ్య చక్రవర్తిసైన్యమునెదుట నత్యల్పమే యగును. కాని యదియే, చక్రవర్తిసైన్యము బుందేలఖండములోనికిఁ బోయి యచ్చటిప్రజల విపన్మగ్నులఁగావించుటకు వారిపై వివిధదౌర్జన్యముల నెఱపుటకు వారిని నిర్భాగ్యులుగ బానిసలుగ నొనరించుటకుఁ దగినకారణము కాదు.

సరిగ నాసమయముననే పాదుషాయాగమనవృత్తాంతము విని బదరున్నీసాతల్లియు, నౌరంగజేబుప్రియభార్యయు నగునాయపాకాడ నచటికి వచ్చి మిగులవినయమునఁ గూరుచుండి యుండెను. ఆమె యీయదను మఱింత యుపయుక్తమని యెంచి తనకుమార్తెపక్షము వహించి యిట్లనెను:—“మహారాజా! బుందేలఖండము సమగ్రమగు న్యాయమును బొందఁదగినయవస్థయం దున్నది. ఛత్రసాలుఁ డానాఁడు సంపూర్ణమగు మానవసౌభ్రాత్రుత్వమున కంతటి మహాత్కార్య

మొనరించియుండఁ దత్ప్రతీకార మాతనిప్రార్థనము న్యాయమైనదే యని యంగీకరించిననాఁడే యొనర్చియుండఁదగినది. అదియుఁగాక బాదుషావారే స్వయముగ నాతని నేదైవవరముఁ గోరుకొన నాజ్ఞాపించి యుండిరి. ఈ సేవకునకాలికి మఱియేయితరవిషయమునను జింత లేదు. కాని దేవరవారి యాజ్ఞానుసారముగనే చేయఁబడినప్రార్థనము తప్పక సఫలీకృతమగుఁగాక యని నేఁగోరుచున్నాను.

ఔరం—ఈ రాజకీయవిషయములు సామాన్యజనులకు గ్రహింపరానంతక్లిష్టములై యుండును. ఛత్రసాలునికి వరము గోరుకొన ననుజ్ఞ యొసంగఁబడినది. ఆవరము నెఱవేర్పఁబడలేదు. ఇందుఁగూడ రాజనీతి యున్నది. ప్రజలు దీనిని ప్రతిజ్ఞాభంగమని యెంతురుగాక! రాజకార్యనిర్వాహకులగువారిట్టిప్రతిజ్ఞాభంగములను లెక్కఁగొనరు. అనుకూలసమయములఁ బ్రతిజ్ఞ లొనర్పఁబడుచుండును. ఇట్లు కాకున్న దేశమున శాంతిసౌఖ్యములు స్థిరముగ నుండఁజాలవు. నేఁడే కొన్నినియమముల నేర్పాటుచేసికొని తన్మూలమున బుందేలులకు స్వాతంత్ర్య మొసంగిన వారు రేపే యానియమములలెక్కఁగొనక వివిధవిద్రోహము లొనరింతురు. వారిస్వాతంత్ర్యము ఢిల్లీసామ్రాజ్యవిపత్కారణ మగును. చిక్కఁకొన్నసింగమును బోనునుండి విడిచివైచి తాను స్వయముగ నాపన్నగ్నుఁడై యాత్మరక్షణమునకై సాధనముల నాలోచించుచుండుట బుద్ధిమత్త్వము కాదు.

పాదుషామాటల విన్ననాయపా యచ్చెరువందలేదు. ఔరంగజేబు స్వవచనభంగ మొనర్చియే యింతటి మహాసామ్రాజ్యము స్థాపించెనని యాతఁ డెఱుఁగును. మురాదు, షుజాలకొసంగఁబడినవాగ్దానముల లెక్కఁగొననివాఁడు. మీర్జుమ్లానుబోలుస్వామిభక్తున కిడినవాగ్దానముఁ ద్రోసివైచినవాఁడు—ఇంతయేల—తనజీవనమంతయు నీశ్వ

రారాధనమునఁ గడప నిశ్చయించికొనియు, దానిని వీడినవాఁడు నగు వాని కొకసామాన్య రాజకుమారుని యెదుటఁ దనప్రతిజ్ఞానిర్వాహణముఁ గావింపఁదగు నావశ్యకత యేమున్నది? కాని బుందేలుల బుజుత్వమును బాదుషా యాక్షేపించుట నాయసా సహింపఁజాలదయ్యె. ఆమె సవినయముగ నిట్లు పలికెను:—

"దేవా! ఈహిందువులు ప్రతిజ్ఞాభంగము నెంతయుఁ గనే యెఱుఁగరు. వారు పరుల మోసగింప నెంచుటఁ గాక పరుల మోసమునఁ బడియే నశించిరనుటకుఁ జరిత్రలే సాక్షులు. వారు తమప్రతిజ్ఞలను బ్రాణములకన్న నెక్కువగఁ జూచుకొందురు. ఏనియమములపై స్వాతంత్ర్యముఁ బొందుదుమో వానినే వారుల్లంఘించినారు రనియు రాజ్యవ్యవస్థను భంగముఁ గలిగింతు రనియుఁ దలఁపరాదు.

ఔరం—మంచిది. ఇప్పుడీమాటలఁ జాలింపుఁడు. ఈవిషయమున నెప్పుడైన మంత్రులుమున్నగువారితో నాలోచించెదను.

తరువాతఁ గొంచెముసేపటివఱకు వివిధప్రసంగములు జరిగినవి. కొలదిసేపైనతరువాతఁ బాదుషా యచటినుండి రోషనారమందిరమున కేగెను. బుందేలఖండమునకు స్వాతంత్ర్యము లభించునని యానాఁడు బదరున్నీసాయు, నాయసాయుఁ దలఁచిరి.

రోషనారమందిరమునఁగూడ నౌరంగజేబునకు బదరున్నీసాభవనమునందువలెనే యాదరసత్కారములు లభించెను. అచ్చట రోషనార ప్రశ్నించుటచేఁ గొలఁదిసేపటికిఁ బూర్వము బదరున్నీసామందిరమున నడచినవృత్తాంతమంతయు సంక్షేపముగ నతఁడామె కెఱింగించెను. దానిని విని యామె మనసునమిగుల నసహ్యించుకొనెను. ప్రసంగవశమున నాయసాయు, బదరున్నీసాయు బుందేలఖండస్వాతంత్ర్యముపైఁ జాల పట్టుఁబట్టిరనియుఁ బాదుషామాత్రము దాని కంగీక

రింపలేదనియు నెఱింగి యప్పుడామె పాదుషామనసు విఱుగఁగొట్ట నది తగినసమయమని తలఁచెను. అప్పటికిఁ జంపతరాయలచేతినుండి విడివడి రణమలహాఖాను ఢిల్లీకిఁ జేరెను. చంపతరాయనిసేవకు లతనిని ఢిల్లీయందు విడిచి చనిరి. రణమలహాఖానుఁ డానాటియుదయముననే ఢిల్లీకి వచ్చియుండెను. వెంటనే యతఁడు రోషనారాబేగమునుగలిసికొని తనవృత్తాంత మంతయుఁజెప్పి చంపతరాయలవిషయమున నెక్కువగ మొఱలిడెను. అప్పుడు రోషనార యామాట లన్నియు—మఱియుఁ దనపక్షమునఁగూడఁ గొంచె ముప్పుఁగారముఁగలిపి—పాదుషాతోఁ జెప్పివైచెను. చంపతరాయ లవిధేయుఁడనియు విద్రోహియనియు, ఢిల్లీసామ్రాజ్యమునకు ఘోరశత్రు వనియు, నాతఁ డీసమయమున బుందేలులనందఱ సార్వభౌమునకు విరుద్ధముగఁ బురిగొల్పుచున్నాఁ డనియు జక్రవర్తి బాగుగ విశ్వసించునట్లు చెప్పివైచెను. "బుందేలనరపతు లందఱు నాంతరంగికముగ నాతనితోఁ గలిసిపోయి యాతనినే స్వాతంత్ర్యమార్గదర్శకునిగఁ జేసికొనినారు. ఇట్టిస్థితిలో వారికి స్వాతంత్ర్య మొసంగుట యింద్రునకు వజ్రమిచ్చుటయే యగుచు. దీనిమూలమున నిష్కారణముగ నాపదఁ గొనుట మంచిది కాదు. మఱియొకసంగతి. చంపతిరాయ లిన్నిదినములవఱకు రణమలహాఖానునిఁ దనచేతియందుంచి దేవరవారి నవమానించి యున్నాఁడు. అందుచే దేవగడదుర్గవిజయానంతరమునఁ దత్క్షణమే సైన్యమంతయు బుందేలఖండవిజయమునకై పంపఁబడుట యుచితము. మఱియు బుందేలఖండమున సామ్రాజ్యసైన్యము నెదురించుప్రయత్నము లన్నియు నెఱవేఱినపై రణమలహాఖానుని విడిచినాఁడు." అని యామె చక్రవర్తికిఁ బోధించెను.

మఱునాఁడు రోషనారయుపగ్రహమునఁ గంచుకిరాయురణమల

హాఖానులిరువురు నాంతరంగికసభాస్థానమునఁ బాదుషావారియెదుటికిఁ గొనిరాఁబడిరి. వారిరువురును జంపవలయునన్న యాలోచనము చేసి యుండిరి. అందుచే నాతనికి విరుద్ధముగాఁ జాల చెప్పఁగలిగిన దంతయు వారు చెప్పివైచిరి. పటుంబుగ రోషనారాబేగము లాంతరంగికజబు మనసు విఱిచివైచెను. వారిమాటల విని యతఁడు మిక్కిలి క్రుద్ధుండ య్యెను. అప్పుడే యతఁడు బుందేలఖండమును—విశేషించి మహో బారాజ్యమును—విధ్వంస మొనరింప సాధ్యమైనంతశీఘ్రకాలమున నొకమహాసైన్యముఁ బంపవలయునని యాజ్ఞాపించెను.

కొలఁదిసేపటికిఁ గంచుకిరాయలు విరతిమందహాసముతో నాంతరంగికసభాస్థానమునుండి నెమ్మదిగ బయలువెడలుట కానవచ్చెను. అప్పటియాతనియానంద మపారము. తనచాతుర్యమునకై మిగుల నానందించుచు హీరాశుభకరణపర్వతసింహాదులతోఁ జెప్పఁదగు దాంభికవార్తల నాలోచించుచుండెను. ఆనందముమూలమున నాతనిపాదములు నేలపై నానుటలేదు—అతనికి విజయము లభించినది. ఇఁకఁ దాను యశస్వి యగుటలో నెట్టిసంశయము లేదు. ఆనాఁడే యతఁడటనుండి బుందేలఖండమునకుఁ బ్రయాణమొనర్చెను.

ఈవృత్తాంత మంతయు నాయసా బదరున్నిసాలకు నాఁడే తెలిసెను. వారు మనసున మిగుల దుఃఖించిరి. ఆయసా చాలసేపటివఱకు బదరున్నిసా నోదార్చెను. ఆమెకు ధైర్యముఁ జెప్పెను. కాని యేమియు లాభము లేకుండెను. బదరున్నిసా దుఃఖ మస్తమింపలేదు.

మఱునాఁటిప్రాతఃకాలమున బదరున్నిసా తనమందిరమునుండి యదృశ్యురాలై పోయినదనువార్త రాజమందిరమునం దంతట వ్యాపించెను.

---

# పదునేడవప్రకరణము.



## భ్రాంతినివారణము.

రాణా పర్వతసింహుఁడు మరణించుతరి నాడినమాట లన్నియు నిస్పృహామూలమునను, బిచ్చిమూలమునను జనించినప్రేలుడని చెప్పి హీరాదేవి విమలదేవునిచే నతనియపరకర్మలఁ జేయించెను. పర్వతసింహునిశరీరమున కగ్నిసంస్కారముకాఁగనే చంపతరాయలు ఛత్రిసాల దలపతులను దనసేవకాదిపరిజనమును వెంటనిడికొని మహోబాకు ప్రయాణమయ్యెను. విమలదేవునిపట్టాభిషేకసమయమున వచ్చెదమని చెప్పి తక్కుంగలసరదారులందఱుఁ దమతమస్థానముల కరిగిరి. పిందు నాఁడు కనపడకుండఁ బోయినశుభకరణుఁడు హీరాదేవికి మరలఁ గన్పింపలేదు. అతఁ డచ్చటనుండి సాగరరాజమార్గమునకుఁ బోయి యచ్చట నోర్ఛానుండివచ్చుసమాచారమునకై వేచియుండెను. అచ్చటనే యాతనికి భక్ష్యమిళితమగు విసముమూలమునఁ బర్వతసింహుఁడు మరణించెనని తెలియవచ్చెను. ఆసమయమున నాతఁడు తద్విపన్మూలమున హీరాదేవి తనదౌర్మార్గ్యమును ద్యజించి సుమార్గమునకు వచ్చునని యాశించెను. కాని యాక్షణముననే యట్టిదుస్థితియందుఁగూడఁ జంపతరాయలనాశనమునకై యామె యత్యంతతాత్పర్యమున సైన్యమును సమకూర్చుచున్నదని యాతఁడు వినెను. ఇంతలోనే "నాఁటి గుప్తసమాలోచనసభయందలి రాజులందఱిసైన్యములును వచ్చి చేరినవి. మీరు తన్నాయకత్వము వహింపవలయును." అని తెల్పెడు హీరాదేవియాహ్వానపత్రమరుదెంచెను. ప్రతిజ్ఞాపిశాచగ్రస్తుఁ డగు శుభకరణుఁడు తత్క్షణమే యోర్ఛాకుఁ బయనమయ్యెను.

ఓర్ఛారాజమందిరమును జేరఁగనే యందఱికన్న ముందుగ నాతఁడు కంచుకిరాయనిఁ జూచెను. కంచుకిరాయఁ డతనితో "నేను సార్వభౌము నిట్లు సమాధానపఱిచితిని. బేగము నట్లులొప్పించితిని." అని స్వాధిక్యపూర్వకములగుడంబము లనేకములు పలికెను. తనమాటల విని చంపతరాయలపై సార్వభౌముఁ డెంతటిక్రోధము వహించెనో వర్ణించుచు నాతఁడిట్లనెను.

"శుభకరణా! రోషనారాబేగముయోగ్యతనుఁ దెలిపి తేటలను ఏమనివర్ణింతును. అన్నివిషయముల నామె హీరాదేవినిఁ బోలును. రణదుల్లాఖానుఁ డచటికిఁ జేరినతరువాత బేగ మొక్కింత యాలసించిన బహుశః బుందేలఖండము ఢిల్లీసామ్రాజ్యచ్ఛత్రచ్ఛాయనుండి యెగిరియే పోయియుండును. బుందేలఖండమునకు స్వాతంత్ర్య మొసంగవలయుననువిషయమునఁ బాదుషా నెవరు పురికొల్పిరో తెలియదు. కాని మనభాగ్యవశమున నాకుఁ దోచుటచే వెంటనే పోయి బేగముతో నింకఁ గొంచెమైన నాలసింపరాదని చెప్పితిని. బేగముతోఁ జెప్పి యంతటితో నేనూరకుండలేదు. ఒకవైపున రోషనారాబేగముచే సార్వభౌమునిమనసు విఱిపించితిని. మఱియొకవైపునుండి నేను స్వయముగఁ బాదుషాయాస్థానముఁ జేరితిని. ఇంక నేమున్నది. మహీబారాజ్యము విచ్ఛిన్నమొనర్ప నాజ్ఞనిప్పించియే నేనటనుండి కదలితిని. వచ్చుసమయమున సార్వభౌముఁడు నాకుఁగూడ నొకరాజభక్తిప్రమాణపత్రము నిప్పించెను."

తిరస్కారదృష్టుల నీక్షించుచు శుభకరణుఁ డాతనిమాటలను వినుచుండెను. ఆతఁ డేదియో సమాధాన మీయఁగోరుచుండ నంతలో హీరాదేవి యట కేతెంచెను. ఆసమయమున నామెమొగమున మాయాకాంక్షముయొక్కయు, వాస్తవికానందముయొక్కయు ఛాయ

లు సమ్మిళితములై కన్పట్టుచుండెను. శుభకరణునిఁ జూచినంత నామె యానంద మధికతర మయ్యెను. ఆసమయమున దానిని గుప్తమొనర్చుటయు నుచితమని యామె తలఁపక ప్రసన్నతతో నిట్లనెను.

“ఆహా! మీరు వచ్చినారు! సార్వభౌముఁడు మిమ్ముఁ జంపతరాయరాజ్యవిధ్వంసమునకై నియోగించినాఁడని మీరు వినియే యుండవచ్చును. మీరు బుందేలఖండమాండలికాధీశులసైన్యముల నన్నిటిఁ గూర్చుకొని మహీబాపై దండు విడియవలయునని ఢిల్లీనుండి రాజాజ్ఞాపత్రిక వచ్చినది. మఱియు మీకు సహాయముగ ఢిల్లీనుండి సార్వభౌమునిసైన్యముఁగూడ వచ్చుచున్నది. ఆవశ్యకత కలిగిన సార్వభౌముఁడు స్వయముగ వచ్చును. అంతరంగికసభయందలి మననిర్ణయము శీఘ్రముగనే నెఱవేఱునని తోఁచుచున్నది. కంచుకిరాయలు తనకర్తవ్యము నతినిపుణతతో నిర్వహించెను. బుందేలఖండమందలి యధికమాండలికసైన్యములు మీకై మహీబామార్గమున నిరీక్షించుచున్నవి. ఎల్లుండియే మహీబాప్రయాణమునకు నిశ్చయింపఁబడినది. ఆనాఁడు స్వప్రతిజ్ఞానిర్వహణమునకై చక్రవర్తియాజ్ఞాపాలనమునకై మీరుఁ దత్సైన్యాధిపత్యము వహింపనగును.”

శుభకరణుఁ డత్యంతవ్యథితహృదయుఁడై మహీబాదేశముపైకేగుసైన్యమున కాధిపత్యము వహించెను. ఇప్పుడు మనము మహీబారాజ్యవినాశనమునకుఁ గాక బుందేలఖండభావిసుఖాశావినాశనమునకై బయలుదేఱుచున్నాము. చంపతరాయవిధ్వంసమునకై వెడలుచున్నారము. సమరదేవతారాధనమునకై కాక యనుచితకపటహత్యాచరణమునకై యరుగుచున్నాము. అని యాతనియంతరాత్మ చెప్పుచుండెను. సైన్యవందన మందుకొనుచు ముందు, నశ్వారోహుఁడగు చున్నను, ప్రియురాలగు నతని నొసంగువేఁ డుదకు స్వాశ్వచాలననన్నా

హాకాలమున నాతనిమొగముపై సమానమగునిరుత్సాహమే కానవచ్చెను. కాని శుభకరణుఁడు మహీబాదెసకుఁ బోవుచున్నకొలఁది నాతనిమనము ప్రతిష్ఠాపిశాచాధిష్ఠిత మయ్యెను. ఆతనిక్షాత్రతేజోభాసితమగువదనము రాక్షసతేజోమిళిత మయ్యెను. ఆతనిమాటల స్థైర్య మాసురనైష్ఠుర్యసమ్మిళిత మయ్యెను. ప్రఖరకిరణసంతప్తభువనుఁడగు మధ్యందినమార్తండునిమాడ్కి శుభకరణుఁడు భయంకరుఁడై యుండెను. తదధీనులగు సత్సైన్యపతులకుఁగూడ నతనిఁజేర భీతివొడముచుండెను. సైన్యములు తమయధిపునివదనము వీక్షించుట మానివైచెను. ఒక్కక్షణమైన వ్యర్థము కాకుండ శుభకరణుఁడు మహీబాకుఁ బోవుచుండెను.

విజయమాటలచేఁ జంపతరాయలు తనప్రార్థనాపత్రమును బుందేలఖండ నరపతులందఱు నారీతి నవమానించిరని యెప్పుడెఱిఁగెనో యప్పటినుండి యతనికాపాదమస్తక మగ్నితప్తమైన ట్లుండెను. స్వాతంత్ర్యప్రాప్తికై యందఱు నైక్యముంది ప్రయత్నించుట యెల్లగవిధఁగు నియుఁ దత్కర్తవ్యనిర్వహణమున సాయపడకుండుట దాని నిరాకరించుట, తద్వ్యతిరేకమగుప్రయత్న మొనరించుట, దేశక్షేమమును, బ్రజాకల్యాణమును, భూతదయను, సత్సదాచారసర్వస్వమును, బట్టిచూచిన మహాపరాధమనియు నతఁ డెల్లప్పుడుఁ దలఁచుచుండెను. అందులకే ముందుగ నీకృతఘ్నశత్రువుల నిర్మూలింప నతఁడు నిశ్చయించుకొనెను. మహీబాపుఁ బోయి యతఁడు యుద్ధమునకై సంపూర్ణప్రయత్న మొనరించెను. సర్వదాఁ బ్రాతఃకాలమునుండియే మహీబా రాజప్రానాదమునెదుట నాయుధములరాసులు కూడుచుండెను. సాయంకాలమువఱ కవి యన్నియుఁ బంచి యొసఁగబడుచుండెను. ఈక్ర

మును పదునైదుదినములవఱకుండెను. ఈశత్రువుల యుపయోగ మంతియుఁ దనసోదరుల వధించుటకేకదా యని ఛత్రసాలుఁడు మిగుల విచారించుచుండెను. "మనము మనసోదరులనే దేశద్రోహులని యెంచి చంపినచో నింక చక్రవర్తిసైన్యముతో నెవరిసాయమునఁ బోరెదము! ఇంక స్వాతంత్ర్యప్రాప్తి యెవరికొఱకు! శుభకరణునిఁబోలు వీరపురుషునిహృదయమునందలి వైరబంధనములను బ్రయత్నించి, యతనికి లోబడియైన, లేకున్న నతనినుండి క్షమాప్రార్థన మొనరించియైన, శిథిలమొనర్చినచో, బుందేలభూపతులను శత్రువులుగనెంచి వారిపై నాయుధముల నెత్తుటకు మారుగ వారికిశంకితాలోచనముల మాన్పి వారిని స్వాతంత్ర్యయుద్ధసంసిద్ధుల నొనర్పఁ బ్రయత్నించినచో, స్వాతంత్ర్యమార్గ మెంతసుగమమగును! పరస్పరవైరముల మాని బుందేలఖండమందలి నష్టశేషమగుశక్తిని నాశనమొనర్చుటకు మారుగ నేకసూత్రగ్రథితముఁ గావించిన నది యెంతటి బలాఢ్యము, నజేయము, నభేద్యము నగును." ఇట్టి యనేకాలోచనలచే ఛత్రసాలునిమనను నిండియుండెను. కాని స్వాతంత్ర్యప్రాప్తికై తనతండ్రి యొనర్చుప్రయత్నములఁ గాంచిన నాతనివిచారము హృదయముననే యంతరించుచుండెను. ఉత్తమమగు బుందేలఖండస్వాతంత్ర్యకర్మము మనసున నిడికొని, యనేకవత్సరములనుండి నిరతప్రయత్నములఁ గావించుచున్న నాతండ్రి యెన్నఁడును బుందేలఖండమున కహితకరమగుకార్యముఁ గావింపఁడని భావించి యతఁడు తనయాలోచనల మనసుననే యణఁచియుంచుచుండెను. నెమ్మదినెమ్మదిగ దినము లనేకములు కడచిపోయెను. తుదకు సంగ్రామావసరము హఠాత్తుగ వచ్చెను. చంపతరాయని సైన్యము మహేబానుండి వెడలకమున్నే శుభకరణునిసైన్యము మహేబాకై క్రోశములదూరమునకు వచ్చెను. చంపతరాయ లడి మాది

మతింత క్రుద్ధుఁ డయ్యెను. ఛత్రసాలుని కొకమహాసైన్యాధిపత్యము స్వీకరింప నయ్యెను. దలపతికుమారుఁడుఁగూడ జనకునితోడి యాహవమునకు సంసిద్ధుఁ డయ్యెను. చంపతరాయనిచపలతురంగము మహీంబాసైన్యమునకు ముందు పరుగిడఁ దొడంగెను. ప్రయాణసన్నాహము దెల్పు రణదుందుభులు కర్కశధ్వానము లొనర్పసాగెను.. మహీంబా దేవతలు బుందేలఖండరాకుసులతోడి యాహవమునకై శీఘ్రముగ ముందునకు రాఁదొడఁగిరి.

సంగ్రామప్రయత్నముల నొనర్చి శుభకరణుఁడు చంపతరాయసైన్యాగమనము నిరీక్షించుచుండెను. ఆసమయమునఁనే చంపతరాయవదననిర్గత మగువింధ్యవాసినీజయజయధ్వానము స్పష్టముగ శుభకరణునికర్ణములఁ బడెను. ఆజయధ్వానమునకుఁ బ్రతిధ్వానము వినవచ్చుటకుముందుగనే శుభకరణుఁడు తనసైన్యములకు మహీంబాసైన్యాక్రమణమునకై యాజ్ఞ నొసంగెను. తత్క్షణమే సేనానిగాజ్ఞ నిర్వహింపఁబడెను. శూలధారులు శూలములను, భల్లహస్తులు భల్లములను బైకిఁ దీసిరి. శతఘ్నులు ధ్వనింప మొదలిడెను. తుపాకులగుండ్లు పరువిడుచుండెను. ఖడ్గములు విద్యున్నిభముగఁ బ్రకాశించుచుండెను. అశ్వికులుఁ, బదాతులు, భల్లధారులు, శతఘ్నిధారులు, వీరులు, యోద్ధలుఁ, దత్క్షణమే యొక్కమాఱుగఁ జంపతిరాయులసైన్యముపైఁ బడిరి.

చంపతరాయలసైన్య మాప్రతిఘటనమునకుఁ దగినసమాధాన మొసంగెను. ఖడ్గధారులతోఁ బోరాడసాగిరి. ఎట్టిసైనికుల నట్టివా రెదుర్కొనిరి. కాని యుద్ధము చాలకాలమునఁటకు జరుగలేదు. కొలదిసేపటిలో వ్యవస్థయంతయు భగ్నమై రణక్షేత్రమంతయు భిన్నభిన్నమయ్యెను. రెండుసైన్యములును సంకులయుద్ధ మొనరించెను. ఆస

[illegible] శత్రుమిత్రనిరూపణము లేకుండెను. వయోబలాదులయం [illegible] గరిసము [illegible]

లపైని, శూలధారులు [illegible] విధమునఁ దమయెదుటఁ బడ [illegible]

మొంవటినాఁడు చంపతిరా [illegible] తిరాయనియసమాన [illegible] మొక క్రోశముదూరము వెనుకకుఁ బోయెను. ఆనాఁడు జనకతనయులకు భీక రసంగ్రామము జరిగెను. ఛత్రసాలకుమారుఁడు ఖడ్గ మొరనుండియైనఁ బైకిఁ దీయలేదు. పితృపుత్రులపోరాటమువీక్షించుచుండెను. ఇంత మందివీరులు పరస్పరవైరము వీడి బుందేలుల వాస్తవికవైరులతోఁ బోరాడిన బుందేలఖండము క్షణముకాలములో స్వతంత్రమగుఁగదా యని యతఁ డాలోచించుచుండెను. తనసోదరులపైనే ఖడ్గము దూయుట మహాపరాధమనియు నన్యాయమనియు నతనికిఁ దోచుచుండెను. కాని దలపతిరాయనిమనసునమాత్రము పోరాటపుఁగోరికతప్ప మఱియేమియు జనింపలేదు. చంపతరాయ లొనర్చునదంతయు బుందేలఖండక్షేమమునకే యని యతఁడు దృఢముగ నమ్మియుండెను. కాబట్టియే యతఁడాదినమునఁబ్రాణములొడ్డి యమునిభాతిఁ బోరొనర్చెను. శుభకరణుఁ డతితీవ్రముగ మువ్మారు చంపతిరాయలసైన్యము నెదుర్కొనెను. కాని దలపతిరాయనియుద్ధసామర్థ్యముమూలమున నతనికి మువ్మారును వెనుక కడుగిడవలసెను. ఇంతియేకాక మూఁడవమారు శుభకరణునిసైన్యము క్రోశముదూరము వెనుకకు మరలునంతతీవ్రముగ దలపతిరాయలు శుభకరణునిప్రతిఘటనమునకుఁ బ్రత్యుత్తర మొసఁగెను. చంపతరాయలు దలపతిశౌర్యమును మిగులఁ గొనియా

జెను. సంధ్యాసమయమున దలపతిరాయనిఁ బ్రశంసించుచుఁ జంపత రాయనిసైన్యములు తమశిబిరముఁ జేరెను.

శుభకరణుఁడును సామాన్యవీరుఁడు గాఁడు. ఒక్కయుపజయమున వెనుకకుమరలువాఁడు గాఁడు. మరునాఁడు సూర్యోదయము కాఁగానే యాహవప్రయత్నము కొనసాగుచుండెను. కొలఁదిసేపటికి యుద్ధ ప్రారంభమయ్యెను. ఆనాఁ డన్నపానములచింత యేరికిని లేదు. రవి యస్తమించుదనుక నట్లే యుద్ధము జరుగుచుండెను. శుభకరణుని సైన్యమును జంపతరాయలసైన్యము తీవ్రముగఁ బ్రతిఘటింపసాగెను. కాని యాసైన్యపంక్తి నది భేదింపఁజాలకపోయెను. మహావీరులు పరస్పరయుద్ధమున మరణించుచుండిరి. శవరాశి పడియుండెను. రక్తప్రవాహములు ప్రవహించుచుండెను. ఆభయంకరసమరరంగదృశ్యమును, నాత్మసోదరరక్తవాహినులను, శవరాసులను గాంచి ఛత్రసాలుఁ డతిదుఃఖితుఁ డగుచుండెను. తనసోదరుల యాయమానుషమారణమును నాతఁడు చూడఁజాలకుండెను. ఆనాఁడుగూడ నతఁడు పోరాడలేదు. ఖడ్గమొరనుండి తీయలేదు. ఊరక యుద్ధమును జూచుచుండెను.

రెండవనాఁటిభయంకరయుద్ధారంభమునకు ముందుగ నతఁడు తండ్రియొద్ద కేగెను. నాఁడు పోరెట్లు సలుపవలసినదియుఁ జంపతరాయలు తనసేనానులకు బోధించుచుండెను. శౌర్యలక్ష్మీయుక్తుఁ డగు దలపతిరాయలు తదేకచిత్తమునఁ జంపతిరాయలమాటలవినుచుండెను. చారణులు, సమరగాయకులుఁ జంపతరాయలమాటలు సమాప్తినందు చెప్పుడా, వీరరసమానసోత్సాహజనకములగు గీతముల మనము మొదలిడు చెప్పుడా యని నిరీక్షించుచుండిరి. ఇంతలో యువరాజగుఛత్రసాలుఁడు ముందునకు వచ్చి చంపతరాయనితో నిట్లనియెను:—

"తండ్రీ! ఈయుద్ధము కడు నిర్దయమై యున్నది. ఈయన్యో

న్యయుద్ధమున బుందేలఖండమునకుఁ గలుగులాభ మేమి? బుందేలుల మారణమున బుందేలఖండమున కేహితము చేకుఱును? ఈయంతః కలహములనే, పోరాటములనే బుందేలఖండపుశక్తి యంతయు నశించి పోయిన, దానియసమానక్షాత్రతేజము మంటఁగలిసిన, నాకలహాగ్ని నే యింతమందివీరు లాహుతిమైన, నింక స్వాతంత్ర్యప్రాప్తి యెట్లు! ఈయుద్ధమున బుందేలఖండమున కేహితమును జేకుఱదని నాతలంపు.

చంపతిరాయ లాశ్చర్యక్రోధముల నిట్లనియె:—"ఛత్రసాలా! నీవిట్టిమాటల నాడుచున్నావా! బుందేలులహిత మెందుఁ గలదో నేను బాగుగ నెఱుఁగుదును. స్వాతంత్ర్యదేవీసేవనే తనజీవనమందలి యధికభాగముఁ గడపినవానికి నీబోధనము ధృష్టతయే యగును. నీ యిట్టిపిఱికిమాటల విన్న నాకధికవిచారము గలిగినది. మరల నెప్పు డైన నిట్టిమాటల నాడితివేని—" చంపతరాయలు తనక్రోధమును మనసుననే యడఁచి యుంచుకొనెను. చారణులుచ్చైఃస్వనమున బుందేలశౌర్యగానము మొదలిడిరి. చంపతరాయదలపతిరాయాది వీరు లుత్సాహభరితు లైరి. రణదుందుభులు తీవ్రముగ ధ్వనించెను. గగనభేది యగువింధ్యవాసినీజయజయధ్వానము విజృంభించిపోయెను. సమరరంగముఁ జొచ్చి యోధులు రణదేవతను బ్రసన్న నొనర్ప య త్నించుచుండిరి. కాని ఛత్రసాలుఁ డానాఁడును బోరాడలేదు. ఆనాఁ డు నాతనికృపాణ మొఱయందే యుండెను.

బుందేలఖండమునసీయన్యోన్యయుద్ధముచాలదినములవఱకుజరు గుచునే యుండెను. కాని సమాప్తి నందలేదు. అట్లయ్యుఁ జంపత రాయ లిన్నినాళ్లనెన్నఁడు నపజయముఁ గాంచి మఱలియుండలేదు. కాని యట్లే యింకఁ గొలఁదిదినములవఱకు జరిగిన నానాఁటికి నవస్థ దుష్టతర మగుచుండు ననియు యోధులు క్రమముగ నాశనము నం

దుదురనియు నతఁడు నిశ్చయముగ శంకించెను. శుభకరణునిసైనికులు గూడ కొండటు నిరుపయోగులే యైరి. కాని హీరాదేవి మాటిమాటికి నూతనసైనికుల నంపి తత్స్థానము నింపుచుండెను. అందుచే శుభకరణునిసైన్య మింకను ముట్టడిలో నిలిచియుండెను.

శుభకరణచంపతరాయలసైన్యముల రెంటికిని సమానమగు భయంకరయుద్ధముసంభవించినను జంపతరాయలపక్షమే బలవత్తరముగ నుండెను. శుభకరణునిసైనికులు చాలమంది మరణించిరి. ఔరంగజేబున కీవార్త తెలియఁగనే యతఁడు చంపతరాయల నోడింప యత్నించుచుండెను. చక్రవర్తి ప్రచండసైన్యము తమ్ము ముట్టడింపవచ్చుచున్నదని వినినను జంపతరాయనిధైర్యము వీడలేదు. అతఁడుఁ దత్ప్రతిఘటనమునకై సంసిద్ధుఁ డయ్యెను. చక్రవర్తిసైన్యము హఠాత్తుగ వచ్చుటఁ గాంచిన నతనికి రవ్వంతయుఁ జింత కలుగలేదు. ఛత్రసాలుఁ డిన్నిదినములనుండియు దూరమున నుండియే యాహవవైచిత్రిఁ గాంచుచుండెను. కాని యిప్పు డాతఁడు సందు దుమికెను. తనకృపాణము నొరనుండి బహిర్గత మొనర్చెను. అతని యద్వితీయోత్సాహముగాంచిన మిగిలియున్నచంపతరాయసైనికులకు నూతనాశోత్సాహములు గలిగెను. చక్రవర్తి శుభకరణుల సంయుక్తసైన్యములకు వారు కాలులపగిదిఁ గన్పట్టఁ దొడఁగిరి.

ఔరంగజేబు మహాకుటిలనీతిజ్ఞుఁడు. దూరదర్శి. అతఁడు శుభకరణునిసైన్యసహాయమునఁ జంపతరాయలఁ జుట్టుకొన నుపయుక్తమగు స్థానము వెదకి యందుండియే ముట్టడి నారంభించెను. రెండువైపుల నుండియు భయంకరసమర మారంభ మయ్యెను. శుభకరణపార్శ్వభాగములసైన్యము సంఖ్యనుబట్టి యత్యధికతరముగ నున్నను నౌరంగజేబునకు గృహశత్రువగు శుభకరణునిసహాయము లభించినను దక్ప్రతిఘ

టనముల నొక్కించుకమైన లెక్కఁగొనక చంపతరాయలపక్షమందలి వీరు లనేకులు తమపరాక్రమసౌష్ఠవముఁ బ్రకటించి శౌర్యమునఁ బోరాడి శత్రుప్రాణముల హరించి తమప్రాణముల నర్పించిరి.

చంపతరాయనిశూరులు మరణించుటఁబట్టి తత్సైన్యము దుర్బలము కాఁజొచ్చెను. సగముమంది శుభకరణునితోడియుద్ధమున కుపకరించిరి. మిగిలినవారు మిగుల నాయాసముఁ జెందియున్నయదనుననే ఢిల్లీసైన్యము నెదిరింపనయ్యెను. ఏబుందేలులకై తాను పోరాడుచుండెనో వారే తనశత్రు లగుటయు, నావశ్యకతకలిగినప్పు డేరిని విశ్వసింపవలసియుండెనో, వారే విశ్వాసఘాతుకు లగుటయుఁ జంపతరాయలు సూచెను. ఇప్పు డాతని కేరిపైని విశ్వాసము గలుగుట లేదు. ఇఁక మహీబాను రక్షింపఁజాల ననియు నాతఁడు తలఁపసాగెను. అతఁడు తనకన్నులయెదుటనే చక్రవర్తిసైన్యము మహీబాను విధ్వంస మొనర్చుట సహింపఁజాలక మహీబాను వీడిపోయెను. బుందేలఖండస్వాతంత్ర్యయోధులు తుద కరణ్యావాసముఁ గైకొనిరి. స్వీయపరాక్రమముల యవనసైన్యవిధ్వంస మొనరించుచుండిన ఛత్రసా... రాయు లిరువురుఁ జంపతరాయలఁగూడి యడవి ... తల్లి సరళాదేవియు వారివెంటఁ జనెను. ఇప్పుడు చంపతరాయ... నియతులగునేఁబదిమందివీరులుమాత్ర ముండిరి. ఐనను హీరాదేవి యచ్చట సైన్యసంగ్రహ మొనర్చుచునే యుండెను.

మహీబాపై సామ్రాజ్యపతాకలెగురసాగెను. హీరాదేవియానందమునకు మేరలేకుండెను. చంపతిరాయలు పత్నీపుత్రద్వితీయుఁడై మహీబానువీడిపోయినట్లే యీప్రపంచమునుండికూడ వెడలిపోవలయునని మాత్రమే యిప్పుడామె యాస. తనకుఁ దనభర్తకు రాజ్యైశ్వర్య

ములనిప్పించిన చంపతరాయలనే యాఁగాచి యిప్పుడరణ్యముల పాలొనర్చెను.

హీరాదేవి సాధ్యమయినంతవఱకు బుందేలఖండమునందలిబలమునంతను నేకమొనర్చి చంపతరాయనికి విరుద్ధముగఁ బాదుషాకు సాయమొనంగుచుండెను. దినదినము నెచ్చటనో యొకచోటఁ జక్రవర్తి సైన్యములతోఁ జంపతరాయనికిఁ బ్రతిఘటనము గలుగుచునే యుండెను. ఆకాలమున ఛత్రసాలదలపతులు తమప్రాణములనొడ్డి యాదర్శప్రాయమగు పరాక్రమము నెఱపుచునేయుండిరి. కాని వారియనుచరులగు సైనికులు క్రమముగ నశించుచునేయుండిరి.

తుద కత్యంతశోచనీయమగునవసరము తటస్థించెను. సౌభాగ్యసింహుఁ డొకనాఁడు కాననమున నెందేని శత్రువులజాడ నరయఁ గోరి యరిగెను. చంపతరాయని కిటునటుఁ దిరుగుచుండ నొకపాదక్రింద వానికళేబరము కానవచ్చెను. దానియంత్యక్రియల నిర్వహించి చంపతరాయ లొకఱాతిగుట్టపైఁ గూరుచుండి యుండెను. ఛత్రసాల [illegible] సమీపమున నాసీనులై యుండిరి. సరళాదేవి శోకదగ్ధాం[illegible] పతిపుత్రుల హీనావస్థను గాంచుచుండెను. వారియనుచరులందఱు మరణించిరి. చాలసేపు శోకనిమగ్నులై యుండి చంపతరాయలు శ్మశానశాంతితుల్యమగు నాశాంతిని భంగపరచుచు నిట్లు నుడివెను.

“ అత్యంతవికటమగు నవస్థ సంప్రాప్తమయినది. పోరాడి ప్రాణము లర్పింపవలయును. లేదా నిర్లజ్జులమై శత్రుహస్తమున నాత్మార్పణ మొనరించుకొనవలయును. వేరుమార్గము లేదు. బ్రదికియుంటయా, మరణించుటయా; పోయి శత్రువునకులోఁబడి సిగ్గుమాలి జీవనముఁ గడపుటయా, లేక వైరి నెదిరించి పోరాడి నిష్కలం

నులమై యొకటిరెండుజాములలో వీరగతి నుండుటయా !" యనువిష యమే యిపుడు నిర్ణేయము. మరణించుట సులభమే యగును. కాని మరణసమయమునఁ గన్నులయెదుటఁ గన్పట్టు మాతృదేశదుర్వవస్థాచిత్ర మసహ్యవేదనాకరముగ నుండును. అయిన జీవించియుందమా ! బ్రతికి ప్రతిష్ఠాభ్రష్టుఁడగునౌరంగజీబునకు బానిసలమై యుందుమా! ఛీ! అట్టి జీవనము నరకవాసముతో సమము. మరణించినపై స్వర్గముఁ జేరి యమరులకు బుందేలులదాస్యవృత్తాంతము వినిపింపఁగలుగుదును. బానిసలమై యిచ్చటనేమి యొనర్పఁగలము? ఇంక నేను నిశ్చయించు కొంటిని. అమరులకర్ణములఁ దెరచుటకై వారిదృష్టి బుందేలులదా స్యదుర్దశదెస కాకృష్ట మొనరించుటకై సాధ్యమైనంతశీఘ్రముగ నేను దివిజులచరణసన్నిధిఁ జేరెదను. ఇప్పుడు ముందుగఁ గానవచ్చుశత్రు సమూహముపై దుమికెదను. నాప్రాపంచికకర్తవ్యము ముగిసినది. బుందేలఖండస్వాతంత్ర్యసంపాదనమునకై నాయోపినకొలఁదిఁ బ్రయ త్నించితిని. ఇంక దేవతలసన్నిధిఁ జేరి బుందేలుల స్వతంత్రుల నొన ర్పు వారిఁ బ్రార్థించెదను. (భార్యఁజూచి) నీవు నిరర్థకముగ శోకింప కుము. ఛత్రసాలా ! దలపతీ ! మీరును దుఃఖింపకుఁడు. ఇక నేను రెండుమూఁడుజాములవరకు నుండువాఁడనే. ఆకాలము మనము సంతో షమునఁ గడపనగును. రండు. మనము ప్రేమపూర్వకాలింగన మొన ర్చుకొందము. మనయంతిమజీవనానందానుభవముఁ గొందము. ఇఁక నేను శాశ్వతముగ మీనుండి వేఱయ్యెదను.

సరదేశావి యింతదనుక వెక్కి వెక్కి యేడ్చుచుండెను. ఇపు డామె గుండెబ్రద్దలగునట్టు లేడ్వఁదొడఁగెను. ఆమెవైపుఁ జూచి చంపతిరాయ లిట్లనెను.

„నీకుఁ బిచ్చియెత్తినదా యేమి! వనమున నలుగడల వైరిపై

నికులు సంచరించుచున్నారు. వారేవేళ వచ్చి మనపైఁ బడుదురో తెలియదు. ఆసమయమునఁ బరస్పరాలింగనదర్శనసంభాషణాద్యభిలాషలు మనసుననే యుండిపోవును. తన్మూలమున శత్రువుల నుఱుమాడుటయుఁ గష్టసాధ్యము కావచ్చును. కాన నిప్పుడే మనకోర్కెల నెరవేర్చుకొందముగాక."

సరళ యేడ్చుచుఁ దనపతిపాదములపైఁ బడిపోయెను. ఛత్రసాలుఁడు సాశ్రునయనుఁడై తల్లిదండ్రులదెసఁ గాంచుచుండెను. కాని తాను శోకించుచున్నట్లు జనకునకుఁ దెలిసిన నతఁడు మిగుల దుఃఖించునని యెఱింగి యెట్లో శాంతివహించెను. చంపతరాయలు భార్యను చరణములపైనుండి లేవనెత్తి యిట్లు నుడివెను.

"ఇఁక మనము స్వర్గమునఁ గలిసికొందుము. నేను ముందుగ దివి కేగి యచ్చటవలయునేర్పాటు లొనరించి యుండెద. అంతదనుక నీవు నీమిగిలియున్నకార్యము నెరవేర్పుము. ఛత్రసాలుఁ డింకను గుఱ్ఱవాఁడు. వానికి శాంతిధైర్యము లొనఁగూర్ప మాతృప్రేమ యావశ్యకము. వాఁడు యుక్తవయస్కుఁడైనంత నీవు నాయొద్దకురమ్ము. ఛత్రసాలా! నాజీవనమునందలిమహానుభవము నొకదానిని నీకెఱింగింపఁగోరుచున్నాను. దానిని సావధానుఁడవై వినుము. నాచేసినప్రమాదము మరల నీచేఁగూడఁ గాకుండ శ్రద్ధాళుఁడవై మెలంగుము."

యువరాజగుఛత్రసాలుఁడు చేతులఁగట్టుకొని యవనతశిరస్కుఁడై తండ్రియెదుట నిలిచి యుండెను. దలపతిరాయలు నట్లే యతని సమీపమున నిలిచి యుండెను. ఇరువురును దాత్పర్యమునఁ జంపతరాయలమాటల నాలకించుచుండిరి.

చంపతరాయలు తనపూర్వజీవనముపై సింహావలోకన మొనరించి యీరీతి నుడువ మొదలిడెను.

"ఛత్రసాలా! యుద్ధము ప్రారంభించినపై నొకమాట వ్యర్థము గ పరస్పరరక్తపాతము కూడదని నీవు నాతోఁ జెప్పియుంటివి. నీయా మాటయొక్క మూల్యమును నేను కడునాలస్యముగ నెఱిఁగితిని. నేను స్వాతంత్ర్యమును గోరి కాఁగలప్రయత్నమంతయు నొనరించితిని. సుఖవిలాసాదులఁ దృణీకరించి రాత్రిందివములు స్వాతంత్ర్యప్రయత్నమునసే మునిఁగి యుంటిని. సర్వకాలముల నదియే నాలక్ష్యమై యుండెను. మహారాష్ట్రరాజ్యసింహాసనారూఢుఁడనై యున్నవేళ, నంతఃపురమున విశ్రాంతిఁ గొనుసమయమున, నాలయమున దేవీపూజాకాలమున, నెల్లపుడు నేను స్వాతంత్ర్యచింతామగ్నుఁడనే యైయుంటిని. మఱి యొండేదియు నాకెన్నఁడుఁగాన్పించుటయే లేదు. ప్రథమమున నేనౌరంగజేబునకు సోమగఢయుద్ధమున సాయ మొనరించి యుంటిని. మరల నిప్పు డాతనిమీఁదనే యాయుధ మెత్తితిని. మొదట శుభకరణుఁడు నేనుఁ గలిసి పోరాడుచుండెడివారము. ఇప్పుడు మేమన్యోన్యవైరమున మునిఁగి యున్నాము. ఒకప్పుడు నేను హీరాదేవి నొక్క సింహాసనారూఢ నొనర్చుట యుచిత మని భావించి యుంటిని. ఇప్పు డామెసైనికులతోఁ బోరాడుట యావశ్యక మని తలంచుచున్నాను. కాని పరస్పరవిరుద్ధము లగు నీసర్వకార్యములను స్వాతంత్ర్య[illegible]తియే నాకెల్లప్పుడు! గానవచ్చుచుండెను. ఇంత యయ్యుఁ బ్రయత్నమున సాఫల్యము నందఁజాలనైతిని. నాయాశయముఁ బడయనేరనైతిని. "నామనోరథవైఫల్యమునకుఁ గారణ మేమి? నాప్రయత్నములనెట్టిదోష మున్నది?" యనువిషయముల నేను మిగులగ నాలోచించితిని. ఈనాఁటికి నాదోషము, ప్రమాదము, వైఫల్యకారణము, నాకెఱుకపడినది."

ఛత్రసాలదలపతికుమారు లిరువురుఁ జంపతరాయనివచనముల

జాత్యంతశ్రద్ధతో నాలకించుచుండిరి. వారిరువురుఁ జంపతరాయలమాటలను దన్ముఖమున గోచరించుమనోవికారములను గాక తత్స్వరూపముననే విలీనులై యున్నట్లుండిరి.

చంపతరాయ లిట్లు చెప్పసాగెను:—"ఛత్రసాలా! నేను భవ్యస్వాతంత్ర్యసౌధనిర్మాణమునకుఁ గడంగితిని. కాని తదారంభసమయమున దానిపునాది దృఢముగ నున్నదా లేదా యని నేను బాగుగఁ జూడలేదు. స్వాతంత్ర్యప్రాప్తికై నేను సమరరంగమునఁ బోరాడితిని. కాని యెవరిస్వాతంత్ర్యమునకై నేను ప్రయత్నించుచుంటినో మొదట నేను వారిమనసులఁ బరిశీలింపలేదు. బుందేలులహృదయము లెంతవఱకు దాస్యభావాధిష్ఠితము లయ్యెనో, తదనుగాము లగుదోషములచే వారిసుగుణము లెంతవఱకు నశించి పోయినవో, యసహ్యానైరిదర్పమగుబుందేలులస్వభావ మెంతసంకుచితమై మాత్సర్యావిష్ట మయ్యెనో నేనెన్నఁడు విచారించి యుండనైతిని. కాఁబట్టియే నావైరులు స్వాతంత్ర్యవైరు లని తలఁప మొదలిడితిని. అట్టివారిమనసుల స్వాతంత్ర్యోత్సుకములుగ నొనర్చుటకు మాఱుగ స్వాతంత్ర్యనంద మొసఁగూర్చుటకు మాఱుగ యవనులట్లు వారుఁగూడ వైరులని భావించితిని. స్వాతంత్ర్యప్రాప్తికై యవనులతోడి యుద్ధ మెంత యావశ్యకమో వీరిని విధ్వంస మొనర్చు టంతకన్న నెక్కువ యావశ్యక మనియు నుపయోగకర మనియు నేభావించితిని. నాకు వీరిమాత్సర్యనిర్మూలనము కావింపనై యుండెను. కాని నేనట్లు లొనర్పక నిరాధారముగ మహాసౌధనిర్మాణమునకుఁ గడంగితిని. శుభకరణుఁడు నాకు ద్వేషి. హీరాదేవియు నాశత్రురాలు. [illegible]తియు బుందేలఖండమునందలి రాజులందఱు సామాన్యముగ నాకు వైరులే. కాని తద్వైరవినాశనమునకుఁ గాని తత్కారణ మరయుటకుఁగాని నేనెన్నఁడుఁ బ్రయత్నించియుండ

లేదు. నేనెల్లప్పుడును వారిని నావైరు లని భావించి వారితోఁ బోరాడు చుంటిని. ఇదియే నాప్రమాదము. స్వాతంత్ర్యసంపాదనముఁబోలు పవిత్రకర్తవ్యమును జేతఁ బెట్టుకొని యాత్మీయహితాహితజ్ఞానశూన్యు లగునాసోదరుల కుపదేశమొసఁగి వారిని సుమార్గమునఁ బెట్టుప్రయత్న ము నేనెన్నఁడు నొనరింపలేదు. వారిని ధ్వంస మొనర్చినఁగాని స్వాతం త్ర్యప్రాప్తి కాఁజాలదను భ్రాంతిమూలకమగు దృఢాభిప్రాయము నా మనసున నుండెను. ఎవరిని బ్రోత్సహింపవలసి యుండెనో వారిని ద్వేషింప మొదలిడితిని. ఈకారణములచేతనే స్వాతంత్ర్యమునకై నాకొనర్చిన భగీరథప్రయత్నమంతయు నిష్ఫల మయ్యెను. ఛత్రసాలా! యుద్ధారం భమునకుఁ బూర్వము నిరర్థకమగుననోన్యన్యరక్తస్రావ మేల యని నీవ న్నమాట కర్థమును నేను చాల నాలస్యముగఁ దెలిసికొంటిని. అగుఁ గాక. కాఁదగినదేదో యైనది. నీకుఁ జెప్పఁదగిన దంతయుఁ జెప్పివైచి తిని. అన్యోన్యమాత్సర్యవైరభావములఁ ద్యజించి యేనాఁడు బుందే లులు చక్రవర్తి సైన్యములతోఁ బోరెదరో యానాఁడే బుందేలఖం డము స్వతంత్రమగును. పునాది దృఢ మొనరింపకయే మందిరనిర్మా ణమునకుఁ గడఁగుట మహామౌర్ఖ్యము."

ఛత్ర—(గంభీరముగ) తండ్రీ! నీయుపదేశానుసరణమే సర్వో త్తమ మగునాకర్తవ్యము. ఈయాపదనుండి బయల్పడినతరువాత నేను మీమార్గమునే యనుసరింప నిశ్చయించుకొంటిని.

చంప—అక్కఱలేదు. నామార్గమునే యనుసరింపనక్కఱలేదు. నావిధానమున ననేకగుణము లున్నను నది కేవలనిర్దుష్టమని చెప్పరా దు. అందుచే నీయంశము నీకు బాగుగఁ దెలియపఱుపఁగోరుచున్నా ను. ఛత్రసాలా! నేను నీకు గురుఁడనగుటకు యోగ్యుఁడను గాను.

నీకు గురువు కాఁదగువాఁడు భారతదేశమం దంతట నొక్కఁడే యున్నాఁడు.

దల—ప్రాణనాథస్వాములు కారా?

చంప—కారు. స్వాతంత్ర్యప్రయత్నమున వారు మన కెంతటిసాయ మొసఁగుచున్నను, రాజనీతియుక్తము లగువిషయములందు వారిమన సంతయధికముగఁ జొరదు. కాని వారిచ్చగించిన బుందేలఖండము శీఘ్రకాలమున స్వతంత్ర మగుననుట కేమియు సందేహము లేదు. ఛత్రసాలా! స్వాతంత్ర్యవిషయమున గురూపదేశముఁ బడయఁ గోరెదవేని దక్షిణమున కేగవలయును. అచ్చట శివాజి యనునొకమహాత్ముఁడు మహారాష్ట్రదేశమునకు స్వాతంత్ర్య మొసగూర్చియున్నాఁడు. నీవతనిసేవకుఁడవై యతని గురువుగఁ జేసికొనుము. తదుపదేశానుసరణమున బుందేలఖండస్వాతంత్ర్యప్రయత్న మొనరింపుము. అట్లుచేసేని నీకుఁ దప్పక విజయము లభించును. బుందేలఖండస్వాతంత్ర్యసంపాదన మనునాశయమును నీవు నిర్వహింతువేని, నాయాత్మకు స్వర్గసుఖమును మించినసుఖము కలుగును. చూడుము. ఆయెదుటఁ గొందఱు యవనసైనికులు మనలఁ జుట్టుడింప నరుదెంచుచున్నారు. కుమారా! ఇప్పుడు నీవు శీఘ్రముగ నాత్మరక్షణోపాయము నెఱపుము. నేనిదె యంతిమసంగ్రామమున దుమికెదను. మంచిది. ఇఁక నేఁబోవుచున్నాను. పరమేశ్వరుఁడు మీకు శుభ మొసఁగూర్చుఁగాక.

ఇట్లు నుడివి చంపతరాయలు ఎదురుగవచ్చుచున్నసైనికులదెసకు మహోద్రిక్తుఁడై వెడలుచుండెను. కాని ఛత్రసాలుఁ డాతని సమయమునే నిలిపి యిట్లు నుడివెను.

“తండ్రీ! ఇప్పుడైన మీరు ప్రాణములఁ గాపాడుకొనవచ్చును. బుద్ధిపూర్వకముగ నగ్నిం దుముక నేమియక్కఱ కలిగినది!

చంప—ఛత్రసాలా! నేజీవించియుండుటకన్న మరణించుటయే బుందేలఖండమున కధికతరకల్యాణదాయక మని నీవెఱుఁగవు. ఇప్పుడు బుందేలులమనములఁ బ్రజ్వలించెడి మాత్సర్యాగ్ని నామరణమున నాఁపోవును. చాలమంది బుందేలులు చంపతరాయ లన్నను స్వాతంత్ర్య మన్నను నొక్కటే యని యెంచుచున్నారు. కాఁబట్టియే చంపతరాయనివైరులు స్వాతంత్ర్యమునకుఁగూడ వైరులు, ద్వేషులు నగుచున్నారు. నామరణమున నాద్వేషము తనంతటఁ దానే నశియించి బుందేలులమనముల నిర్వ్యాజస్వాతంత్ర్యప్రేమోత్పత్తి యగును. కావుననే నేనీసమయమున మరణించి తీరవలయును. దాస్యకళంకితమగు బుందేలఖండనరకమున జీవించుటకన్న సమరరంగమునఁ బోరాడి వీరమరణము నందుటయే శ్రేష్ఠము. నీవేగి నీతల్లిని రక్షింపుము.”

ఇట్లు నుడివి చంపతరాయలు ముందున కేగి యవనసైనికులపైఁ బడెను. దలపతి మహాపరాక్రమమున దత్సహాయ మొనరించుచుండెను. ఛత్రసాలుఁడు మాతృరక్షణసన్నద్ధుఁ డయ్యెను.

ఆనాఁటియాహవమునఁ జంపతరాయలు వర్ణనాతీతము,నపూర్వము నగుపరాక్రమముఁ బ్రదర్శించెను. నలువైపులఁ జుట్టి యవనసైనికులతనిపై శస్త్రములఁ బఱపుచుండిరి. బహుశస్త్రప్రహారమునఁ జంపతరాయనిశరీర మనేకస్థలముల రక్తధారామయమయ్యెను. అట్లయ్యు నాతనిఖడ్గ మట్లే ఖండనము నెఱపుచునే యుండెను. చంపతరాయ లట్లే యొకజాముదనుకఁ బోరుచునే యుండెను. ఈలోన నతఁడెందఱియవనులనో యమనగరమున కంపెను. ఆతని యసమానపరాక్రమముఁ గాంచి సమరదేవత తచ్ఛరీరమున సంచారమొనరించుచున్నట్లుండెను. నేఁటితనయంతిమయుద్ధసౌష్ఠవముఁ గాంచి యాతఁడు స్వయముగ నానందించుచుండెను.

శరీరమునందలిరక్తము ప్రవహించి పోవుచుండుటచేఁ జంపతరాయలు క్రమక్రమముగ శక్తివిహీనుఁ డగుచుండెను. తనశరీరమున శక్తి లేశమైన నున్నంతవరకుఁ బోరాడుచుండ నాతఁడు నిశ్చయించుకొనెను. కాని యతనిదేహమున నాఘాతములగుచున్నకొలఁది నాతని దౌర్బల్యముఁ బెరుఁగుచునే యుండెను. ఆసమయమున నలువురుసైనికులు ఖడ్గహస్తులై యతనిపై దుమికిరి. అట్టియవస్థనే చంపతరాయలు ముప్వురి నంత మొందించెను. కాని నాలవవానిపై నతఁడు ఖడ్గ మెత్తఁ జాలకపోయెను. అప్పు డతఁడు మరణోన్ముఖుఁడై వీరశయ్యఁ బడి యుండెను. చాలమందిసైనికులు మహీబాడేశాధీశుఁ డగు చంపతరాయలు మరణించె నని గట్టిగ నఱచిరి. అచ్చటికిఁ గొలఁదిదూరమున దలపతిరాయలు యవనసమూహముతోఁ బోరుచుండెను. అతఁ డాకేక విని తత్‌క్షణమే చంపతరాయలు పడియున్నచోటి కేగెను. చంపతరాయలు శోణితసిక్తుఁడై భూమిపైఁ బడియుండుటను, సమీపమునఁ దనతండ్రి యగుశుభకరణుఁడు ఖడ్గహస్తుఁడై నిలిచియుండుటను నతఁడు చూచెను. తనతండ్రియే చంపతరాయలప్రాణములఁ గొనెనని యాతఁ డెంచెను. వెనుకముందు లాలోచింపక యాతఁడు మహారోద్రేకమునఁ దండ్రిపై ఖడ్గ మెత్తనుండెను. ఇంతలో నాతనికిఁ జంపరాయనిక్షీణ స్వరము వినవచ్చెను.

‘‘ దలపతిరాయా! చాలును. ఆఁగుము. నిష్కారణముగఁ దండ్రిఁ జంపి నరకభోగివికాకుము. నేనిప్పుడే నీకుపదేశించిన దంతయు నింతశీఘ్రముగ మరచిపోయితివా! ఇంకముం దెన్నఁడు స్వకీయులతోఁ బోరాడవలదు.

పైకెత్తియున్నఖడ్గము నట్లే యుంచి దలపతిరాయ లత్యంత

దుఃఖమున “ ఈయనయే మీపై నాయుధముఁ బ్రయోగించెనుక దా !” అనెను.

శుభకరణుఁడు వ్యథితుఁడై నడుమనే యిట్లనెను:—లేదు. శుభకరణుఁ డంతటియదృష్టవంతుఁడు గాఁడు. ఆహవమునఁ జంపతరా యని వధియించి ప్రతిజ్ఞానిర్వహణ మొనర్చుకొనునదృష్టము శుభకర ణున కెక్కడ! చంపతరాయ లీయరణ్యమున నున్నాఁడని వినఁగనే నాప్రతిన నెరవేర్చుకొనుట మని మహాశతోఁ బరువెత్తి యిట వచ్చితిని. కాని యిచటికి రాఁగనే చంపతరాయ లీస్థితియం దుండుటఁ జూచితిని. ఇప్పుడు నేనీతనియంతిమకాలవేదనఁ గాంచి యానందించుచున్నాను.

చంపతరాయలు మిగులఁ గష్టమున నిట్లనియె:—దలపతీ! శుభ కరణుఁడు నుడువుచున్నదంతయు వాస్తవము. అతఁడు నాపై నాయుధ ప్రయోగ మొనర్పలేదు. నీవు నిష్కారణముగఁ బితృవధ మొనర్చ కుము.”

దలపతి, ఖడ్గముఁ గ్రిందవైచి చంపతరాయనిశిరముఁ దనతొడ నిడికొని విసరుచుండెను. ఇందుచేఁ జంపతరాయలవేదన కొంత తగ్గు చున్నట్లుండెను.

యవనసైనికులు మెల్లమెల్లగ నటనుండి జారుచుండిరి. వారిలోఁ జాలమంది మొదటనే చంపతరాయలమరణవార్తఁ బాదుషాకు విన్నవిం చుటకై వెడలిరి. ఆసమయమున ఛత్రసాలుని కవకాశము లభించెను. అతఁడు తల్లిని వెంటనిడికొని యనేకయవనకళేబరములఁ ద్రొక్కుచుఁ జంపతరాయలు పడియున్నచోటికిఁ జనుదెంచెను.

ఇదియే సరళాచ్ఛత్రసాలులధైర్యమును బరీక్షించుటకుఁ దగిన సమయమై యుండెను. చంపతరాయనిమరణసమయవ్యాకులతను గాం చిన వారిహృదయములు శోకవగ్ధము లయ్యెను. కాని వారు నేత్రము

లనుండి యొక్కయశ్రుబిందువునైనఁ గార్పలేదు. దుఃఖవచన మొక
టియు వారిముఖములనుండి వెలువడలేదు.

చంపతరాయల యీశోచనీయావస్థనుగాంచి శుభకరణుఁడు కూడఁ గొంతసేపటివఱకుఁ దనస్థితిని మఱచిపోయెను. అతనికిఁ జంపతిరాయనితోడి తన బాల్యమైత్రి స్మరణకు వచ్చెను. అతనిస్వభావమార్దవము, నతనిచనువు, నతనిమెప్పుటఁ జిత్రితము లయ్యెను. నడుమఁ గొన్నిదినములవఱకుఁ దమకుఁ గలిగినవైర మొకదుస్స్వప్నమని యాతనికిఁ దోఁచెను. ఆసమయమున నతఁడు చంపతరాయనిఁ దనపూర్వమిత్రునిగనే భావించెను. "ఇప్పుడు నేనీతనియంతిమకాలపోకనుఁ గాంచి యానందించుచున్నాను" అని తాను మొదట నన్నమాటఁ దలఁచికొని యతఁడు మిగుల దుఃఖించెను. నాపూర్వమిత్రుఁడు, సహచరుఁడు నన్ను శాశ్వతముగ విడిచి పోవుచున్నాఁడుగదా యని యెంచి యతఁ డత్యంతవ్యథితహృదయుఁ డయ్యెను. అతఁడు చంపతరాయనికై యేడువ మొదలిడెను:—

శుభకరణునినేత్రములనుండి స్రవించుచున్నయశ్రుబిందువులు రెండు చంపతరాయలముఖముపైఁ బడెను. ఆసమయమున నతఁడు మందస్వరమున నిట్లనియె:—

"ఛత్రసాలా! నేను మీతో వలదని చెప్పియుండ మీ రేల యేడ్చుచున్నారు!" ఇట్లుచెప్పి యాతఁడు మిగులఁ గష్టమునఁ జూడ ఛత్రసాలుఁడు నతనితల్లియుఁ గాక శుభకరణుఁ డేడ్చుచుంట కానరా నతనిమొగమున నాశ్చర్యచ్ఛాయ యుదయించెను. అతఁడు మిగుల మందము నస్పష్టము నగుస్వరమున నిట్లు చెప్పెను:—

"శుభకరణా! నీవు నాకై యేడ్చుచున్నావా! నేను మరణించిన నీకు దుఃఖము గల్గుచున్నదా!"

రణధీరుఁ డగు శుభకరణుఁడు మాటాడఁజాలక వెక్కి వెక్కి యేడువ నారంభించెను.

చంప—శుభకరణా! ఏడువకుము. నామరణసమయమున నీమనను నిర్మల మైనది. అదియే నాకు సంతోషకరము.

తనశోకము నాఁపుకొని శుభకరణుఁడు మిగులఁ గఠినముగ నిట్లనియె:—చంపతరాయా! నేనసత్యముఁ బలుకను. నామన సింకను నీవిషయమున నిర్మలము కాలేదు. నాకు బాల్యస్థితి జ్ఞప్తికి వచ్చినంత మాత్రముననే దుఃఖము గలిగినది.

చంప—శుభకరణా! నీమన సింకను నిర్మలము గాకుంటకు నీయెడ నేనేమపరాధ మొనరించితిని.

శుభ—ఈయంత్యకాలమున నాఘోరపాతకము నీస్మరణకుఁ దేనగును. పదునాలువత్సరములు గడచిపోవుటచేతను, ఉన్నతస్వాతంత్ర్యాశయానుయాయి వగుటచేతను, నీవావిషయము మరచి యుండ వచ్చును. తత్పాతకస్మరణమునను బశ్చాత్తాపమునను నీయంతఃకరణ మీసమయమున నెట్లైనఁ జలించినఁ జాలును. ఆపశ్చాత్తాపమున నీయాత్మ పరిశుద్ధమై నీవు ప్రాణములను సులభముగ వీడవచ్చును. పదునాలువత్సరములకుఁ బూర్వము నీవు నిర్బంధమున నేకన్యయొక్క కౌమారమునైన భంగపరిచితివా!

చంప— లేదు. నేనేకపత్నీవ్రతుఁడను.

శుభ—నీవొక్కతె కన్యాత్వముఁ జెరచుటయుఁ, దన్మూలమున నామె యాత్మహత్యఁగావించుకొనుటయు మరచితివి కాఁబోలు.

చంప—నాకీసమయమున శక్తి యుండిన నిట్టియసహ్యమిథ్యాకలంకము నారోపించినందులకుఁ దగినఫలము నీకు రుచి చూపి యుం

జేసితిఁడను. నాప్రవర్తనమున నెట్టికలంకమునైన నారోపించుట నన్ను ఘోరపరాభవముపాలొనర్చుటయే.

శుభ—చంపతరాయా! ఈసమయమున నీమరణకాలము సమీపించుటచే నీశక్తు లన్నియు నుడుగుచున్నవి. కాఁబట్టియే నీస్మరణశక్తియు నశించి యుండవచ్చును. లేకున్న నీవిపరీతఁ దిరస్కారింపవు. లలితానామధేయుని యగువనిత నీజ్ఞప్తియందున్నదా?

చంప—అ. బాగుగ జ్ఞప్తియందున్నది.

శుభ— ఆమె యాత్మహత్యచే మరణించినది. ఇదియు జ్ఞప్తియందున్నదా!

చంపతరాయలముఖమున నాశ్చర్యదుఃఖచ్ఛాయ కన్పింపఁదొడఁగెను. అతఁడు శుభకరణునిప్రశ్న కెట్టిప్రత్యుత్తరము నొసంగలేదు.

శుభ—నీవామెకన్యాత్వముఁ జెఱచితివి. కావుననే యామె యాత్మహత్యఁ గావించుకొనినది.

ఇప్పటికిఁ జంపతరాయనిశక్తి యంతయు క్షీణించిపోయినను బహుప్రయత్నమున నతఁడు సావేశముగ నిట్లనెను.

“ నేనామెను సోదరిగ నెంచి ప్రవర్తించితిని. ఆత్మసోదరివిషయమునను, మిత్రునియెడను నీవిట్టినీచానర్హ్యసందేహముఁ బూనియుంటివా! ఛీ!”

శుభకరణుఁడు దుఃఖమగ్నుఁడైనరీతి సందిగ్ధదృష్టిని జంపతరాయలదెసఁ జూడసాగెను. అతని యట్టియవస్థఁ గాంచి చంపతరాయలు మరల నిట్లనెను:—

“ శుభకరణా! సందేహావిష్టుఁడవై దేశద్రోహ మొనరించితివి. ఇఁకనైన సావధానుఁడవు గమ్ము.”

శుభకరణునినేత్రము లశ్రుపూరితము లయ్యెను:—అతఁ డిట్లు.

9

నేను:—"ఈమాటయే నాకు ముందుగఁ దెలిసియుండిన......"

చంపతరాయనియాత్మ శరీరమును వీడిపోయెను. అతఁడు తుది సారి తనభార్యను, బ్రాహ్మణుని, మిత్రునిఁ, గృష్ణదాసుఁ డనుదళపతిరాయనిఁ గాంచి యమరలోకప్రయాణ మొనరించెను.

సరళాచ్ఛత్రసాలులు వెక్కి వెక్కి యేడువసాగిరి. శుభకరణుఁ డుగూడ వారితోఁ గలిసి బాలకుఁ గీర్తి నేర్పుచుండెను.

బుంధేలఖండస్వాతంత్ర్యదీప మారిపోయెను !

---

## పదునెనిమిదవ ప్రకరణము

ఘాంచేరరాజభవనము.

జన్మజరామరణావస్థలుమూటికిని విశ్వ మంతయు నధీనము. కనుకనే వార్ధకమునఁ జాలకాలముప్రవృద్ధి యవసానమునఁ బ్రభాకరభగవానుఁ డపరాశాభూమిజమునఁ దనకాయము విసర్జించినప్పుడు సుఫలాదేవి కేమియు నాశ్చర్యముగలుగలేదు. అను కాశ్చర్యము ప్రభాకరుని యుత్తరాధికారకృత్యములందుఁ గలిగెను. సూర్యుని యుజ్జ్వలప్రభతోఁ బగఁబూనునతని యుత్తరాధికారి యగునంధకార మింతవఱకు నేగహ్వరమున డాఁగియుండెనో కాని సూర్యుని మృత్యువు గలిగిన ఘటకతోడనే యది సమస్తధరాతలమును దనయధికారమునఁ బడపఁ జొచ్చెను. వివస్వద్భగవానుఁడు లోకహితంబొనరింపనై గ్రొమ్మునరించి

సకార్యములన్నిటి నాశమొందించి సర్వప్రపంచమును గాలసామ్రాజ్యము నేలుకొల్పుటే తనకర్తవ్యమని భావించెఁ గాఁబోలు. కుందకుసుమములధావళ్యము, జపాపుష్పములయారుణ్యము, కేతకీకుసుమముల హారిద్రవర్ణము, దానికి నంతయు నిష్టములుకాకుండుటచే నది యన్నిటిపైని గాలిమఁ బూయ నారంభించెను. కొలఁదిసేపటిలో నీలాకాశమునుండి హరిద్భూతలమువఱకు రోదసి యంతట నంధకారసామ్రాజ్య మేర్పడెను. ఘూకములు, దుష్టనిశాచరములు, నంధకారమునకు జయజయధ్వానములు గావింపమొదలిడినవి. ఐనను సుఫలాదేవియు, విజయయుఁ దమయుద్యానవనమున నిస్తబ్ధలై కూరుచుండి యుండిరి.

తుదకు విజయకుఁ జెంతనున్న వల్లరీరుచిరకుసుమములుగూడ దృశ్యేతరములు కాఁదొడంగ నామె " ఇప్పటికి సూర్యుఁ డస్తంగతుండై కొంతసేపైనఁ గాలేదు. అంధకారం మీసుందరకుసుమముల కెట్టిగతిఁ గల్పించివైచెను!" అనియెను.

సుఫలాదేవి మంజులస్వరమున నిట్లనెను:— ఈ యంధకారము సూర్యుని యుత్తరాధికారి. ప్రతాపవంతుఁ డగునొకవ్యక్తి యునిచెమటచే దౌష్ట్యముగల తదుత్తరాధికారి యిట్లేచేయుచుండును" అనియెను.

విజ— భాస్కరుం డస్తమింపఁగనే యేరీతి నంధకారము నల్దెసల నుపద్రవ మారంభించెనో యావగిదనే బుందేలఖండస్వాతంత్ర్య తరణి యగుచంపతరాయ లస్తంగతుఁడౌటనే యౌరంగజేబు సమస్త బుందేలఖండమునను సంక్షోభ మొనరించుచున్నాఁడు.

నిట్టూర్పు విడిచి సుఫలాదేవి యిట్లనెను:— ఇదిగో యన్నిటికన్న దుఃఖదాయకమగునాట. చంపతరాయలు స్వర్గస్థుఁ డగుటతోడనే సమస్త బుందేలఖండమును స్వేచ్ఛాసేన యంధకారమునలోఁ

గప్పివైచినది. ఈయంధకారమున హీరాదేవివంటిపిశాచినులు, శుభకరణునంబోలు పిశాచములు కుప్పిగంతు లిడుచు జనులసౌఖ్యమును బాధ చేయుదురు. చంపతరాయలు నేఁటివఱకుఁ జేసినపాపసత్కార్యములెల్ల నీయంధకారమున నీపుష్పములవలె విలుప్తములై పోవును.”



సుఫ—మహాత్మా! తమ రామోదమున వారలఁ దోడ్కొని యంతఃపురములోనికి దయసేయుఁడు. అచ్చట బాగుగ మాటాడుకొన వచ్చును.

కొలఁదిసేపటికి సుఫలాదేవియుఁ బ్రాణనాథస్వామియు నపరిచితులగునాముగ్వురుఁ దోడుకొని యంతఃపురమునఁ జేరి. విజయ చాకచక్యముతో నచ్చటి దాసీగణమునంతను దొలఁగించి చివరఁ దానుగూడ నటనుండి పోవుచుండెను. అటుపైఁ బ్రాణనాథస్వామి యిట్లనెను:—

„విజయా! నీవిచ్చట నుండిన నష్టము లేదు. నీనుండి మేమే మాటయు దాఁపఁగోరుట లేదు.”

విజయ కూరుచుండినతరువాతఁ బ్రాణనాథప్రభువు సుఫలాదేవితో నిట్లనెను:—„సుఫలాదేవీ! నీవిట్లాశ్చర్యమున నేల చూచుచున్నావు? ఈసరళాదేవి నీకుఁ జిన్ననాఁటి చెలికత్తెయే. నీవామె నింకను గుఱుతింపలేదా! ఛత్రసాలా! దలపతిరాయా! ఈభవనము కంచుకిరాయలదే యయినను దీనియధికార మంతయు సుఫలాదేవిదే. మీారెట్టిసంకోచముఁ బొందక సుఫలాదేవియాదరసత్కారముల స్వీకరింపుఁడు.”

సుఫలాదేవి వారల నెఱిఁగి చాల సంతసించెను. సరళాదేవిని గడునాదరమునఁ గూరుచుండఁబెట్టుచు నామె యిట్లనెను:—

ప్రేమమయమయినట్టియుఁ, దేజోవంతమయ్యు సరళమైనట్టియు ఛత్ర సాలునివదనమువంకఁ దిలకింప సుఫలాదేవి కించుకసేపటివఱకు “ సరళాదేవి యొకమహాపరాక్రమశాలియు, స్వదేశాభిమానియు, స్వధర్మనిరతుఁడును, బరమసుందరాకారుఁడు నగు కొమారునిఁ బడసెను. కాని నేను పుత్రరహితను. నాకుంగూడ నట్టి పుత్రుఁ డైనను లేఁ” డని యించుక దుఃఖము గలిగెను. కాని త్వరితముగనే యామెమనసునఁ నాతఁ డొక్క సరళాదేవిపుత్రుఁడే కాఁడు. పుత్రరీతిని సేవఁ జేయించుకొనుటకు సమస్తబుందేలఖండమునకు నధికారము కలదు” అను నూహ పుట్టెను. ఐన నీయప్రత్యక్షసంబంధమువలన నామెకు సంతుష్టి చేకుఱదాయెను. అపు డామె యాసరళాదేవీతనయునిగుణజాలమును దనకొమరితగుణజాలముతోఁ బోల్పనాగెను. అప్పు డామెకు సుగుణములందును, సౌందర్యమునందును విజయాచ్ఛత్రసాలు లిరువురు సమానులే యని తోఁచెను. ఇరువురిదాంపత్యము నామెకుఁ జాలఁ జక్కఁగఁ దోఁచెను. వీరిరువురకును బెండ్లి యైనచో సులభముగనే తనకుఁ బుత్రరూపమున ఛత్రసాలుఁడు లభించు ననియు, సరళాదేవికి విజయవంటికన్య లభించు ననియు నామె యోజించెను. ఈతుదియాలోచనమువలన నామె మిగుల సంతోసముఁ జెందినది. ఆమె వాత్సల్యభావమున ఛత్రసాలునివంకఁ జూచెను. పిదప విజయవంకకు దృష్టి మరల్చెను. అప్పు డామెకుఁ దనతలఁపుల ప్రతిబింబము విజయ యాననమునఁ గన్పట్టెను.

సుఫలాదేవి తనమనసున నాయతిథులభోజనావాసాద్యుపచార రచనలు కావలయు నని యెంచుచు విజయతో నేమియో చెప్పఁగోరుచుండ నింతలోఁ బ్రాణనాథస్వామి, యామెతో నిట్లని పల్కెను. “ సుఫలాదేవీ! సరళాచ్ఛత్రసాల దలపతిరాయులు చాలదవ్వునుండి

యేలసి వచ్చిరి. నిన్నరాత్రినుండియు వీరన్నపానముల స్వీకరింపలేదు. వీరియాతిథ్య మత్యావశ్యకము. కాని తమసంకల్పసిద్ధి యగుటనుక వీరు విశ్రాంతిఁ గొనరు. అన్నపానముల గ్రహింపరు. ఇది వీరిశపథము.

సుఫలాదేవి చేతులు మోడ్చి యిట్లనెను — స్వామీ! నేఁజే యఁదగుసేవ యేదేనిఁ గలదేని సెలవిండు. నాకు వీరిసంకల్పము తెలిసినచో దాని నెఱవేర్చి వీరల సంతుష్టిపఱుప యత్నింతును.

సుఫలాదేవిమానసౌన్నత్యముం గాంచి ప్రాణనాథప్రభుఁడు గదు హర్షమున నిట్లునుడివెను: — మహారాజు చంపతరాయలు స్వర్గస్థుఁ డగుటవలన, మహీబారాజకుటుంబమునకుఁ బ్రాప్తించిన విషమస్థితి బుందేలఖండ మెఱుంగును. తొల్లి చంపతరాయల స్వాతంత్ర్యపతాక మెగిరెడిస్థానమున నేఁడు ఢిల్లీవిభుని కేతన మెగురుచున్నది. చంపతరాయలదేహావసాన మయిపోయినది. తత్కుమారుఁ డగుఛత్రసాలుఁడు వనమునఁ దిమ్మరవలసివచ్చెను. కాని కృతఘ్నుయు, దుష్టయు నగు హీరాదేవి యంతమాత్రమున నయివఁ దనివి నొందదయ్యె. ఆమెదృష్టియందు ఛత్రసాలకుమారుఁడుఁగూడ కంటకభూతుఁడై పీడించుచున్నాఁడు. ఈతని బందీకృతునైనఁ జేయవలయును. లేక యితనియసువులనైనఁ గొనవలయు నని యామె వాంఛించుచున్నది. సరలాదేవిమెడఁగూడ నామెకుఁ జాలద్వేషము. సరళాదేవిచ్ఛత్రసాలకుమారులజాడఁ దెలిసికొనిన దుర్మార్గునకు నామె చాలబహుమానము నొసంగును. కాన నామె సేవకబృందమును చాలఁగ వీరిజాడఁ గనుఁగొనుటకై నల్దెసలఁ బఱపియున్నవి. వీరల కెప్పుడేయాపద తటస్థించునో యని మాకు భయమగుచున్నది. ఆశ్రయమునకై వీరనేక బంధువులకడకు, మిత్రులకడకు నేగిరి. కాని కొందఱు హీరాదేవిభ

యముపలనను, మఱికొందఱు పాదుషాకు వెఱచియు వీరికిఁ దమకడఁ దావొసంగరైరి. కాన వీరు శరణమందుసిచ్ఛతో నీకడకు వచ్చి యున్నారు.”

సుఫ—స్వర్గవాసి యగుమహీంబామహారాజు సమస్తబుందేల ఖండమునకును జాలఁగ నుపకృతి యొనరించెను. ఆయుపకృతియొక్క కొంతభాగము నాకుఁగూడ లభించెను. కాని ఋణములహాఖానును విముక్తునిఁ జేసి వారు మాకుఁ గావించినయుపకార మమూల్యము. ఆఋణము మేమెన్నఁడుఁ దీర్చుకొనఁజాలము. అట్టి పరోపకారపరాయణుఁ డగుమహాత్ముని భార్యాపుత్రులసేవ యొనర్ప ఛాంధేరరాజ్యమంతియును సిద్ధమై యున్నది. ఇచ్చటి ధనవైభవములు, దాసదాసీజనములు, దుర్గములు, ప్రాసాదసౌధములు, సేవాజలములు, సర్వముఁ దమయధీనమే. తమకుఁ దోఁచినవిధమున వీనిని వినియోగింపుఁడు. దీనిని మహీంబారాజప్రసాద మనియే భావించి వలసినన్నాళులు సుఖముగ నిటవసింపుఁడు. తమ్ము సేవించుటచే మమ్ము మేముధన్యులముగ నెంచుకొందుము.”

ప్రిణ—(గద్గదస్వరమున) సుఫలాదేవీ! నీవు ధన్యురాలవు. నీవు నేఁడు బుందేలఖండగౌరవముఁ గాపాడితివి. ఏజనులహితమునకై చంపతరాయలు పలుకష్టముల కోర్చి యనేకప్రయత్నములు సలిపి తుదకుఁ దనప్రాణము లర్పించెనో వారిలో నొక్కరును జంపతరాయలపత్నీతనయులకుఁ దమకడ నాశ్రియ మొసంగరైరి. ఇంతకు మించి బుందేలులకృతఘ్నతయు నపుంసకతయు నింకేముండును! ఈసమయమున నీవిట్టిసాహస మొనరించి బుందేలఖండగౌరవము నిల్పితివి. ఒక్క సకలాదేవియే నీచెంత నుండును. నేను రేపు సూర్యోదయము కాక

మున్నే ఛత్రసాలదలపతిరాయుల వెంటఁగొని యిటనుండి వెడలిపోవు దును.

సుఫ—(కడువినయమున) స్వామీ! కొంతకాలము తమకును, ఈయిరువురియువరాజులకుఁ బరిచర్యసలువుభాగ్యము మాకు లభించు నెడల ధన్యుల మగుదుము.

ప్రాణ—ఇంక మేమిచట నెక్కువతడ వుండఁజాలము. బుందేలఖండపారతంత్ర్యము నానాటికిఁ బెంపొందుచున్నది. తదుద్ధరణతత్పరులకు క్షణమాత్రవిశ్రాంతియు హానికరము. ఇట్టితరి క్షణమాత్ర విలంబమైనఁ బ్రజ కనేకదుఃఖములకు నవమానములకు సంకటములకు హేతువగును.

సుఫ—మహాత్మా! అట్లైనచోఁ దమరు ధాంధేరసేనాదుర్గముల నుపయోగించుకొనవచ్చును. మునుపు మహీంబాదుర్గశిఖరమున నెగిరినస్వాతంత్ర్యవైజయంతిని నేఁడు ధాంధేరదుర్గశిఖరమున నెలకొల్పుఁడు. ధాంధేరసేనాబలము సహాయ్యబుందేలఖండమును స్వతంత్రమొనర్ప సమరరంగమున దుమికెనన మాకంతకన్న గర్వకారణ మేముండును!

ఛత్రి—ఇది మఱియు నుత్తమమగుమాట. ధాంధేరదుర్గము లభించినచో బుందేలఖండపారతంత్ర్యము తత్క్షణమే తొలఁగిపోఁగలదు. కాని మ్లేచ్ఛులతోఁ బోరుసమయ మిది కాదు. వెనుకటివలెఁ బ్రయత్నము విఫలము కాకుండుటకై యీసారి బుందేలఖండ మం దంతట నేర్పాటు జరుగవలయును. అందుచే ముందుగ మన మెన్నఁడుఁ గత్తి నెత్తరాదు. కాన ధాంధేరదుర్గమున స్వాతంత్ర్యధ్వజము స్థాపింపరాదు. భావికాలమున నది యెట్లును దప్పదు.

సుభ—అనుకూలసమయము ప్రాప్తించువఱకు మీరిచ్చటనే యేల యుండరాదు !

ఛత్ర—(సోద్రేకముగ) ఉచ్చకర్తవ్యపాలనమునకు శక్తిలేక వట్టిడంబములు పలికెడుజనులుమాత్రమే యనుకూలసమయమున కెదురుచూచుచుందురు. ఇట్టికార్యముల కనుకూలసమయమనుమిష నిడువారు కేవల మనస్కు లని యెంచఁదగును. తనయింటఁ దగులుకొనినయగ్గి నార్పుట కనుకూలసమయప్రతీక్షయన నెట్టిది! భీషణరోగగ్రస్తమగుతనదేహము నీరుజ మొనరించుకొంట కనుకూలసమయప్రతీక్షయన్న నర్థమేమి? ఆత్మవైభవాధికారములఁ గోల్పడకుండఁ గాపాడుకొనునెడ సమయము వ్యర్థముగఁ బోనీయరాదు. ఈసమయమున మనము పారతంత్ర్యనరకమున జీవనముఁ గడపుచున్నాము. ఈనరకమునుండి బయటఁబడుట కిదియే యనుకూలతమమగు నవసరము. తమకార్యతాత్పర్యవిహీనతవలన ననుకూలసమయచ్ఛలమును బన్నిడియితరబుందేలరాజులవలెనే మనముగూడ నూఱక కూరుచుంటిమేని నీయగ్ని బుందేలఖండము నంతను భస్మీభూత మొనరించివైచును. ఈవ్యాధి బుందేలఖండమును భక్షించివైచును. తద్వైభవమంతయు నాశనమై పోవును. అప్పటికిని మన కనుకూలసమయము లభింపదు. స్వకర్తవ్యనిర్వహణపరులగువారికి సమయమెప్పుడును బ్రతికూలముగ నుండదు. కర్మపరులట్టి తాము సమయము ననుగమింపక సమయమునే స్వానుకూలముగఁ గావించుకొందురు. కాల మనుకూలముగ నుండనప్పుడు దాని ననుకూలముఁ గావించుకొనుటయందు నష్టమేమున్నది? కాలము తాను స్వయముగ నొనర్చునకార్యములవలె నుత్కృష్టకార్యములను మానవసాహాయ్యము లేక యెన్నఁడుఁ గావింపనేరదు. కాన ననుకూలకాలమున కెదురుచూచుట తగదు. తండ్రి

గారి నిర్యాణమున కనంతరము నేఁటివఱకు మనము కాలము నలసత లోనే పుచ్చినాము. అనుదినము నస్తమించుసూర్యుఁడు మనవార్తలఁ దండ్రిగారి కందఁజేయుచుండును. కాన మన మింక సమయము వ్యర్థముగఁ గోల్పోవరాదు. మహానుభావు లగుప్రాణనాథస్వాములవారు తమయీశ్వరసంకీర్తనముం గట్టిపెట్టి బుందేలఖండస్వాతంత్ర్యమున మగ్నులైరని యస్తమితుఁ డగుసూర్యునివలనఁ దండ్రిగారికిఁ దెలిసి నపుడు వారి కెట్టిమహానందము చేకుఱును!

సుఛ—ఏమి! ప్రాణనాథస్వాములవారు మనపరతంత్రతఁ దొలఁగింపఁ బ్రయత్నింతురా? అట్లైన స్వతంత్రతాదేవి యగుసాక్షాద్వింధ్యవాసిని హస్తమున ఖడ్గముఁ దాల్చి మనకు సాహాయ్య మొనర్చునని భావింపవలయును.

ప్రాణ—నేను యథాసాధ్యముగఁ దప్పక మీకొఱకుఁ బ్రయత్నముఁ గావింతును. వనమున నివసించి భగవదారాధనము సలుపుటకంటె జనపదమున వసించి యనాథులకు దీనులకు సహాయ మొనరించుటయే యుత్తమమని నేఁదలఁచుచున్నాను.

సుఛ—ధన్యులరు. మహాత్మా! అట్లైనచో బుందేలఖండమునకిది గొప్పసౌభాగ్య మని యెంచవలయును. బుందేలఖండమునకు సుదినములు చాల సమీపించినవి. కనుకనే తమమనసున నిట్టిభావము లుదయించినవి. స్వర్గవాసి యగుమహిబామహారాజునకు నప్పటప్పటికిఁ దమవలన నాయోజనాదిసహాయము లభించుచునే యుండెడిది. తెమరు హృదయపూర్వకముగఁ దదభీష్టసిద్ధిని గోరుచునే యుండెడివారు. కాని యీకాలమునఁ దమ రిప్పటివలె స్వయముగఁ బ్రత్యక్షముగ నేకార్యము గాని యుత్తరదాయిత్వము గాని వహింపకుంటిరి. నేఁడు తమరీ భారమును గోరి వహింపసంసిద్ధులైతిరి. కావున నింక ఛత్రసాలుఁడు

విజయి యగుటకు సందియ మేమియు లేదు. బుందేలఖండము స్వతంత్రమొనర్ప స్వాములవా రెట్టిప్రయత్నము సల్పెదరు?

ఛత్ర—తండ్రిగారు తమయవసానకాల మాసన్నమగుటఁ గాంచి మాకొకయుపదేశ మొనరించి మేము విజయులము కాకుండుటకుఁ గారణములఁ దెల్పిరి. ఆ కారణములఁ దొలఁగించుభారమునే స్వాములవారు వహించిరి. స్వాములవచనములన్న బుందేలఖండమున కంతకు నెట్టిగౌరవమో ప్రజలు వారియాజ్ఞ నెట్లు శిరసావహింతురో తమరు స్వయముగ నెఱుఁగుదురు. ఎల్లి సూర్యోదయ మయినదిమొదలు ప్రభువుల యధికారయుక్తమగువాణి సమస్తబుందేలఖండమునను స్వాతంత్ర్యోపదేశసుధాధారలఁ జిలుకుట కారంభించును.

సుభ—ఇంక బుందేలఖండభాగ్యోదయమున కెట్టిసందియము లేదు. సరియే. రేపుప్రత్యూషమున స్వామితో మీ రెల కేగుదురో వచింపుము.

ఛత్ర—నేనౌరంగజీబుసరదారుఁడగు జయసింహునిసేనతో దక్షిణమున కేగెదను.

సుభ—నీ వాతనికడ సేవ నంగీకరించితివా యేమి?

ఛత్ర—(గంభీరముగ) స్వాతంత్ర్యప్రాప్తికై నేను కొంతకాలమువఱకు నిక్కనీచములు, నప్రియములు నగుకార్యములుసయిత మాచరింపవలయును.

సుభ—జయసింహుఁ డేపనికై దక్షిణమునకుఁ బోవుచున్నాఁడు.

ఛత్ర—బహదూర్ ఖాఁ కోకా యనుచక్రవర్తిసేనాపతి యొకఁడు చాలదినములనుండి దేవగడమున ముట్టడి వైచియున్నాఁడు. పాదుషాయాజ్ఞానుసారముగ జయసింహుఁడు అతనికి సాయము చేయ నేగుచున్నాఁడు.

సుఫ — ఐన నీవు పాదుషాపక్షమునం బోరెదవా?

భత్రి — ఔను. అవసరమైనచో నేను యుద్ధముంగూడం గావింపవలసియుండును.

సుఫ — ఢిల్లీసామ్రాజ్యమూలవిచ్ఛేదముం గావింపంగోరునాతండు తత్సేనాసాహాయ్యముల నెట్లుపొసగించును?

భత్రి — రాజకీయకారణములవలన నొక్కొక్కసమయమున నప్రియము లగుకార్యములంగూడం జేయవలసి యుండును. దక్షిణాపథమున కేగుటకు జయసింహునితోడు నాకు బాగుగం దోంచుటచే నేనాతనితో నచ్చటి కేగ నిశ్చయించుకొంటిని. పాదుషాసేనలోం గలియుమాట తరువాతవచ్చినది.

సుఫ — (సాశ్చర్యముగ) కాని నీవిట్టిసమయమున దక్షిణమునకుం గదలిపోవ మొగడించుటకును నౌరంగజేబుసైన్యమునం జేరుటకు నావశ్యకతయేమికలిగె?

ప్రాణ — దక్షిణమున ''శివాజీయను నొకమహారాష్ట్రదేశపు మహాత్ముండు దనదేశమును స్వాతంత్ర్యము గావించుయత్నమున నున్నవాండు. అతండు చాల సమర్థుండగు రాజనీతిజ్ఞుండు. అతనియొద్ద గురుశిక్ష నందుటకై భత్రిసాలుండు దక్షిణమున కేగుచున్నాండు. స్వాతంత్ర్యము సంపాదించుటకై మనము తుదకుం బాదుషా సైన్యములతో నతిభీషణసమరము గావింపవలసి యుండును. కనుక మొదటినుండియుం దదాంతరికస్థితి బాగుగ నెఱింగియుండుట యావశ్యకము. పాదుషాసైన్యమున యుద్ధరహస్యము లెట్టివో సైనికులకు నధికారులకుం గలయన్యోన్యసంబంధ మెట్టిదో మున్నగు ననేకావశ్యకవిషయములం దెలిసికొనుట కిదియే సర్వోత్తమమగు సమయమని యితనికిం దోంచుటచే నీతండు సార్వభౌమునిసేనతోం గలియ నుద్దేశించెను.

ప్రాణనాథప్రభునిమాటలు వినుటచే సుఖలాదేవి యాశ్చర్యము తొలఁగి సమాధానముగలిగెను. ఆమె యిట్లనెను:—"నేనొక్క సరలాదేవిపరిచర్యమాత్రమే చేయవలయునా? ఇదికాక ప్రభువువారి యానతి వేఱొండేమైనఁ గలదా!"

ప్రాణ—బుందేలఖండమునఁ దక్కిన యేర్పాటు లన్నియు సగువఱకు నీకీకార్యమే చాలును. జయసింహుఁడు మనచంపతరాయల చిరమిత్రుఁడు. కాన ఛత్రసాలునివిషయమున నాకేమియుఁ జింతలేదు. కాని సరలాదేవి నెచ్చట నుంచవలయునని మాత్రమే యోచించుచుంటిని. నీతో నేతద్విషయిక మగుసంభాషణము గావింపనంతదనుక నాకు మిగుల చింతగ నుండెను. ఇఁక మేమెల్లవిధముల నిశ్చింతుల మైపోయితిమి. నిరాతంకముగ మామా కార్యములఁ గావించుకొందుము. కాని సుఖలాదేవీ! ఒకమాట నీతోఁ జెప్పఁగోరుచున్నాను. సరలాదేవి యిచట నున్నమాట యేరికిఁ దెలియరాదు. ఇందుఁ జాల శ్రద్ధతో మెలఁగవలయును. కంచుకిరాయలు సంపూర్ణముగ హీరాదేవికి వశీభూతుఁ డనియే తలఁపవలయును. కావున సరలాదేవి కెప్పు డెట్టి యాపద సంభవించునో చెప్పఁజాలము. ఎవ్వరికిని జంపతరాయల రాణి—ఛత్రసాలునిజనని—యిచ్చట నున్నదని తెలియకుండు నేర్పాటు నీవు గావింపవలయును.

సుఖ—మహాత్మా! తమరీవిషయమున నేమియుఁ జింతింపకుఁడు. అన్ని యేర్పాటుల నేఁజేసెదను.

జల—(ప్రాణనాథస్వామితో) కంచుకిరాయలు నేఁడెచ్చట నున్నాఁడు?

విజ—వింధ్యవాసినీమహోత్సవానంతరము తండ్రిగారిటకు రాలేదు. ఢిల్లీనుండివారు మరలి వచ్చినసమాచారముమాత్రము వచ్చె

నది. కాని యింతదనుక వారిచటఁ జేరుకొనలేదు. బహుశః ప్రస్తుతమున వారోర్ఛాయందే యుండియుందురు.

సుఫ—(ప్రాణనాథునితో) ఇతఁ డెవరు!

ప్రాణ—ఇతఁడు సాగరదేశాధీశుఁ డగుశుభకరణునికుమారుఁడు. ఈతనిపేరు దళపతిరాయలు.

సుఫ—ఇఁతడు హీరాదేవిమండలిలో నుండవలసినవాఁడే. తమ కనుచరుఁ డెట్లయ్యె!

ప్రాణ—ఇతఁడు చంపతరాయలభక్తుఁడు. ఛత్రిసాలుని ప్రియమిత్రుఁడు. ఎందులకో తెలియదు కాని, శుభకరణుఁ డీతని రాజ్యమునుండి వెడలనడిపెను. చాలదినములనుండి యితఁడు ఛత్రిసాలుని తోడనే యున్నాఁడు. బుందేలఖండస్వాతంత్ర్యవిషయికము లగుసుపాయముల నితఁ డెల్లపుడు యోచించుచుఁ దత్ప్రయత్నములు సల్పుచుండును. మొన్న జరిగినచంపతరాయలయంతిమయుద్ధములం దితఁ డాతని కెంతయు సాయ మొనర్చి మహోపరాక్రమము నెఱపెను. ఇపుడితఁడు బుందేలఖండమునం దంతటఁ బరిభ్రమించి దేశమునస్వాతంత్ర్యప్రేమ లగుయువకు లెందఱు కలరో, యవసరమగుతఱి, మన కిచటనుండి యెంతెంతసాయము లభించునో తెలిసికొనును.

సుఫ---ఇతనిచరిత మంతయుఁ గడుఁ బ్రశంసనీయముగ నున్నది.

కొలఁదిసేపటిలో భోజన మారంభ మయ్యెను. చంపతరాయల నిర్యాణానంతరము ఛత్రిసాలదళపతులకు నేఁటిభోజనమే యించుక రుచించినది. కాని పతిమరణాతుల యగు సరలాదేవి కుమారుని భావివియోగమున నైనవిచారమున నేమియు భుజింపదయ్యెను.

భోజనానంతర మెల్లరు విశ్రమించిరి. జాముఱాత్రి యుండఁగనే ప్రాణనాథస్వామియు, ఛత్రిసాలదళపతిరాయులును లేచి ధ్యాంధ్ధే

తరాజప్రాసాదమునుండి బయలుదేఱిరి. సరళాసుఫలాదేవులనుండి దీవెనలఁ గొని ఛత్రసాలుఁడు విజయవంకకుఁ దిరిగెను.

సుఫలాదేవి కానందాశ్చర్యములు రెండుఁ గలిగెను.

ఛత్ర—విజయా! జయసాగరసరోవరతటమున నేను నీతోడను విమలదేవునితోడనుఁ గావించినప్రార్థన నీజ్ఞప్తియం దుండవచ్చును. విమలదేవుఁ డావిషయమున నేమియు జేయఁజాలకపోయెను. కాని నీవింతయుత్తమముగ నెఱవేర్చినదానికి నేనెంతయు గర్వించుచున్నాను.

విజ—విమలదేవుఁడు, కన్పట్టురీతిని, వాస్తవముగ యువరాజు కాఁడు. అతనికి వృథాదోష మారోపింపకుఁడు.

విజయాచ్ఛత్రసాలులు పరస్పర మెంతయో సంభాషింపఁగోరుచుండిరి. కాని యిరువురును తమతమహృదయభావముల వ్యక్తీకరింపనది యుక్తసమయము కాదని యెంచిరి.

ప్రాణనాథప్రభువు తనయిరువురుశిష్యులను వెంటఁగొని బుందేలఖండస్వాతంత్ర్య సంపాదనప్రయత్నమున ధాంధేరరాజభవనమునుండి వెడలిపోయెను.

---

## పందొమ్మిదవప్రకరణము

### లలితాదేవిప్రేమమూర్తి.

శుభకరణునకు భూచక్రమంతయుఁ గడుభయంకరముగఁ దోఁపసాగెను. అతనిమనసునందలినిరాశ యంతకంతకుఁ బెరుఁగుచుండెను. అతఁడు మిగుల నుత్సాహరహితుఁడై పోయెను. మనసు తెలుపి చేసికొనుటకై వేఁటాడఁ బోవుచుండెడివాఁడు; ఒక్కజంతువు నైనఁ జంపకయే యడవినుండి మఱలి వచ్చుచుండెడివాఁడు; మృగయాసామర్థ్యమున నెపుడైన నొకమృగమును బరిమార్చునవసరము ప్రాప్తించునెడ మనుజులకంటె వన్యమృగములు తక్కువ కౄరము లనియుఁ దక్కువహింసకము లనియు నెంచి యాతఁడు దన్మారణేచ్ఛ వదలుకొనుచుండెడివాఁడు. కొంచెముసేపు తనమనశ్చింతఁ దొలఁగించుకొను నభిప్రాయమున నతఁ డొకయుద్యానవనమున వాహ్యాళి సలుపఁబోయి యట యామవములకొలఁది విహరించుచుండెడివాఁడు. ఆసమయమున నచటిపుష్పము లన్నియుఁ దన్ను గేలిసేయుటకై నగుచున్న వని యాతనికిఁ దోఁచెడిది. అతఁడు తోఁపునుండి వెడలుసమయమున నతనినిరాశ మఱింత హెచ్చుచుండెడిది. ఇనమండలాంతరనివిష్టుఁడై చంపతరాయలు అత్యంతకోపనుఁడై తనవంకఁ జూచుచుండు నని యూహించి యాతఁడు పగలెప్పుడు నాకసమువంకఁ జూచెడివాఁడు కాఁడు. ఇఁక రాత్రివేళ బుందేలఖండస్వాతంత్ర్యమునకై పోరాడి మరణించినవీరు లెల్లరు నంబరవీథి నక్షత్రరూపమున నాసీనులై యుండి, తనవంకఁ దదేకదృష్టితోఁ దిలకించుచుందు రనుతలంపుచే నభము వీక్షింప నతనికి సిగ్గగుచుండెడిది.

కునకు లలితవృత్తము లింకను జ్ఞప్తియం దున్నదని హీరాదేవి తెలిసి కొనుటకుఁ దగినసంఘటన మేమియు నదువు జరిగియుండలేదు. లలిత విషయమున హీరాదేవి శుభకరణునిమనమున నామెను స్మరించుట కూడఁ బాప మని యెంచునంతటియసహ్యత జనింపఁజేసెను. "శుభకరణునికి లలిత జ్ఞప్తికి రాకుండుఁగాక. లేనిచో నెట్టియాపద నెదుర్కొనవలసివచ్చునో" యనియే హీరాదేవి కోరుచుండెడిది. కాని శుభకరణునిస్మృతియందు లలిత యింకను నున్నదనియు, నదికాక తానతనితోఁ జెప్పినకథయు నసత్య మనియుఁ, గల్పితమనియుఁ గూడ నతనికిఁ దెలిసె ననియు నెఱిఁగి హీరాదేవి భయాద్భుతంబులచేఁ జాలఁ గలఁగిపోయెను. కలఁతమూలమున నామెనోటినుండి మాటకూడ వెలువడఁజాలకుండెను. తుదకు శుభకరణుఁడు క్రమ్మఱ నిట్లనెను.

"నరకమున కేఁగుటకు నీయంత నీవై యెట్టిమార్గముఁ జెప్పఁగోరుట లేదని తోఁచుచున్నది. బుందేలఖండమును పారతంత్ర్యకర్దమమునఁ జిక్కించి, నామతి విభ్రష్టము గావించి, నాచే ననేకరాక్షసకృత్యములఁ జేయించి, చంపతరాయలను, బుందేలఖండమందలి యనేకవీరవరులను హత్య చేయించి నిజపతిమరణమునకు హేతుభూతవై నీవు గావించినభయంకరదోషములకు, నీకేశిక్ష నొసంగవలయునో యని చాలసేపాలోచించితిని. కాని నీపాపములు మానవునకుఁ గల్పనాతీతములై పోవుటచే వానికిఁ దగినదండనము యోజింపఁజాలకపోయితిని. కాన నీకెట్టిదండన మొసంగఁదగునని నిన్నే యడుగుచున్నాను. కాని నీకు నీవై యిది చెప్పఁగోరుట లేదుకాఁబోలు! కావున నీశిక్ష నేనే నిశ్చయింపవలయును."

అని పలికి శుభకరణుఁడు యోజింపమొదలిడెను. ఒకమనుజుని జంపువానిశిరము నఱకవలయు ననియు, దేశద్రోహము జేయువానికిఁ

ప్రాణదండనము చాలుననియు, దేశధర్మబంధుప్రేమములనుండి యొకరిమనసును మఱలించువానిని వధ్యస్తంభమున వ్రేలాడఁదీయుట న్యాయ మనియు నతఁడు బాగుగ నెఱుఁగును. కాని యతిభయంకరముగ నీయపరాధము లన్నియుఁ గావించునొకవ్యక్తికి లభింపఁ దగు దండనము నాతఁ డూహింపనైనఁ జాలకుండెను. అతఁడు భయకంపితుఁ డగుకంచుకిరాయలవైపు చూచెను. హీరాదేవికై యతఁ డేదైన శిక్ష దెల్పునేమో యని యతఁ డాశించెను. కాన నతఁడు కంచుకిరాయల నిట్లు ప్రశ్నించెను.

"మహాశయా! మీరు వచింపుఁడు. మీరు ఢిల్లీరాజసౌధములందు వత్సరములకొలఁది వసించితిరి. హీరాదేవి యిప్పటివఱకుఁ గావించినగురుతరాపరాధముల నెల్ల మీరు బాగుగ నెఱుంగుదురు. ఆయపరాధము లన్నిటికి నేశిక్ష విధింపవలయునో, యీమె నేరీతి యమపురి కంపఁదగునో, మీరే వచింపుఁడు. ఈమెకుఁ దక్కువశిక్ష నొసంగి పాపముఁ గట్టుకొనుట నాకిష్టము గాదు."

ఇంతలో హీరాదేవి తనమనసును గొంత కుదురుపఱచుకొని భయచిహ్నములను కృత్రిమహాసముమఱుఁగున డాచిపెట్టెను. ఇపు డామె యీసంఘటనపుమర్మభాగముం జేరసంసిద్ధ యయ్యెను. ఆమె తనముఖముపైనుండి యాశ్చర్యప్రసారము నింతయుఁ దగ్గింపక కడు సుకుమారమగుస్వరమున నిట్లనెను:—

"మహారాజా! మొదట మీరించుక శాంతింపుఁడు. [illegible] ముగ నాయపరాధ మేమైన నున్నచో దానికై [illegible] నేను కడుసంతుష్టనై స్వీకరింతును. కాని సాహసి[illegible] మున్నుగ మీరించుక యాలోచింతురుగాక. సాగరదేవుని[illegible]

యగు లలితపై నేనసత్యకలంక మాపాదించితి ననియేకదా మీరు చెప్పునది!"

శుభకరణుఁ డామెను దిరస్కారదృష్టితోఁ జూచుచు "అవును" అని యుత్తర మిచ్చెను.

హీరా—చంపతిరాయ లామెకన్యాత్వమునకు భంగము గలిగింపలేదని మీకు విశ్వాసము కలిగినదికదా!

హీరాదేవి దార్ఢ్యమును జూచి శుభకరణునకు ఖేదాశ్చర్యములు రెండును గల్గెను. అతఁ డిట్లనెను:—"లలిత నాకేమగునో నీకుఁ దెలియునా! ఇపుడు నీవామెవిషయమునఁ బలుకనున్న దేదియో, యామె నాసోదరియనుమాట స్మృతియం దుంచుకొని పలుకుము. ఆమెకౌమార్యము నష్టపడలేదు. తనసోదరీసోదరులహితమునకై ప్రాణము లొసంగుచంపతరాయలవంటి సదాచారసంపన్నుఁ డగుమహాత్ముఁ డొకసుశీల యగుకన్యకతో సరసమాడ సిద్ధపడె [illegible] య[illegible]చుట మిక్కిలి నికృష్టమగుపని. వారిరువురిమైత్రి వయ్యుఁ బవిత్ర[illegible] రహితము. లలితను జంపతరాయలు [illegible] సంపూర్ణముగ నిశ్చితమైపోయెను. హీరా[illegible] డెను. ఐన నామె కృత్రిమధైర్యము[illegible]ట్లనెను:—[illegible] రించి తేచినట్లు తోఁచుచున్నది. కానిచో స్వప్నదృష్టమైనట్టియుఁ గల్పితమైనట్టియు, వసత్యమైనట్టియు దృశ్యముపై మీకింతవిశ్వాస మెట్లు కలుగును! మీరు స్వప్నమునఁ గాంచినలలితాచంపతరాయల నిష్కపట వ్యవహారమే యాధారముగఁ గొనికదా మీరు నామాట లసత్యములని పరిగణించుచున్నారు!

శుభ—ఏమి నీయమానుషధృష్టత! నాకు లలితాచంపతరాయలవ్యవహారము పరిశుద్ధమనియుఁ, బాపరహితమనియు నమ్మకము

కలిగినది మొదలుకొని నామనమున భ్రష్టాత్మకకల్పనాతరంగము లుప్పతిల్లఁజేయు నిద్దురను బరిత్యజించినాఁడను. అప్పటినుండి యుండు నేను నింద్యము గుప్తి దాల్చి నిష్కారణముగ నేను దేశమునకు ద్రోహుఁడనై తినని తెలిసికొంటిని. ఆసమయమున నామనస్సునందు ఉద్భవించిన లజ్జాశోకపశ్చాత్తాపముల ప్రసారము నేఁటివఱకు చల్లనై యున్నది. కనుకనే నీకు నావదన మింత ప్లానముగను, నిస్తేజముగను గన్పట్టుచున్నది. నా మొగముఁ జూడ నీకుఁ జంపతరాయలవర్తనము నిర్మల మైనదనియు, నేనింతదనుక ఘోరప్రమాదమునకు వశుఁడనై యుంటి ననియుఁ దేటపడును."

హీరాదేవి మఱింతదార్ఢ్యమున నిట్లడిగెను:—కాని లలిత చంపతరాయలపాపవర్తనమున నాత్మహత్యఁ గావించుకొనలేదని మీకు నమ్మక మెందువలనఁ గలిగెను?

శుభ—లలిత మరణించువఱకుఁ జంపతరాయ లామెయెడ సోదరునివలెఁ బ్రవర్తించె నని నాకు సంపూర్ణముగు ప్రమాణము లభించెను.

హీరా—(వికటముగ నవ్వుచు) సంపూర్ణముగు ప్రమాణమా! లలిత చంపతరాయలఁ దనసోదరునివలెఁ జూచుకొనుచుండుటకు కొట్ట ప్రమాణము అవసరము లేదు. కాని లలితయెడఁ జంపతరాయలమనసు నిష్పాపముగ నుండెననుటకు మీకెట్టిప్రమాణము లభించినది? చంపతరాయలమనసుమాట మీకెవరు చెప్పిరి?

శుభ—స్వయముగఁ జంపతరాయలే!

హీరా—(భయము నటించుచు) స్వయముగఁ జంపతరాయలే! మనుష్యకోటిలోని చంపతరాయలా! లేక పిశాచకోటిలోనిచంపతరాయలా! లలితవిషయమున మిమ్మెవరు సమాధానపఱిచిరి!

యదలించి యిట్లనెను:—"నోరు మూయుము. అర్థములేనిమాట లాడకుము. మీ రిరువురుఁ గలిసి నన్ను మోసగింపఁ గోరుచున్నారు. ఇఁక శుభకరణుఁడు వెనుకటివలె మూర్ఖుఁడు గాఁడు. ఇంతవఱకు హీరాదేవిమాటలు విని నేను నాకర్తవ్యముల నెల్ల ధ్వంస మొనర్చితిని. కాని యిపుడు నాకన్నులు విడివడినవి. నేనిఁక మీమాటలఁ జిక్కువాఁడఁ గాను. హీరాదేవీ! ఇపుడు నీవు నీయపరాధములకు శిక్ష ననుభవింప సంసిద్ధవు గమ్ము. నేను నీకు మరణదండన మొసంగ నిశ్చయించుకొంటిని. నేఁటివఱకు నేనెందఱిబుందేలులయసువులనైనఁ గొంటిని. కాని యీహత్యల కన్నిటికిఁ బ్రాయశ్చిత్త మొక్కనీవధతో నగును. నీవు బ్రదికియుండునంతకాలము బుందేలఖండమునకు స్వాతంత్ర్యము లభింపదు. కనుక బుందేలఖండస్వాతంత్ర్యదేవికి నిన్ను బలియొసంగెదను. హీరాదేవీ! ఇంక నీవు చచ్చుటకు సిద్ధపడుము. నేను నీమాటలవిలువను జంపతరాయలవిస్మృతిప్రలాపములపాటిగఁ గూడ గణింపను. ఇఁక నీప్రాణముల నేరీతిఁ గొననగునో చెప్పుము. కుత్తుక నొక్కియా, ముష్టిఘాతములనా, పదప్రహారములనా! కాని యిందేమార్గము నవలంబించినను నీయపవిత్రదేహముం దాఁకవలసివచ్చును. అట్లు తాఁ... టవలన నాకుఁ గలుగుపాపమునకుఁ బ్రాయశ్చిత్తముగఁ గం... ములవంటి మరియొకద్రోహాని వహింపవలసివచ్చును. కావున సిగుప్పురి నొక్కసారియే వధించుట యత్యుత్తమము."

తనప్రాణముల కింతటిపెద్దచేటు వాటిల్లుచుండుటఁ జూచి కంచుకిరాయలు సహింపఁజాలకపోయెను. అతఁడు తత్క్షణమే యిట్లనెను:- "శుభకరణమహారాజా! మీ రట్టియన్యాయము చేయకుఁడు. మొదటిమాట యేమన నేను నిరపరాధిని. నన్ను వధించినచో సాధ్వియగు నాసతి విధవయై పోవును. ఏమియు నెఱుఁగని నాకూఁతురు దిక్కులేనిదై

పోవును. రెండవమాట యేమన మీరు వీరవగులు. మీకు హీరాదేవి వంటి కోమలాంగిపైఁ జేయి యెత్తుట తగదు. అటుపై! మీచిత్తము వచ్చినట్లు కానిండు. కాని యెట్లుచేసినను బాగుగ విచారించి చేయుఁడు.

శుభ—(క్రోధము శాంతించి) నీవు చెప్పినది వాస్తవము. సాధ్వియగునీపత్ని, దేవియగు నీకొమరిత వీరిఁ దలంచియే నిన్ను విడిచి వైచుచున్నాను. కాని యిపుడు నీవిచటనుండి శైఘ్రంబ వెడలిపొమ్ము. ఒక్కక్షణమైన నిట నుండరాదు. కాని హీరాదేవినిమాత్రము చంపక విడువను. స్త్రీహత్య సల్పుటయందు దోషము కలదు. కాని ప్రపంచమునకహితముఁగూర్చు నిట్టిరక్కసులజీవములఁ గొనుటవలన మిక్కిలి పుణ్యము గలుగును.

కంచుకిరాయలు ‹‹బ్రతుకు జీవుఁడాయని కాళ్లు నెత్తి నిడికొని యచటినుండి పరుగెత్తెను.. పోవునపు డతఁడు హీరాదేవివంకఁ జూచుట యైన నావశ్యకమని యెంచలేదు.

కంచుకిరాయలు వెడలిపోయినపిదప శుభకరణుఁడు హీరాదేవి తో ఇట్లనెను:—‹‹హీరాదేవి! నేను నీప్రాణములఁ గొన దృఢనిశ్చయము చేసికొంటిని. ఇఁక నీజీవనము నాలుగైదుక్షణములే యుండును. నీ యంత్యకాలము మిక్కిలి యాసన్నమైనది. ఇప్పుడైన నొకమాట యథార్థముగఁ జెప్పుము. లలిత యాత్మహత్య యెందులకుఁ జేసికొనెనో నాకు నగగఁ దెల్పుము.

హీరా—మహారాజా! నేను రాజకీయవిషయముల ననత్యము పలికి యుందును. పరులయెడ గుట్టు రట్టుచేసి యుందును. కాని మీతో నొక్కమాటైన ననత్యముఁ జెప్పి యుండను. లలితకు నాకుఁ బరస్పరము సోదరీప్రేమ వెలయుచుండెడిది. అట్టియామె గూర్చి నే నిట్టినీచమిథ్యావచన మేల చెప్పుదును! చేసినాసదీగర్భమునఁ దేలివచ్చి

నయీమె యిచ్చిన మృతదేహము మీరు గుఱుతించి యుంటిరి కదా! ఆమె శరీరమందలి నగలు వస్త్రములు మీరే గుఱుతించితిరి కదా! ఆనవాలునుబట్టి లలిత యాత్మహత్య గావించుకొనె నని మీరు నమ్మకము గలిగియుండెను గదా!

శుభ.—ఔను. లలిత యాత్మహత్య గావించుకొనె నని నే నిప్పుడు నంగీకరింతును.

హీరా—లలిత యెప్పుడును బ్రసన్నమనస్కయై యుండెడిది. ఆమె సౌఖ్యావహమగుస్థితిఁ జూచి యెఱుఁగదు. [illegible] సహించుచుండెడిదాదు. ఆమెకుఁ బ్రదికించవలయు [illegible] వాంఛ లేకుండెడిది. అట్టియెడ నామె యాత్మహత్యవంటి భీకరకార్యమేల యాచరించినది! ప్రపంచమున నేరికిఁ దనముఖముఁ జూపరాదను నిశ్చయమునామె కేలవాటెమెను! ఆమె తనజీవనము నేల విసర్జించెను!

శుభ—(గంభీరముగ) అది యొక ప్రశ్న!

హీరా—చంపతరాయలు లలితకన్యాత్వము భంగపఱుప నిచో—

శుభకరుఁడు మిగుల దుఃఖితుఁడై పోయెను. అతఁడు మాట నడుమనే యిట్లు నుడివెను:—«నురలఁ జంపతరాయలా! లలితాకన్యాత్వభంగమా! హీరాదేవీ! చంపతరాయలతో నాకుఁ జాలకాలము గాఢమైత్రి యుండె నని నీవెఱుఁగవు కాఁబోలు. అతనియందుఁ గల గుణము లన్నియు నేనెంతయు బాగుగ నెఱుఁగుదును. అతనియందు దుర్గుణ మొక్కటియుఁ బేరునకైన లేకుండె నని కూడ నేను బాగుగ నెఱుఁగుదును. నీమాటలలోఁ బడి నేనాతనితోఁ బగఁబూనినప్పుడా మహాపురుషుని గుణములఁ జూచి లోలోననే విముగ్ధుఁడనై పోవుచుండెడి వాఁడను. చంపతరాయల నోటినుండి యాతనిజీవితకాలమున నెన్నఁడు

సత్యేతరపలుకేని వెలువడలేదని నాకు నిరూఢమగు విశ్వాసము గలదు. నీవంటిమిథ్యావాదినియే కాదు. సాక్షాదాకాశవాణియేని చంపతరాయ లసత్యవాది యని వచించినచో నేను విశ్వసింపఁజాలను. చంపతరాయలమాట యసత్య మని నేనెన్నఁడు నంగీకరింపఁజాలను. ఈసమయమున లలిత తానే వచ్చి చంపతరాయలు నాకన్యాత్వమును భంగపఱిచె నని వచించినను చంపతరాయలమాటపై నేనామెనుగూడ నమ్మఁజాలను. నామనసున నుండెడుసంశయము చంపతరాయలయంత్యవచనములతో నిర్మూలనమైపోయెను. ఇఁక నామనసున నాసందేహము గ్రిమ్మఱఁ బొడకొల్పుట కీశ్వరునికైనఁ దరముకాదు. హీరాదేవీ! ఇఁక నీవు చంపతరాయలవిషయమున మరల నామనసును గలుషితమొనర్ప వృథాయత్నము సలుపకుము. ఆలలితయాత్మహత్యకు సరియగు హేతువుచెప్పి శాంతముగ నీయొనర్చినయపరాధములకు శిక్షఁగొన సంసిద్ధవుగమ్ము.

హీరా—ఆవిషయమున నాకుఁ దెలిసినది నేను మొదటనే తెలియఁజేసితిని. మరలఁ జెప్పుచున్నాను. పదియాఱువత్సరములక్రిందట నీస్థలముననే లలిత తానాత్మహత్య గావించుకొన నిశ్చయించుకొంటినని నాతోఁ జెప్పినది. తత్కారణములఁగూడ నాతోఁ జెప్పివైచినది. అప్పుడుగూడ నింతరాత్రివేళయే. ఆకసమునఁ జంద్రుఁ డిట్లే వెలుఁగుచుండెను. బేత్వానదీజలమును దాఁకివచ్చెడిచల్లనిగాలి లలిత వ్యథితహృదయమును శాంతపఱుప యత్నించుచుండెను. దాని కన్నిటికిఁ బలికెడిశక్తి యుండినచో—హీరాదేవిమాట కల్లయో నిజమో చెప్పియుండును—కాని కొంచెమాఁగుఁడు—" హీరాదేవి తనతావు నుండి లేచి నిలువఁబడి తనగదియందలియొకప్రక్క కవాటమువంకఁ జూచుచు శాంతమై యిట్లనెను. "ఆత్మహత్య చేసికొనువారలకుసద్గతి

లభింపదని మీరెఱుఁగుదురుకదా! వారియాత్మ యాచంద్రార్కము వాస్థలముననే పిశాచరూపమున భ్రమ్మరుచుండును. ఇంతకన్న వారికి వేఱుగతియే లేదు. లలిత యదే మెట్టగుట్టపైనుండియే బేత్వానది యందుఱికి తనప్రాణముల వీడియుండెను."

శుభకరణుఁడు వాతాయనములోనుండి యాగుట్టవంకఁ జూడ నారంభించెను.

హీరాదేవి మెల్లమెల్లగఁ బాదము లెత్తుచు ముందునకుఁ బోవ జొచ్చెను. కొంచెముదూరము ముందునకుఁ బోయి యామె యిట్లనెను:—ఆమె ప్రాణత్యాగసమయమున నామెపదునైదేండ్లసుందరి. ఆమెముఖము చంద్రునివలె విలసిల్లుచుండెడిది. ఆమెనేత్రములఁ దారకాకాంతి వెలయుచుండెడిది. ఆమెకు ధవళవస్త్రములం దెక్కువమక్కువ. ఆమె జ్యోత్స్నాగర్భమున విహారము సల్పుచుండునెడ నీకారణముననే దూరమునుండియుఁ గనఁబడుచుండెడిది.

శుభకరణుఁడు బాగుగ దృష్టి లగ్నము చేసి యాపాతిగుట్టవం కకుఁ జూచుచుండెను.

హీరాదేవి మఱిరెండడుగు [illegible] జూపి యిట్లు పలుకఁజొచ్చెను.

"లలిత యాగుట్టపై [illegible] తెల్లచీరనే ధరించియుండెను. అప్పటినుండియు నామె ప్రేతమూర్తి యప్పు డప్పు డాగుట్టపైనే చంద్రికారాత్రియందిటునటుఁ దిరుగుచుండు నని వినుచున్నాను. మీరు కొంచెముసేపటివఱకు శ్రద్ధతో నటువంకనే చూచుచుండుఁడు. ఆమెకు నాసఖ్యసత్యములు కొంచెమేని జ్ఞప్తికి వచ్చినచో నామె యిపుడుఁగూడఁ దప్పక మన కగపడును. నాపక్షమునఁ దప్పక సాక్ష్యమిచ్చును."

ఆమెమాటలపై నమ్మక ముంచి శుభకరుఁడు మిక్కిలిశ్రద్ధతో నాగుట్టవంకకుఁ జూచు చుండెను. ఆగుట్టదెసకే ప్రీతితోఁ జూచుచు హీరాదేవి యిట్లనెను.

“ఇఁకఁ గొంచెముసేపటికే మీకు లలితప్రేమమూర్తి యటుఁ దిరుగుచుఁ గన్పడును. లలిత యాత్మహత్య యేల చేసికొనెనో మీరా రామెనే యడుగుఁడు. ఆమె మీకు యథార్థముగు హేతువుఁ దెల్పును.”

శుభకరుఁడాగుట్టవంకకే దృష్టి నిగిడ్చి చూచు చుండెను. అంతలోనే చూచుచునే యతఁడు హీరాదేవి నిట్లడిగెను. “నిజముగ నా మెప్రేమమూర్తి యచటఁ గన్పడునా! కన్పడిన నను నేనడిగిన ప్రశ్న కుత్తరమొసంగునా?”

అతనిని మాటలలోఁ బెట్టి యతనిధ్యానము నన్యాసక్తముఁ గావించి యతని పట్టునుండి పాఱిపోవఁజూచు చుండిన హీరాదేవికిఁ గొంతి యాదను లభించెను. ఆమెయటనుండి పాఱిపోఁజూచుచుండెను గాని యామెపదములు వచ్చుటలేదు. ఐనను జాలసాహసించి యామె మెల్లమెల్లగ నటనుండి వెనుకకు కదలిపోసాగెను. తుదకామె యాగృహమునుండి బయటఁ బడిపోయెను. శుభకరుఁ డానమయమునఁ హీరాదేవి యటనుండి వెడలిపోవుటకూడఁ దెలియకంతటి తదేకదృష్టి నాగుట్టఁ జూచుచుండెను. కొంచెముసేపున కతని కాగుట్టపైనే పది నేనుపన్నెండు సంవత్సరములబాలిక యొకర్తుక తెల్లనిచీరఁ గట్టుకొని యగపడెను. అది లలితప్రేమమూర్తియే యని యనుకొని ... మిక్కిలి యాతురతతో నిట్లనెను:— “లలితా! లలితా! నిజముగా మున నుంటివి! ఇప్పు డిచటికెట్లువచ్చితివి! నేను నిన్నొక్క మాటనే యడుగఁగోరుచున్నాను. నాకొక్క క్షణము నిలువుము. నే

ప్పుడే నీచెంతకు వచ్చుచున్నాను. నేనచ్చటకు వచ్చువఱకు నదృశ్యవు కాకుండుము."

అని పలికి శుభకరణుఁడు నదియందు దుమికెను. గృహమునుండి వెలువడి తిన్ననిదారినిబడి నదియొడ్డునఁ జేరుటకుఁగాని హీరాదేవివంకకుఁ జూచుటకుఁగాని యతనికి జ్ఞానములేకుండెను. అతఁడు వేగముగ నదీనీరమును భేదించుకొనుచుఁ దిన్నఁగ నాగుట్టదెసకుఁ బోవుచుండెను. అతనిదృష్టి యాప్రేతాత్మపైనే లగ్నమై యుండెను. అతఁడు ముందువకుఁ బోవుకొలంది మనసునందలియాతురత వర్ధిల్లుచుండెను. అతని కించుకభయముకూడఁ గల్గెను. ఆభయము ప్రేతమూర్తితో మాటాడవలసియుండెనని కాదు. ఆప్రేతమూర్తి యెచ్చట నదృశ్యమైపోవునో, దానిఁ గలిసికొను నవకాశము జాఱిపోవునేమోయని. బేతవానదీజలపటలమున నాకాశమండలము పూర్ణముగఁ బ్రతిబింబితమగుచుండెను. బేతవానది సర్వాలంకారయుక్తయై మందగమనమునఁ దనపతిఁ గలిసికొనఁబోవు నొకయభిసారికయో యన నొప్పుచుండెను. మాటిమాటికిఁ దీరవాయుస్పర్శముచేఁ దదభిసారికాముఖమున క్షణికలజ్జాతరంగములు లేచుచుండెను. ఆనాయికదెస వీక్షించుచు నొకపరమసుందరి ముగ్ధబాలిక ధవళవసనముల ధరించి వెన్నెలయందు నిలువఁబడి దరహాస మొనరించుచుండెను. బేతవాసుందరి యెవరో, యామె యెవరిఁ గలిసికొనఁబోవుచున్నదో యామెకుఁ దెలియును. బేతవాసుందరి సింగారముఁ గాంచుటయందు నిమగ్నయైన యాలతాంగికిఁ దనవంక కెవ్వరో వచ్చుచుండిరనుజాడకూడఁ దెలియలేదు. ఇంతలో నెవ్వరో వచ్చి తనహస్తముఁ బట్టుకొనుట యామె కనుభూతమయ్యెను. ఆమె యదరిపడి దృష్టి మఱల్చునరి కొకబలిష్ఠపురుషుఁడు తనహస్తముఁ బట్టుకొని దయార్ద్రముగఁ దనవంక వీక్షించుచుండుట

కొనవచ్చెను. ఇంతలో నాపురుషుఁ డామెతో నిట్లనెను:—"ఓశోభనప్రేతమూర్తీ! మొదట నాప్రశ్న కుత్తర మొసంగి పిదప నదృశ్యురమ్ము."

ఆబాలిక యతనివికృతవచనముఁ దెలిసికొనఁజాలకుండెను. మిక్కిలి కష్టముతోఁ దన్నుఁదాఁ గుదుటుపఱిచికొని యిట్లడిగెను:—"మీరెవరు! నన్నుఁ బ్రేతమూర్తి యని యేల యనియెదరు! మీరు నా కరము నేల గ్రహించితిరి! మీప్రశ్నమేమి!"

శుభ—(ప్రసన్నతతో) నేనొక్కటియే మెఱుఁగఁగోరుచున్నాను. నీవీప్రేతరూపము నెట్లు తాల్చితివి!

బాలి—మీకుఁ బిచ్చియెత్తలేదుకద! నేను ప్రేతరూపమున నుండుటెక్కడ! చక్కని మనుష్యరూపమున నుంటిని.

శుభ—నన్ను మోసగింపఁజాలవు. నీవు వనితవు కావు. నా మృతసోదరి యగులలితప్రేతమూర్తివి. నీవీస్థితి నెట్లు పొందితివో సరిగఁ జెప్పుము.

బాలి—బాగుగఁ దెలివిఁదెచ్చుకొని నన్నుఁజూడుఁడు. నేను ప్రేతను గాను. వనితను.

శుభ—నీవు వనితవైనచో నింతరాత్రివేళ నీనిర్జనస్థానమున నేల తిరుగుచుంటివి!

బాలి—ఈదేశమునకు వచ్చుటకు నాకిదియే మొదటిసారి. ఇచట నాకెవ్వరుఁ బరిచితులులేరు. నేను వాహ్యాళికై యిప్పుడిట వచ్చితిని.

శుభ—నీనివాసస్థల మేది.

బాలి—ఢిల్లీ.

శుభ—నీపేరేమి!

బాలి—(సాలోచనముగ) నన్ను బదరున్నీసా యందురు.

శుభ—(సాశ్చర్యముగ) బదరున్నీసా! నీవు మహమ్మదీయ కన్యవా!

బద—అవును.

శుభ—అట్లైన నీవు హిందూస్త్రీవేష మేల ధరించితివి!

బద—నాకిట్టివేషమే యిష్టము. తఱచుగ నీవేషమునే తాల్తును.

శుభ—నీవు ఢిల్లిలో నెచ్చట నుందువు! అచ్చటఁ బనియేమి!

బద—నేను ఢిల్లీసార్వభౌముఁ డగునౌరంగజీబు కొమరితను.

శుభ—(సాశ్చర్యముగ) నీవు సార్వభౌమునికుమారివా! మఱి నీకిచ్చట నేమిపని!

బద—నేను సాగరరాజ్యాధిపతు లగుశుభకరణులపుత్రరత్న ముగు దలపతిరాయల యన్వేషణమున నిట కేతెంచితిని. మీరు [illegible] నాకాతనిజాడఁ దెలియఁజేసెదరా!

శుభ—సాగరరాజ్యాధిపతి యగుశుభకరణుఁడను నేనే. దల పతిరాయలు నాపుత్రుఁడే. కాని యిప్పు డతఁ డెచ్చటనున్నాఁడో నాకుఁ దెలియదు. చంపతరాయలు బుందేలఖండస్వాతంత్ర్యమునకై యారంభించినయత్నము సఫలము కాదయ్యె. చంపతరాయలు హతుఁ డయ్యెను. అతనియనుచరులు వర్తమానమున నడవుల నజ్ఞాతవాసము సలుపుచున్నారు. వారితోడనే దలపతియు నుండును.''

బదరున్నీసాముఖము వాడిపోయెను. ఆమె మిగుల దుఃఖితమై యిట్లడిగెను:—బుందేలఖండస్వాతంత్ర్యయత్నము సఫలము కాలేదా! నా కెప్పిధమునను దలపతిరాయలజాడ లభించుట సాధ్యము కాదా!

బదరున్నీసా యడిగినరెండుప్రశ్నల కుత్తరముగ శంఖకరణుఁడు “ కాదు ” అని పలికి క్రమ్మఱ హీరాదేవిప్రాసాదమువంకఁ జోయెను. మందిరమున హీరాదేవికై యెంతవెదకిన నామె యగపడలేదు. హీరాదేవి తన్నసత్యమున వంచించెనని యాతనిక్రోధము మించెను. హీరాదేవి పూర్తిగ నసత్యవాదిని యని యతఁడు తెలిసికొనెను. కాన నామెను దండింపవలయు ననుతనయుద్దేశము నాతఁ డింకను దృఢపఱచికొనెను. అవల నతనికిఁ దనకుమారుఁడు దలపతిరాయలు నాతని వెనకు బదరున్నీసాయు స్మరణకు వచ్చిరి. కొలఁదిసేపటికి వెనుకఁ దాను బదరున్నీసాను గలిసికొనినతావున కతఁడు త్వరితముగ నేగెను. కాని బదరున్నీసా యచట లేకుండెను. ఆతఁడు మిగుల ఖిన్నుఁడై యెదుటి నిబిడారణ్యమునఁ జొచ్చి యదృశ్యుఁ డయ్యెను.





## ఇరువదవపరిచ్ఛేదము.

### నూతనవిపత్కారణము.

ఓర్చానగరనివాసులు నేఁడు వివిధవితర్కముల నొనర్చుచు సభాభవనముదెస భయదృష్టులఁ బఱపుచుండిరి. తమయారణ్యకస్వాతంత్ర్యమునకు విఘ్నమాపాదించు సింగంపుగుహదెసకు వనమృగము లెట్టిభయతిరస్కారపూర్ణములగు దృష్టులఁ బఱపునో యట్టిదృష్టులనే యోర్చానివాసులు వీరసింహదేవనిర్మిత మగు నాసభామందిరపుదెసకుఁ బఱపుచుండిరి. ఎల్లరు నేదియో యొకవిధముగ శీఘ్రకాలముననేదియో యొకనూతనవిపత్తు రానున్నదని చెప్పుకొనుచుండిరి. వీరసింహుఁడామందిరమును నిర్మింపఁజేసి యందు యువరాజగుసలీముతో సమావేశ మొనరించెను. తరువాతఁ గొలఁదిదినములకే యోర్చా స్వాతంత్ర్యముం గోల్పోయెను. పర్వతసింహుఁ డాసభామందిరముననే షహజహాన్ చక్రవర్తి కాతిథ్య మొసంగెను. అటుపైఁ గొలఁదిదినములకే పర్వతసింహునకు రాజ్యమును వీడి యడవులకు వెడలవలసివచ్చెను. తరువాత హీరాదేవి యాసభామందిరముఁ దెఱపించి యందు బుందేల భూపతులసభ నొడఁగూర్చెను. తత్సభానంతరముననే తత్క్షణమే పర్వతసింహునిమరణము, భయంకరమగునన్యోన్యయుద్ధము, నిరర్థకమగువేలకొలఁదిజనులనాశనము, ఓర్చారాజ్యము వివిధవిపన్మగ్న మగుటయు సంభవించెను. ఈరీతిన నాసభామందిరచరిత్రము విపద్భరితమై యుండెను. అది తెఱవఁబడినప్పుడెల్ల తమపై నేదియో యొక మహాపద వచ్చి పడనున్నదని యోర్చానివాసు లెంచుచుండెడివారు.

సమావేశసభాభవనపుటలంకరణమును, శోభను గాంచిన నేఁ

మా పురజనఁ బ్రజలలో వివిధవితర్కము లుదయించెను. ఏనఁ దమ కేమియో మహాసంకటము సంభవింపనున్నదనియే యెల్లరివితర్కముల యందలిముఖ్యాభిప్రాయమై యుండెను. ఒకతార్కికశేఖరుఁ డనేక సామంతులఁ గూడి యౌరంగజేబు ఓర్చాచు తానున్నాఁడనియు నిది యంతయు వతనిస్వాగతప్రయత్నమనియు వచించెను. మఱియొక తార్కికశిరోమణి యూరక ప్రజలకుఁ బాదుషారాకను గూర్చి యెఱిఁగిం గింప మొదలిడెను. వారినిఁ జూచి మూఁడవనైయాయికరత్నము ఊర కుండఁజాలకపోయెను. అతఁడు మొదట నగ్నినుండి ధూమోత్పత్తి యగుననుపూర్వసిద్ధాంతము బోధించి యటుపై నిశ్చయముగ సభా మందిరపువెలుంగునుండి ధూమోత్పత్తి యగుననియు నీవెలుం గౌరం గజేబుకు నిమిత్తముగ నొనర్చి మోతాచ్ఛనగరముం గాల్చి భస్మీకృత మొనర్చివైచు ననియుఁ జెప్పెను. రాజ్యాధికారులు రాజ్యముపై నూతనవిపత్తు రానున్నదనియు, వ్యాపారము వ్యాపారులతో విపన్మగ్నమగు ననియు, నీరీతి నెల్లరు భీతులై యాపద్విషయమున బహువిధములగు మాటలాడఁజొచ్చిరి. బాగుగ నలంకరించుకొని యుత్తమములగు వస్త్రముల ధరియించి కంచుకిరాయలు మిగుల గరువమునఁ బ్రజలనీక్షించుచు ననేకులగునరదారులతోఁ గూడి సభాభవనపుదెస కరుగుచుండెను. వయసుతోఁబాటు జ్ఞానముగూడఁ బెరుఁగుచుండు నని తలఁచుచుండినయొకవృద్ధసజ్జనుఁడు కంచుకిరాయలఁ గాంచి డగ్గఱి వినయపూర్వక మగునమస్కార మాచరించి యిట్లనియె:—"మహారాజా! ఔరంగజేబుచక్రవర్తికి మానవులయుష్ణరక్తమునఁ దానమాడ మిగుల నిచ్ఛ కలదనియు నందుచే బుందేలుల గానుగలో వైచి పిండించి తద్రక్తము తీయఁబడుననియు వింటిని. ఈమాట నిజమే యగునా?"

కంచుకిరాయ లీప్రశ్న కెట్టిసమాధానము నొసంగలేదు. తిర

సత్కారపూర్ణమగుదృష్టి నాతనిపైఁ బఱపి ముందునకు సాగిపోయెను.

అతఁడు నాలుగడుగులైన నిడకమున్నె యొకవృద్ధవిధవ యాతనిఁ గలిసికొని బహువిచారమున నిట్లడిగెను. "రేపు పాదుషాజ్ఞానతిచేఁ బ్రజలకంఠములు నఱకఁబడునని వింటిని. నాయట్టివిధవలగు ముదుసండ్రకైన రక్షణ ముండదా?

కంచుకిరాయ లాముదుసలిప్రశ్నకుఁ గూడ నేప్రత్యుత్తరము నొసంగలేదు. అతఁడు మీసముల దువ్వుచు ముందునకు సాగెను. కొలఁదిదూరమున నతనికి దేవీభక్తులు కాన్పించిరి. వారందఱు రాజును జుట్టి యిట్లనఁగసాగిరి. "రేపు పాదుషావారు బుందేలులెల్లరు నాడెదు గడ్డముల నుంచుకోఁదగునని శాసింతురఁట. ఇంక మాతృభక్తులకుఁ గూడ గడ్డముల నుంచుకొననగునా !"

కంచుకిరాయ లధికకష్టమున నాసమూహమధ్యమునుండి వెడలి ముందునకేగెను. ఇంతలో లోభియగునొకవైశ్యుఁ డతని నాఁపియిట్లడిగెను:—"ఇంక యవనులపద్ధతి ననుసరించి యుపనయనములు జరుగునని వింటిని. నేను పూర్వవిధానమున స్వధనవ్యయముతోఁ గుఱ్ఱవాని కుపనయనముఁ గావింతునా! లేక యిఁకముందు పాదుషాపక్షమున నుపనయనము కావింపఁబడునా!"

కంచుకిరాయ లీప్రశ్నమునకుఁగూడ నెట్టిప్రత్యుత్తరము నొసంగలేదు. అతఁడు నాల్గడుగులైన నిడకమున్నే విద్యావంతుఁ డగునొకఁ డతనిఁ గలిసికొనెను. అతఁడు రాజును నిలిపి యిట్లు నుడువసాగెను:—"అన్నిరాజకార్యాలయములలో ఫార్సీ యుపయోగింపఁబడునఁట. ఫార్సీ యపసవ్యముగ వ్రాయఁబడునని మేమెఱుంగుదుము. కాని యావ్రాఁతలో సిరాబుడ్డి తిన్నఁగ నుంపఁబడునో తలక్రిందుగ నుంపఁబడునో, కలము తిన్నఁగఁ బట్టుకొనఁబడునో లేక తలక్రిందుగనో,

యక్షరముల తీక్ష్ణఁగ వ్రాయనగునో తలక్రిందుగనో తెలియుట లేదు. దేవర వా రీవిషయము నెఱింగించిన నెంతయు ననుగ్రహింపఁబడుదును.”

ఇట్టియనేకప్రశ్నములు వినుచు వినుచుఁ గంచుకిరాయలు మిగుల వ్యాకుల మందెను. సాధ్యమైనంతశీఘ్రముగ నడుగిడుచు నతఁడు సభామందిరద్వారముఁ జేరెను. అచటి కేగినపై నభీష్టసిద్ధి యగుటకింకను నాలస్యము పట్టుననియుఁ గొలఁదిసేపు తానచ్చటనే నిలువవలసియుండుననియు నెఱిఁగి యతఁడు మిగులఁజింతించెను.

రాజసభాభవనము నేఁడు బాగుగ నలంకరింపఁబడి యుండెను. దాని నెల్లెడల నుత్తమములగునైనపువస్తువులు తమసుగంధౌజ్జ్వల్యముల నలుగడల నల్లుకొనఁజేయుచుఁ బ్రకాశించుచుండెను. ఈ కాంతి యట నొక్కచోఁ గూరుచుండియున్న యొకయువకునిచి[illegible]నవ్వుము య్యుఁ బ్రసన్నమగువదనముపైఁ బడుచుండెను. ఆయువకుని మొగమున నౌరంగజీబుమొగమందలి గాంభీర్యము గాని ప్రౌఢతగాని లేవు. అతని మానసికచాంచల్యము నహంభావము మున్నగు వానిఁ గాంచిన యొకసాధారణమానవుఁడుగూడ సభాభవనమున నేఁడౌరంగజీబుసభ జరుగునని తలంచునోర్ఛానివాసులు పొరపడుచున్నారని యెఱుఁగఁగలఁడు.

బుందేలఖండమునం దంతటఁ దనయధికారము స్థాపించి బుందేలులదాస్యశృంఖలముల దృఢపఱచి యలంఘీరు ఢిల్లీకి మఱలిపోయెను. బుందేలఖండసత్త్వము నతఁడు హరించెను. ఇట్టియవస్థలో నతనికి బుందేలఖండమున నుండనావశ్యకత యేముండును! ఆసమయమున నతఁడు దేశాంతరాక్రమణచింతానిమగ్నుఁడై యుండనోపు. భాగ్యవంతులెల్లి భుజించినపైఁ దముచిత్తమునకై వెంగయు బిచ్చ

గాండ్రపగిది, మృగపతిచే వేఁటాడఁబడినదానియంవలె యెమ్మలఁ గొ ఱుకనేతెంచు శశశకముల భంగి, నిస్సత్త్వంబుం దేలకళేబరములఁ గొల్ల గొట్టెపి యీయాయువకుఁ డలంఘ్యదునిప్రియశక్తుఁడై యుండవచ్చును. భిన్నభిన్నమనోవికారరంజిత మగునాతనివదనము స్వాభావికస్థితిఁ జెం దిన నీవిషయము సుజ్ఞేయ మగును.

చింతామయమగునాయవస్థలోఁ జాలసేపు భావిసుఖరాజ్యమున మనోవిహార మొనరించినపై నాయువకుని కేదో హఠాత్తుగ జ్ఞప్తికి వచ్చినట్లయ్యెను. ఇప్పటివఱకు నాతనివదనము కాల్పనికవిలాసచ్ఛాయా చ్ఛాదితమై యుండెను. అతఁడు కల్పితాధికారమదాంధుఁడై యుం డెను. కాని యిప్పు డాతనిముఖము స్వాభావికరూపముఁ దాల్చెను. ఇఁకఁ దెలిసినది. అతఁడు మనపూర్వపరిచితుఁ డగుసరదార్ రణదుల ఖానుఁడు.

రణదులఖాను గద్దియపైఁ గూరుచుండి తనసుఖాధికార ములఁ దలఁచికొని మొదలు మఱచుచుండెను. సమర్కండులోనివీధు లలోఁ దాను భైక్షుక దురవస్థలోఁ గాలముఁ బుచ్చినతనపూర్వావస్థ యాతనిస్మరణకు వచ్చెను. అటుపై నుచ్చాశ లాతనిఁ బిచ్చవానిఁగఁ జేసివైచెను. స్వదేశవైభవముపై నధికారము వహింప నతఁ డెంత యు నసమర్థుఁడై యుంటచే విజితదేశముఁ జేరి స్వజాతిసోదరులసా యమున నతఁడు స్వభాగ్యపరీక్ష నొనరింపనెంచెను. ఢిల్లీనిఁ జేరుమా ర్గమున నెలలకొలఁది దాననుభవించినదుర్దశ యతనిస్మరణకు వచ్చెను. ఢిల్లీనిఁ జేరినపైఁ దనయదృష్ట మెట్లు విపర్యస్త మయ్యెనో, జోగియ గుతా నెట్లు భోగియయ్యెనో, కొలఁదిదినములకుఁ బూర్వమే సమ ర్కండుపౌరులయెదుటఁ జేతులఁ జాచిన బిచ్చగాఁడు ఎంతశీఘ్రముగ [illegible]

ములు నందఁజొచ్చెనో, మున్నగువిషయముల స్మరించి, యతఁడు తన్నుఁదానే ధన్యుఁడనని యెంచుచుండెను. కొలఁదిసేపటిలో స్వాభావికస్వరూపమునఁ గన్పట్టు నాతనిముఖము, విశిష్టవికారాచ్ఛాదితము గాఁజొచ్చెను. వైభవశిఖరారోహణమునఁ దన్నొకవిధముగా ఘోరావమాన మొనర్చిన చంపతరాయచ్ఛత్రసాలుల కెట్లు తాను వ్యాజపూరితముగఁ బ్రతీకార మొనర్చెనో, యౌరంగజేబు నెట్లు తనయెడఁ బ్రసన్నునిఁ గావించుకొనెనో, తుదకు స్వబుద్ధిచేఁ దానింతటి శౌర్యపౌరుషవంతమగు కార్య మొనరించెనో — సమస్తవిషయముల స్మరించుకొనుచు — నొక్కటొక్కటిగ వైభవాద్రిశిఖరముల దర్శించుచు — జింతామగ్నుఁడగు రణదుల్లాఖాను వైభవాద్రికూటముఁ జేరెను. అతఁడు తనయూహాసమయమున రచించిన యుచ్చాశాచిత్రమునఁ దాను బుందేలఖండమందలి యొకపౌరుషహీనుఁ డగుభూపతిని బదభ్రష్టు నొనరించి తత్సింహాసనముపై నధికారపూర్వకముగఁ గూర్చుండి యున్నట్లు, బుందేలఖండమందలి మాండలికనరపతులెల్ల రవనతశిరస్కులై సవినయులై, తనయెదుట నిలువఁబడి తనవదనము నీక్షించుచున్నట్లును, నతఁడు చూచుచుండెను. వారిలోనివాఁడే యగునాపదభ్రష్టుఁడగు నరపతి కూడ మాటాడక నిలువఁబడి యొకసామాన్యపదవి నంది ప్రసన్నుఁడై యున్నాఁడు. ఈరీతిగ బుందేలఖండమందలి దృశ్యాదృశ్యములు, సజీవనిర్జీవములు నగుసమస్తసంపదలుఁ దనవశమయ్యెను. తనయిచ్చవచ్చినట్లు వానినిఁ దాననుభవించుచుండెను.” అని యిట్లతఁడు భావించుచుండెను. ఇంతలో నాతనికిఁ గంచుకిరాయలు స్మరణకురా, నింతదనుక నాతఁడు సభకు రాకుండుటకై యాశ్చర్యము జనించెను. ప్రశ్నింపఁ, గంచుకిరాయలు చాలసేపటినుండియుఁ గ్రిందికి వచ్చియుండెననియు, సభామందిరప్రవేశమునకై యనుమతి వేడు

చుండెననియుఁ దెలియవచ్చెను. ఎద్దియేని జంతువు తనవలఁ దగు లోఁ నినమ్మగయుని కెంతటియానందము కలుగునో యప్పు డాతని కట్టియానందము కలిగెను.

రణమలహాఖానుఁడు తనరాకఁ గోరినాఁడనుమాట వినఁగనే యతఁ డత్యంతశీఘ్రగమనమున ఖానుఁడున్న పెద్దగదిలోని కేగి సవిన యముగ వంగి నమస్కార మాచరించి యొకమూల నిలువఁబడెను. ఖానుఁ డతనిఁ దనసమీపమునఁ గూర్చుండ సంజ్ఞ యొనరించినంతనే యతఁడు క్రమపూర్వకముగ జరిగి యచ్చోటికి బోయి కూర్చుండి యిట్లనెను.

" దేవరవా రీసమయమున నన్నుఁ బిలిపించుట మహద్భాగ్య మని యెంచుచున్నాను. ఆజ్ఞాపింపుఁడు."

రణ—రాజా! నేనీసమయమున నత్యంతావశ్యకమగు నొకవి షయమున సమాలోచన మొనరింప మిమ్ముఁ బిలిపించితిని. మీరు ఢిల్లీసామ్రాజ్యమున కత్యంతక్షేమకాంక్షులును, బుద్ధిమంతులు నగు భూపతులు. నాకు మీయభిప్రాయ మెనఁగుటయే కాక నాయాశ యసిద్ధికై నాయపడెదరనికూడ నేను విశ్వసించుచున్నాను.

కంచు—తప్పకుండ సర్వవిధములఁ దమయాజ్ఞాపాలనమునకై నేను సంసిద్ధుఁడనై యున్నాను. తమరు నా రాజ్యమునంతను—ప్రా ణమునైన గోరినను—నొసంగుటకు నాకెట్టిసంశయము నుండదు.

రణ—రాజా! చాలును. నాకు మీపై సంపూర్ణవిశ్వాసము కలదు. కాఁబట్టియే యీసమయమున మిమ్ముఁ బిలిపించితిని. ఇప్పుడు నేను నాయభిప్రాయ మెఱింగించెదను. సావధానులై వినుఁడు.

కంచు—అఁ. ఆజ్ఞాపింపుఁడు. నామనసంతయుఁ దమపక్షము ననే యున్నది.

రణ—మొట్టమొదటివిషయ మిది. మీకొమర్తెమూలమున నేను తీవ్రములగు ఖేదవైకల్యములకు లోనై నెలలఁకొలఁదిగఁ జంపతరాయని చెఱయందుఁ బడియుండనయ్యెను. నేనామెకు న్యాయసమ్మతమగుశిక్ష యెద్దియేని విధింపఁదలఁచుచున్నాను. మీరు నాయభిప్రాయము నెంతవఱ కామోదింతురు!

కంచు—మహాశయా! నేనేమని మొఱవెట్టుకొందును! స్వయముగ నేనే యామెమూలమున వికలుఁడనై యున్నాను. ఆమె ఢిల్లీసామ్రాజ్యమునకుఁ దచ్ఛత్రకాంక్షులకుఁ బ్రాణశత్రువు. దేవరవారామెకై యెట్టిదండనము నిర్ణయింతురో నేను వినవచ్చునా?

*రణ—ఆఁ. ఆఁ. శ్రద్ధతో వినుఁడు. ఈవిషయమునకే మిమ్ముఁ బిలిపించితిని. ఆమెను వెంటనే రాజ్యమునుండి తఱిమివేయనగును. లేకున్న నామెకు మీరాజ్యముపై నెట్టియధికారము. లేకుండునట్లామెను ధనహీనుఁడగునెవనికో యొకనికి నొసఁగి వివాహ మొనరించి పరిత్యజింపనగును. ఇట్లనియే నేనెంచుచున్నాను. ఇంతటిగొప్పరాజ్యమున కధికారిణి కాఁదగినయోగ్యత యప్రతిష్ఠాకారిణి యగునామెకు లేదు.

కంచు—మీయీపరిష్కార మత్యంతోత్తమము, యోగ్యము, నేను జిరకాలమునుండియు నామెకై యిట్టిదే యగునేర్పాటు నాలోచించుచుంటిని. చిరకాలమునుండియు, నారాజ్యమును ఢిల్లీసార్వభౌమునకి సమర్పించు నుద్దేశముగూడ నాకుఁ గలదు. నాకు కుమారుఁడు లేనేలేఁడు. ఇట్టియయోగ్యయగుకొమర్తె నాయుత్తరాధికారిణిగా నుంపఁగోరను.

రణ—రాజా! మీసామర్థ్యము నెంతని పొగడవచ్చును! నేను గూడ మీయీయభిప్రాయమును సంపూర్ణముగ నామోదించుచు

న్నాను. కాని మీయభిప్రాయమును గొలఁదిగ విపర్యస్త మొనరించిన శ్రేష్ఠతరముగ నుండునని నాయభిప్రాయము.

కంచు—చిత్తము. ఆజ్ఞాపింపుఁడు. నేనన్నివిధముల సంసిద్ధుఁడనై యున్నాను. నాకెందును బాధలేదు.

రణ—హిందూమహారాష్ట్రీయులపొందుఁ జెంప నీసమయమున నెట్టిమహాప్రయత్నము లావశ్యకములై యున్నవో, మీరెఱుంగుదురు. హిందుస్థానమందలి భిన్నభిన్నదేశములలో మునల్మానుల రాజ్యములు కొన్ని స్థిరపడునేని, దనుజ్మాలమునను, రెండుజాతుల యేకీభావవక్షపమునను, ని[illegible]ముకెపం [illegible]స్థాపించుటయం దధికమగు సాయము లభింపఁగలదని, పాదుషావారియభిప్రాయము. ఈసమయమున సామాన్యముగ హైందవరాజ్యము లన్నియు ఢిల్లీసామ్రాజ్యమునకు సామంతములే యైయున్నవి. హిందూస్థాన మంతయు మరాఠమువనే యున్నది. కానఁ గొన్నిచిన్నచిన్న రాజ్యములుగూడ ఢిల్లీరాజసభయందలి యుత్తములగుసర్దారులనశమైన భవిష్యత్కాలమున సొస్థనవిశ్వాసముల కవకాశము లభించును. ఈయభిప్రాయముతో డనే పాదుషావారు తమసర్దారులకు గొప్పగొప్పరాజ్యముల నొసంగి వారిని రాజులుగ నొనర్పఁ గోరుచున్నారు. భగవంతునియనుగ్రహమున నిప్పుడు బుందేలఖండముపై మునల్మానులకు సంపూర్ణమగు నధికారము లభించినది. ఈతరుణమున నిచ్చట నొకయవనరాజ్యము స్థాపింపఁజేయుట యుక్తమని తోఁచుచున్నది. మీరు మీరాజ్యమును బాదుషావారి కర్పించిన వారు దానిని నాకే యొసంగెదరని నేను నమ్ముచున్నాను. ఏల యన, ఛాంఢోనునందును, తన్నమీపస్థలమును లగుస్థలములను, నాకెట్టివాంఛ యున్నదో వారెఱుంగుదురు. కాని యందు మీకేగతియైన నాలసింపవలసివచ్చును. ఇట్టిస్థితిలో మీరు

స్వీయముగనే మీరాజ్యములలోఁ గొంతభాగమును నాకొసంగినఁ బరియంతయు ముగియు ననియు, మన మిరువురముఁ గలిసి ఢిల్లీసామ్రాజ్యమునకు మహత్సేవల జేయఁగలమనియు నాయభిప్రాయము. కొమరితెను మీరెట్లైనఁ బరిత్యజింతురు. ఇఁక మీరాజ్యమున నుత్తరాధికారు లెవరును లేనేలేరు. మీరు జీవించియున్నంతకాలము—మీరు చిరకాలము జీవించియుండునట్లు భగవంతుఁ డనుగ్రహించుఁగాక—మీరు నిరాతంకముగ రాజ్యాధికారులై యుండుఁడు. నానివాసమునకొకసామాన్యగృహము చాలును. తరువాత మీయిష్టమువచ్చినట్లు-అల్లే—"

రణమల్లఖానుఁ "జల్లే" యని యూరకుండెను. ముందేమి చెప్పవలెనో యతనిమనసునఁ దట్టలేదు. కంచుకినాయకులు ప్రథమమునందే తనరాజ్యమే యంతయు ఢిల్లీసార్వభౌముని కప్పగించుకొఱకఁ బ్రకటించినను, రణమల్లఖానుప్రస్తావ మాతనిఁ గొలఁదిగఁ జింతితునిఁ జేసివైచెను. రణమల్లఖానును బ్రసన్నునిఁ జేసికొనుటకుమాత్రమే ప్రకటింపఁబడినతనయిచ్ఛ నెఱవేర్చుటకై తనపై నింతటినిర్బంధము వచ్చుటఁ గాంచి కుమారుఁడు మనసునఁ గొంచెముగఁ జింతించెను. కాని యీసమయమున ఖానునియిచ్ఛకు విరుద్ధముగ నేమైనఁ జెప్పుటకుఁగూడ నతనికి సాహసము లేకుండెను. అతఁడు మహాసంశయమునఁ బడెను. మిగులఁ గష్టముతో వ్యాకులత నడఁచుకొని యతఁడిట్లనియె—"చాల బాగుగ నున్నది. నేనేవిషయమునను జెప్పఁదగినదేమియు లేదు. ఘాంఘేరమును జేరఁగనే యీవిషయమును నామంత్రులతో నాలోచించి వెంటనే తమకుఁ దెలియఁజేసెదను."

అటుపైఁ గొంచెముసేపటివఱకు వివిధప్రసంగములు జఱుగుచుండెను. "నాకోరిక నెఱవేరెను. మంచిస్నేహమే చేఁజిక్కినది."

అని యెంచి ఖానుఁడు మిగులఁ బ్రసన్నుఁ డయ్యె. "ఇప్పటికిఁ బీడ వదల్చుకొన్నఁ జాలు. అటుపై నేమగునదియుఁ జూడవచ్చును." అని యెంచి కంచుకిరాయలు కొలఁదిసేపటిలో ఖానునియనుమతిఁ బొంది తనదారిఁ బట్టెను. మార్గమున నతఁడు "ప్రాణములు దక్కె- నదియ పదివేలు" లని యెంచుచుఁ బోవుచుండెను.

---

## ఇరువదియొకటవ ప్రకరణము

### జయసింహుఁడు—ఛత్రసాలుఁడు

నిజమగువిజయలాభానందము సమరరంగమున నాత్మపరాక్రమ ప్రదర్శనమున విజయు లగువారికిమాత్రమే తెలియును. అన్యులు దాని నూహింపనైనఁ జాలరు. దేవగఢదుర్గమును జయించి చక్రవర్తి సైన్యము విజయోత్సవకలన మగ్నమై యుండెను. సైన్యమున నెల్లెడల గానవాద్యములు జరుగుచుండెను. యవనసైనికులు కొన్నిచోటుల మద్యపానమత్తులై పడి యుండిరి. మఱికొన్నిచోటుల ననేకవిధముల నల్లరులఁ జేయుచుండిరి. వారికాళ్లు లాసమయమున భూమిపై నానుటలేదు. వారిమస్తకములు సప్తమాకాశమున నుండెను. క్షణక్షణమును "తానారీరి" "కిటకిటతాంయ్ తాంయ్" లనై "వహవ్వా వహవ్వా" లయు "సుభాన్ అల్లా" లయు వర్షము కురియుచుండెను. సైన్యములోని చిన్నపెద్దలెల్లరు నానందమగ్నులై యుండిరి.

నగమురాతిరి కడచిపోయెను. చంద్రుఁడు క్రమక్రమముగ గగనమధ్యమును జేరెను. జగత్తు నిద్రాదేవతారాధన మొనరించుచుండెను. దేవగఢమునకు నలువైపుల గుడారముల నేర్పఱచికొనియున్న యవనసైనికుల విజయోత్సవము నూతనచ్ఛాయఁ గొల్పుచుండెను. జయసింహుఁడొంటెరౌతులచే విజయవార్త ఢిల్లీకిఁ బంపి సావకాశముగఁ దనశిబిరమునుండి బయల్వెడలి మనోహరచంద్రికం దిరుగుచుండెను. "విజయలాభవృత్తాంతము విని పాదుషావారు మిగులఁ బ్రీతిగలవారై సంతుష్టు లగుదురు. ఇంతటి సులభమగుదేవగఢయుద్ధవిజయము విని నాపై నపారమగుకృప వహింతురు. వారు నాయెడ నత్యంతకృతజ్ఞులై యుందురు." అని యీమొదలగువాలోచనములు శూరుఁడు రాజభక్తుఁడు నగునారాజపుత్రునిమనసున నుత్పన్నము లగుచుండెను. అతనివదనమున వాస్తవికవిజయానంద మొలుకుచుండెను. అతఁడు తననలుదెసలఁ జూచెను. సైనికులు, నాయకులు స్వేచ్ఛాయోగ్యతల ననుసరించి వివిధానందమగ్నులై యుండుటఁ గాంచి యతఁడు మిగుల సంతసించెను. ఇంతలో నెవనియసమానపరాక్రమకారణమున దేవగఢవిజయము లభించెనో యాఛత్రసాలకుమారుఁడు స్మరణకు వచ్చినంతనే యాతనిహృదయము ప్రేమాంకితమై కంపితమయ్యెను. చంపతరాయలమరణానంతరమున ఢిల్లీచక్రవర్తి మహీంద్రరాజ్యమును వశపఱచుకొన్ననాఁటినుండియు నశరణుఁడగుఛత్రసాలుఁడు జయసింహునియొద్దనే నివసించుచుండెను. జయసింహుఁడుగూడ నతనిని దనపుత్రునిబలెఁ బ్రేమించుచుండెను. కావుననే యాయదనున నాతనిహృదయము తనయానురాగవిహ్వలమై యుండెను. శౌర్యాధిక్యమున నింతదనుక ఛత్రసాలకుమారునియతులశౌర్యమునుఁ బ్రశంసించుటకుఁగాని, యతనియెడఁ గృతజ్ఞతఁ బ్రకటించుటకుఁగాని యాతని

కవకాశము గలుగకుండెను. ఇప్పు డవకాశముఁ బొంది యశేఁషం మెల్లమెల్లగ ఛత్రిసాలునిశిబిరముదెస కరుగుచుండెను. నేఁటిఛత్రిసాలునిపరాక్రిమముచేఁ బాదుషావారు సంతుష్టులై యతనిపైతృకరాజ్యము నతని కిచ్చివేయుదని యతఁడు మార్గమునఁ దలఁచుచుఁ బోవుచుండెను. ఈభావన మతనికి మహానందదాయక మై యుండెను.

అతఁడు ఛత్రసాలకుమారునిపటకుటీరముఁ జేరినంతనే తత్సమీపమున వెన్నెలలో నొకయువకుఁడు అరుగుపైఁ గూరుచుండి విచారమగ్నుఁడై యాలోచనాధీనుఁడై యుండుట కానవచ్చెను. కొలఁదిసేపాఁగి యువకునిదెసఁ జూచి జయసింహుఁ డిట్లడిగెను:—

« ఎవరు! ఛత్రిసాలకుమారుఁడా? ఏమివిచారమున మునిఁగి యున్నావు? »

కాని యతనిప్రశ్న కెట్టిప్రత్యుత్తరము రాలేదు. ఛత్రిసాలుని భుజములపైఁ జేయివైచి యతఁ డాశ్చర్యానురాగముల నిట్లడిగెను:-

కుమారా! నీవేమాలోచించుచున్నావు? నీయీవిచారమునకుఁ గతమేమి? నేఁడు నీముఖమున విజయానందచ్ఛాయ కన్పట్టవలసియుండెను. నీవింతటినిరాశావిచారములకు లోనుగానేల? నీశౌర్యపరాక్రిమములమూలముననే నేఁడు చక్రివర్తిసైన్యముల కీయానందానుభవభాగ్యము లభించినది. కాని నీవు స్వయముగ నింతటిఖిన్నుఁడవై యుండుట యాశ్చర్యకరమై యున్నది.

ఛత్రిసాలునివిచారాలస్యము భగ్నమైపోయెను. అతఁడు శీఘ్రముగ లేచి నిలువఁబడి వినయవినమితశిరస్కుఁడై యిట్లనియె:—

« ఆర్యా! ఇది తమనిశ్రాంతిసమయమై యుండ నిచటికి రా వేల శ్రమఁ జెందితిరి! ఆజ్ఞాపింపుఁడు. తమకీసమయమున నే నెట్టిసేవ నొనర్పఁగుదు? »

ఛత్రసాలుఁడు స్వవిచారమగ్నుఁడై యుండి తనమాటల విన లేదని యెఱింగి జయసింహుఁడు మరల నిట్లనియె. "కుమారా! నేఁడు నీకు లభించినవిజయమునకై నీవేల యానందించుట లేదు? నేఁటి నీశౌర్యమును బ్రశంసింప నిటకువచ్చితిని. కాని నీమానసికావస్థ కేవలవిపరీతముగఁ గన్పట్టుచున్నది. నేఁటివిజయలాభానంద మించుకయైన నీకుఁ గలుగుట లేదా!

ఛత్ర—(శోకోద్రేకముగ) విజయము నందువా రొకరుఁ, దదానందము ననుభవించువారు మఱియొకరా! నేఁడు ఢిల్లీశ్వరునికి విజయము కల్గినదానికై నాకానంద మేల? నేను నాకర్తవ్యము నెంచి పోరాడితిని. దేవగఢము మున్నెట్లు పరాధీనమై యుండెనో యిప్పుడు నట్లే. దానిపై ఆదిల్‌షాయధికార మున్ననేమి! ఔరంగజీబధికార మున్ననేమి! శియాముసల్మానులపతాక యెగురుచున్న నేమి! సున్నీముసల్మానులకేతనము స్థాపింపఁబడిన నేమి! ఛత్రసాలునికి రెండును సమానములే. కాని నేఁటినుండి నేను భవదీయాశ్రయమున నుంటిని. మున్ముందు మదీయాశయసాఫల్యమున కత్యధికము గుతమసాయము నాశించి యుంటిని. కాన నేను మిమ్ముఁ బ్రసన్నుల నొనర్చుటకే హృదయపూర్వకముగఁ బోరాడితిని. దేవగఢదుర్గము జయింపఁబడినఁ దమరుప్రసన్నచిత్తు లగుదురని నేనెఱుంగుదును. కావుననే నేఁడు నేను నాకర్తవ్యముఁ బాలించితిని.

జయ—(చేతితో నెదుటఁ జూపుచు) నీసమీపమున నలుదైపులఁ గన్నులెత్తి చూడుము. అచ్చటివిజయోత్సవమగ్నులగుసైనికు లెల్లరు యవనులేనా! వారిలో సగముకన్న నధికులు హిందువులు. ఐన నేఁడు వారేల విజయోత్సవ మొనరించుకొనుచున్నారు! పాదుషాకు జయము వచ్చిన వారేల యానందించుచున్నారు!

ఛత్రి—ఇదిరోయే నాకునుదెలియుట లేదు. స్వీయపరాక్రమమునఁ బోరాడి స్వదేశమును స్వయముగ నౌరంగజేబునకు వశమొనర్చివా రానందింపనేల? అయ్యా! తమరు నన్నుఁగూడ నీయజ్ఞానుల శ్రేణిలోఁ జేర్పఁగోరుచున్నారా? ఈసైనికులయానందముఁ గాంచిన నాకు మఱింత దుఃఖము గలుగుచున్నది. వారియానందమే నావిచారమునకుఁ గారణము. నాయానందవిషయమే వారికి దుఃఖదాయకమగును. స్వదేశదౌర్భాగ్యమును దమరు దీనిచే బాగుగ నెఱుంగఁగలరు.

జయ—స్వాతంత్ర్యభావము చంపతరాయమహారాజుతోడనే నశించిపోయిన దని నేనెంచితిని. కాని నీవుగూడ నావర్ణమునకే రంజితుఁడవై యుంటి వనియిప్పు డెఱిఁగితిని. కుమారా! ఎట్లైన నీతండ్రి దుర్దశనుగాంచియైన నీనేత్రములు తెఱచుకొనవలసియుండెను. బుందేలఖండమండలిభయంకరరక్తపాతముఁ గాంచియైన మాదేశకల్యాణమార్గము భ్రమాపూర్ణమని నీవెఱుఁగవలసినది. ఇంకను బుందేలఖండపుదుర్దినము లంతమంద లేదని తోఁచుచున్నది. ఛత్రసాలా! నిర్జలమేఘము లెన్నటికిని వర్షింపవు. అవి సూర్యచంద్రులగతి నడ్డుటకుమాత్రమే. తన్మూలమున మఱియెట్టిలాభము నుండదు.

ఛత—(సోద్రేకముగ) అయ్యా! స్పష్టవచనమునకై నన్ను మన్నింపుఁడు. తమరుతండ్రిగారిని నన్ను నిర్జలమేఘములతోఁ బోల్చి తమ్ము సూర్యచంద్రులుగ భావించుకొని మేము తమతేజఃప్రకాశముల నిరోధించువారమే యని యెంచుచున్నారు. తమ రిన్నినాళ్లనుండియు జన్మభూమిని బరిత్యజించి భారతవర్షమందంతట స్వప్రకాశవ్యాపనమునకై సార్వభౌమాస్థానమున నివసించుచున్నారుగదా! ఐన నిప్పటివఱకు దేశమున నెంతటిప్రకాశము వ్యాపించినది?

జయ—(గంభీరముగ) భత్రిసాలా! నీమాటలచే నాకించుక యుఁ గ్రోధము కలుగుటలేదు. పాదుషాకొలువున నుండిననాచేఁ బ్రజల కెట్టియుపయోగముఁ గలుగలేదని నీవునాపై నారోపించిననిందకు నేనొక్కఁడనే పాత్రుఁడను గాను. కాని యన్యులదోషముల లెక్క పెట్టక యాత్మకర్తవ్యపాలన మొనరింపనగునని నాయభిప్రాయము. నేను చక్రవర్తియాస్థానమున నుండి ప్రజలకు గొప్పయుపకార మేదియుఁ జేయఁజాలకున్నను, ననుచితములు, నన్యాయపూర్వకములు నగునెన్నిపన్నులఁ దీసివేయించితినో, నీవెఱిఁగియే యుండవచ్చును.

భత్రి—తమరు ప్రాఁతపన్నుల ననేకములఁ దీసియే వేయించితిరి. కాని వెంటనే పాదుషా క్రొత్తపన్నులఁ దగిల్చెను. ఒకయధికారము నొసంగి తత్సమములగునన్యాధికారముల రెంటిని లాగికొనుట, రెండుపన్నులఁ దీసివైచి, తత్తుల్యమగు తృతీయకరము విధించుట, మున్నగునవన్నియు రాజనీతు లని తమరు స్వయముగ నెఱిఁగియే యున్నారు. ఈవిషయమున నేను తమ కింతకన్న నధికముగ నేమిచెప్పఁగలను? తమ రాలోచించినచో—మహారాణా రాజసింహునిఖడ్గమేయుదాత్తాశయముతో నొరనుండి బయల్వెడలెనో, దక్షిణమున శివాజీకృపాణ మెట్టిపవిత్రకర్తవ్యనిర్వహణమునకై బయలుదేఱినదో, తమప్రయత్నములకన్న శ్రేష్ఠతరము లగునట్టిమంగళమయాశయములతోడనే తుదివఱకుఁ దండ్రిగారు పోరుచుండిరి. ఉదయపురము సౌభాగ్యవంతమై యుండెను. దక్షిణనక్షత్రము తేజోవంతమై యుండెను. అందుచే మహారాణారాజసింహునియొక్కయు, మహాత్ముఁడగు శివాజియొక్కయు ప్రయత్నములు సఫలము లయ్యెను. కాని బుందేలఖండసౌభాగ్య మింతిదనుక నిద్రాణమై యుండుటచేఁ దండ్రిగారిప్రయత్నములు భగ్నము లయ్యెను. కాని యీకారణముననే తమరు

వారిని నిర్జలమేఘములతోఁ బోల్పఁబడుచుందురుగాక. ఇప్పటివఱకు నిర్జలములై కన్పట్టెడిజలదములే శీఘ్రకాలములో బుందేలఖండముపై స్వాతంత్ర్యవర్షముఁ గురియ మొదలిడును.

జయ—బుందేలఖండభాగ్యోదయ మెప్పటికైనను నాఁటువఱకు నీవిట్టిహీనావస్థఁ బడి నీసమయమును వ్యర్థమొనర్పకుందువుగాక యనియు, నేతద్విజయలాభముఁ బొంది నష్టమగునీపురాతనవైభవముపై నధికారము వహింతువుగాక యనియు నేనాశించుచున్నాను. రేపటినుండి చక్రవర్తిసైన్యము ప్రయాణము సాగించును. నీవుగూడ నావెంట ఢిల్లీకి రమ్ము. నేఁటినీయతులపరాక్రమవృత్తాంతము విని పాదుషావారు మిగుల సంతసమున నీయైశ్వర్య మంతయు నీకు మరల నిచ్చినైతురు. ఛత్రసాలా! నీవు నామాటలఁ దిరస్కరింపకుము. నేనచ్చటికేగి నీరాజ్యము నీకిప్పింతును.

ఛత్ర—నాకు మహింబారాజ్యప్రాప్తియే బుందేలఖండస్వాతంత్ర్యప్రాప్తి కాఁజాలదు. అమ్మా! క్షుధార్తమగు మృగపతియాకలి శునకముచేఁ గాని సృగాలముచేఁ గాని తీఱునది కాదు. చాతక మెన్నఁడు గోతిలోనినీటిచేఁ దనపిపాసఁ దీర్చుకొనదు. కావున బుందేలఖండస్వాతంత్ర్యభిలాష కేవల మహింబారాజ్యముచేఁ గాని పాదుషాదర్బారుల నమీరుబిరుదముచేఁగాని నెఱవేఱదు.

జయ—ఛత్రసాలా! నీవు బుందేలఖండస్వాతంత్ర్యము నింతగ నభిలషింతువేని ఢిల్లీకి వచ్చి బుందేలఖండముపై న్యాయరహితములు, ననుచితములు నగు కరముల విధింపవలదనియు నచ్చట నెట్టియన్యాయాచరణము జరుగరాదనియు బుందేలులయధికారములు బాగుగ రక్షింపఁబడవలయు ననియుఁ బ్రజలకు మతిస్వాతంత్ర్య ముండఁదగు ననియు నచ్చటిపరిపాలనము సువ్యవస్థితమై యుండవలయు ననియుఁ బాదుషా

వారితో మొఱలిడుము. పాదుషా నీయీమాటలకు సమ్మతించి యీ విషయమున నీకు వాగ్దాన మొసంగిన నీయిచ్ఛ నెఱవేఱినట్లేకదా!

భత్రి—అయ్యా! మాకుఁ గావలసినది స్వాతంత్ర్యము. వాగ్దానము కాదు. అక్బరుపాదుషా శాసనవిధాన మత్యంతసౌష్ఠవమున నొప్పుచుండెను. తన్మూలమున బ్రజలెల్లరు సుఖులై యుండిరి. అట్లయ్యు శౌర్యశిఖామణి యగుమహారాణా ప్రతాపసింహుఁడు చిత్తూరు వైభవముఁ దృణీకరించి బలవత్తరమగు చక్రవర్తిబలము ధిక్కరించుటచే జీవనము నేలగడపెను?

జయ—(సమీపమునుగఁ జూచుచు) కుమారా! నీమాట కడు చక్కఁగ నున్నది. పాదుషాకొలువున నమీరుపదవి స్వీకరించుసమయమునఁ జంపతిరాయలు నిట్లే నుడివియుండెను. కాని కాలానుగుణ్యముగు కార్యనిర్వహణము బుద్ధిమంతుల లక్షణము. అచ్చటి కేతెంచి పాదుషాకు నీవొనర్చినయుపకారముల నన్నిఁటి జ్ఞప్తికిఁ దెమ్ము. బుందేలఖండమునకు భాగ్యవశమున స్వాతంత్ర్యము లభించినసరే లేకున్న నీయిచ్ఛవచ్చి నట్లొనరింపుము. కాని పాదుషావారు నీమాటకు సమ్మతించెద రని నావిశ్వాసము. నేఁటినీశౌర్యముమూలమునఁ బాదుషావారికి లభించినభూభాగమున బుందేలఖండము సగమైన నుండదు. వారు శాంతమనస్కులై నీప్రార్థనము నాలకించిన నది తప్పక స్వీకరింపఁబడును. దాన వారికి లేశమైన హాని యుండఁబోదు.

భత్రి—అయ్యా! సామ్రాజ్యమహాసభలోఁ బాదుషా యాడినమాటల నన్నిటిని మఱచితిరా! ఆసమయమునఁ బాదుషా మా ప్రార్థనము నెంతయవమానముగఁ దిరస్కరించునో తమకు జ్ఞప్తియం ము లేదా? మాటిమాటికి భిక్షాందేహియనుటచే నేమగును? ఒకమారు

భిక్షాటనమున స్వాతంత్ర్యము లభింపదని తెలిసినతరువాత మాటి మాటికిఁ జేయిఁ జాచిన ఫలమేమి?

జయ—(సానురోధముగ) ఫలమున్నను లేకున్నను నీవు నాతో ఢిల్లీకి రావలయును. నామాట వినవలయును. ఇట్టిదీనసహాయావస్థలో నిన్ను బుందేలఖండమున విడువఁ జాలను. హీరాదేవిగుప్తచారులు బుందేలుఖండమునం దంతట నీకై వెదకుచున్నారు. నీతండ్రి నాకు మిత్రుఁడై యుండెను. మిత్రుఁడే యననేల—సోదరుఁడే యైయుండెను—నీవు హీరాదేవిఁబోలు దుర్మార్గురాలివలలోఁ జిక్కి మహావిపత్తులపాలగుటకు నేను సమ్మతింపను. నీవు నా వెంట ఢిల్లీకి రావలయును.

ఛత్రి—(గద్గదస్వరమున) అయ్యా! మీయీదయచే నేననుగ్రహింపఁబడితిని. దీనికై మీకు నేనెంతయు ఋణినై యున్నాను. కాని నావిషయమున మీరింతగ భీతిఁజెంద నక్కఱలేదు. హీరాదేవి నాప్రాణములఁ గొననున్నను నాకుఁ దద్విచారము లేదు. ప్రాణనాథస్వామిప్రయత్నమున శీఘ్రముగనే బుందేలు లెల్లరు స్వాతంత్ర్యప్రియులై నన్ను ప్రాణప్రియునిగఁ జూచుకొందురు. అయ్యా! తమరు నావిషయమున నేమియు విచారింపకుఁడు. మహోబాదుర్గము నన్ను రక్షింపఁజాలకున్నను, దండ్రిగారివలన నాకు లభించినయభేద్యస్థైర్యదుర్గము నన్నుఁ దప్పక కాపాడును. తండ్రిగారిప్రేమ నన్నుఁ గాపాడఁ జాలకున్న వింధ్యవాసినీ దేవ్యనుగ్రహము తనభక్తునిఁ గాపాడితీరును. నామనమున స్వాతంత్ర్యదివ్యజ్యోతి వెలుఁగుచున్నది. స్థైర్యము నన్ను రక్షించుచున్నది. పవిత్రదేశహితకర్తవ్యము నామనమున లగ్నమై యున్నది. తమరు, ప్రాణనాథప్రభువు మున్నగు మహాత్ముల యాశీర్వాదములు లభించుచున్నవి.ఇఁక నే హీరాదేవికి వెఱవనేల? అయ్యా! నన్ను ఢిల్లీకి రానిర్బంధింపకుఁడు. ఈప్రాంతమున నేనింకను నొనరింపఁ

దగుమహాత్కార్య మున్నది. నేనింతశీఘ్రముగ నిప్పుడే దక్షిణదేశము విడువఁజాలను.

జయ—(సాశ్చర్యముగ) నీవు మాతోఁగూడ బుందేలఖండమునకైన మఱలి రావా?

ఛత్ర—రాను. ఇంకను దక్షిణముననే రెండుదినములనఱ కుండనగును.

జయ—నీవిచ్చటనుండి యేమి చేయుదువు?

ఛత్రి—నాగురుదర్శన మొనరించుకొందును.

జన—ప్రాణనాథస్వామి నేఁడు దక్షిణముననే యున్నాఁడా?

ఛత్ర—లేదు. వారు బుందేలఖండముననే తమకార్యము నిర్వహించుకొనుచున్నారు.

జయ—ఐన నీవిప్పు డిచ్చటనుండి దర్శింపఁగోరెడిగురు వెవరు?

ఛత్రి—మహాత్ముఁడగు శివాజీ!

జయ—(సాలోచనముగ సంతోషమున) ఐన నీవు మిగుల నుత్తమమును ప్రశంసనీయమును, యోగ్యమునగు కార్యముఁ జేయుచున్నావు. నీవు మిగులసంతసమున నామహాత్మునియొద్ద కేగి గురూపదేశముఁ బడయుము. అతఁడన్నివిధముల నీకు గురువు కాఁదగినవాఁడు. కాని నీకార్యము నెఱవేఱినపై వెంటనే ఢిల్లికి నాయొద్దకు వచ్చెదనని మాట యిమ్ము. నేఁటియుద్ధమున నీవొనరించినకార్యము వ్యర్థము కాఁగూడదు.

ఛత్ర—నేనీవిషయమున వారియనుమతినే పొందెదను. బుందేలఖండస్వాతంత్ర్యవిషయమున నేను వారియుపదేశము ననుసరించియే కార్యము నిర్వహించెదను. తండ్రిగారుఁగూడ సంత్యకాలమున

నిల్లొనర్చుటకే నాకాజ్ఞయొసంగిరి. వారు నాకు ఢిల్లీకిఁ బోవ ననుమతి నొసంగినఁ దమరు ఢిల్లీకిఁ జేరకమున్నే భవదీయసేవాగతుఁడనయ్యెద.

కొలఁదిసేపటివఱకీమాటల నామాటలఁ జెప్పినపై జయసింహుఁ డచటినుండి వెడలిపోయెను. ఆసమయమున నతనినేత్రములు ప్రేమాశ్రుభరితము లయ్యెను. మార్గమున నెల్లెడలఁ బ్రజలు విజయోత్సవమగ్నులై యుండిరి. కాని జయసింహున కదేమియుఁ గానవచ్చుట లేదు.

మఱునాఁడు బహదూర్‌ఖాన్‌కోకాయొక్కయు జయసింహుని యొక్కయు సంయుక్తసైన్యము ఢిల్లీకిఁ బయనమయ్యెను.

ఛత్రసాలకుమారుఁడు వారివెంట నరుగలేదు.

---

## ఇరువదిరెండవప్రకరణము

### నిర్భాగ్యుఁడగు కంచుకిరాయలు

ప్రధాని యగుసజ్జనరాయఁ డన్వర్థనామకుఁడై యుండెను. కంచుకిరాయలు తనకాలము నంతను నౌరంగజీబునకును, హీరాదేవికిని సేవాసపర్యలు సలుపుటయందే కడపుచుండెను. కఠినము లగు రాజకార్యముల నిర్వహించుకొనుట కతనికిఁ దీరికయే లేకుండెను. నేఁడు దర్బారునందలి యొకయమీరునకు స్వాగత మొసంగుట, యెల్లి మఱి యొకయమీరునకు విందు సేయుట, మఱునాఁ డొకసరదారునకుఁ

గానుకలు పంపుట, నాల్గవనాఁడు హీరాదేవిపిలుపున నోర్ఛాకుఁ బ్రయాణ మగుట—ఇంతే—ఇట్టిట్టిపనులయందే యెల్లపుడు నతని కాలయాపన. అతఁడు ఢాంఢేరరాజసింహాసన మధిష్ఠించినది మొదలుగ నిట్టికార్యములనే మగ్నుఁడయి యుండుటచే నిప్పటివఱకు రాజకార్యముల నిర్వహింప నతనికిఁ దీఱికయే కలుగలేదు. ఇట్టిదశయందైనను ఢాంఢేరరాజ్యవ్యవస్థ చాల చక్కఁగ నుండెను. ప్రజలపై ననావశ్యకము లగుపన్నులు విధింపఁబడుటయు లేదు; వారియెడ నట్టియన్యాయములును జరుగుటయు లేదు. ప్రజలమొఱలకు సులభమగువిన్కియుఁ బూర్ణమగున్యాయమును లభించుచుండెడివి. ఇందువలననే ఢాంఢేరరాజ్యమునకుఁ జాలయశము కల్గెను. ఈయశమునకుఁ బ్రధానకారణము ప్రధాని సజ్జనరాయఁడే. అతఁడు రాణిసుఫలాదేవియానతిని సమ్మతిని ననుసరించి మిక్కిలినైపుణితో రాజ్యకార్యముల నిర్వర్తించుచుండెను.

నేఁడు కంచుకిరాయలు మూల్యవంతము లగువివిధాభరణాంబరముల ధరించి సవిలాసముగ ఢాంఢేరరాజసింహాసన మలంకరించి యుండి సరదారులనుండియు, నాగరకులనుండియుఁ, గానుక లందుకొనుచుండెను. ప్రజలకుఁగూడఁ జాలకాలమునకు నేఁడు రాజదర్శనభాగ్యము లభించెను. కాన రాజసభ యంతయు సరదారులతోను నాగరకులతోను నిండియుండెను. నేఁడు ప్రభువరు లేయుద్దేశమున నింతగొప్పరాజసభ గావించుచుండిరో, యందేమి భాషింపఁ గోరుచుండిరో యని సజ్జనరాయఁడు కొంచె మాశ్చర్యచింతాక్రాంతుఁడై యాలోచించుచుండెను. కంచుకిరాయలనిరోధమున నతనిభాషణము వినుటకై యొకప్రక్క జవనిచాటున విజయాసహితయై రాణి సుఫలాదేవి కూడ నాసీనయై యుండెను.

ఆహూతు లగునెల్లరు సుపస్థితు లైరని సజ్జనరాయనిచే నెచ్చరిం గింపఁబడి యాతఁడు తనవక్తృత్వము నిట్లారంభించెను.

“ నేఁడు ప్రజలరాజభక్తిచే నా కమితమగు గర్వము గలుగుచున్నది. మేము ఛాంధేరరాజ్యగౌరవముఁ బెంపొందింప నవిరళప్రయత్నము సల్పుచుండుట మీరెల్ల రెఱుఁగుదురు. కాని ఛాంధేరరాజ్య మెంతగొప్పది యైనను మొగలుసామ్రాజ్యముతోఁ బోల్చి చూచిన బిందుప్రాయ మనువిషయముం గూడ మఱువరానిది. మన కింత గొప్పసామ్రాజ్యశరణము లభించుట మనమహాభాగ్యము. కొలఁదికాలముననే మనరాజ్యమునకు మొగలుసామ్రాజ్యముతో గొప్ప సంబంధము కలుగఁగలదని మీకెల్లరకుఁ దెలియఁజేయ మాకు మిగుల నానంద ముదయించుచున్నది. దైవవశమున నేటివఱకు మాకుఁ బుత్రసంతతి కలుగలేదు. భావికాలమునఁ గలుగుననునాశయు లేదు. వయసుగూడ వ్యతీతమై పోవుచున్నది. కావున నిటుపై మాయనంతరము మావలెనే మీహితముఁ గోరుపాలకులు మీకు లభించునేర్పాటుఁ గావించుట మాపరమకర్తవ్యమై యున్నది. మాకుఁ బుత్రుఁడు లేకుండుటయు నొకవిధమున మంచిదే. ఏల యన నేటిబుడుతలు సామ్రాజ్యద్రోహులుగఁ బరిణమించుచున్నారు. వారిమస్తిష్కములు తారుమారై యున్నవి. వారిధ్యాన మంతయు స్వరాజ్యస్వతంత్రతలపై నిలిచి యున్నది. సాగరరాజ్యాధిపతి యగుశుభకరణుఁ డెంతటిపుత్రసౌఖ్యము ననుభవించుచున్నాఁడో మీకు బాగుగఁ దెలియును. తండ్రి సామ్రాజ్యపక్షమునఁ బోరుచుండఁ, గుమారుఁడు విద్రోహిమండలితోఁ గలిసి యున్నాఁడు. ఈవిప్లవకారులకు నాయకుఁడగుఛత్రసాలుఁ డెంతదుర్మార్గుఁడో, యెంతమూర్ఖుఁడో యతనిమూలమున బుందేలఖండమున నెంతరక్తపాత మగుచున్నదో, యతనిమ

ష్కృతులవలన నతనితండ్రి యగుచంపతరాయలప్రాణము లెట్లు పో
యెనో, తనరాజ్యైశ్వర్యములఁ గోల్పోయి యతఁ డీసమయమున నెట్లు
యజ్ఞాతవాసము సల్పుచున్నాఁడో యది యంతయు మీరెల్లరు బాగుగ
నెఱుఁగుదురు. ఛత్రసాలదలపతులఁబోలుపుత్రు లుండుటకంటెఁ బు
త్రుఁడు లేకుండుటయే మంచిది. కాన నీనాఁడు యువరాజు లేఁడను
చింత వలదు. మాకుఁ బుత్రుఁడే యుండినచో నతఁ డయోగ్యుఁడై
యుండినను మీవంటిరాజభక్తులు వివశులై యతనిని రాజుగ గణింప
వలసివచ్చును. మాకోరిక యేమన, నౌరంగజేబునకు మిగులఁ గృపా
పాత్రుఁడును, సామ్రాజ్యమున కసామాన్యభక్తుఁడుగ నుండి తన్మూల
మున మీకెట్టియాపదయు రాకుండఁజేయువాఁడును, మాకుత్తరాధి
కారి కావలయును. భాగ్యవశమున నట్టివ్యక్తి యీసమయమునఁ
బ్రాప్తించినాఁడు. నేఁటిసభ మీభావిపాలకుని మీకుఁ దెలియఁజే
యుటకే యేర్పడినది." అని పలికి కంచుకిరాయలు తనయుపన్యాస
మునఁ బ్రజల కెట్టియభిప్రాయము కలిగెనో చూచుటకై యించు
కసే పూరకుండెను.

ఆసమయమున జను లెల్లరుఁ దమప్రభువు సామ్రాజ్యభక్తుఁ
డగు నొకసరదారునికుమారునో, యట్టి యొకరాజకుమారునో దత్తునిగఁ
[illegible] కన్య నిచ్చి వివాహ మొనర్చి కాని తనరాజ్యమున
[illegible] జేయు నని తలఁచుచుండిరి. కావుననే ప్రజలలో
[illegible] ప్రకటనము కాలేదు. ఎల్లరును భ్రమపడియున్నవారిమా
టల [illegible] యథాప్రకారముగఁ గూరుచుండియుండిరి.

కంచుకిరాయలు మరలఁ దనయుపన్యాసము మొదలిడెను.
"యువరాజు లేకుండుటను మీరు విచారింపరాదని మేమిప్పుడే చెప్పి
యుంటిమి. కాని యిందువలన సంతానము లేకుండుటయే శ్రేష్ఠమని

మీరు తలఁపవలదు. సంతతి యనఁ బుత్రుఁడుఁ గావచ్చును. పుత్రికయుఁ గావచ్చును. ఈకాలమునఁ బుత్రుఁడు లేకుండుటే మంచిది. ఏలయన వానివలనఁ దఱచుగ ననేకకష్టములు సంభవించును. పుత్రుఁడు తండ్రితో వాదులాడి వెడలిపోవుటయుఁ, దండ్రి యపమృత్యువునకుఁ గారణభూతుఁ డగుటయు మనము తఱచుగఁ గనుచున్నాము. కావున వ్యర్థమగుచింతవలనఁ బ్రయోజనము లేదు.

కంచుకిరాయల మాటల వినఁగ వినఁగఁ బ్రధాని సజ్జనరాయని కాశ్చర్యము దుర్భర మగుచింతయుఁ జొడముచుండెను. రాజు పలికెడియీమాటల నెట్లు వారింపవలయునో యతనికి బోధపడలేదు. అపలుకులపరిణామముఁగూడ నాతనికిఁ దెలియలేదు.

కాని కంచుకిరాయలపలుకుల కంతము లేకుండెను. అతఁడు చాలసేపిట్లే తల, తోఁక లేనిపలుకుల నాడుచుండెను. చివరకుఁ దన యభిప్రాయముఁ దేల్చెను. "మేము మారాజ్యపుదిట్టతనమునకును, సువ్యవస్థాపనమునకును జక్కనిమంత్రిఁ గావించితిమి. రాజకుమారి శీఘ్రముగనే యొకసామాన్యుఁ డగుసరదారుకుమారునికిఁ గాని, జాగీరుదారుకుమారునికిఁ గాని వివాహితయైపోవును. ఆమెకుఁ దగినవరుఁ డన్వేషింపఁబడుచున్నాఁడు. వివాహానంతర మామె తనగృహమునకు వెడలిపోవును. సజ్జనరాయఁ డిపుడు చాలవృద్ధుఁ డై పోయినాఁడు. శరీరపాటవము తగ్గినది. వయసు మాకును జాలఁగనే కడచినను, మాకం కను గొన్నాళ్లవఱకు నిర్వాహశక్తి యున్నది. మాయుద్దేశ మేమన రణదులహఖాఁ మహాశయుఁడు వచ్చి యిచటనే యుండి రాచకార్యములఁ జూచుచుండవలయును. శాసనపాలనాదులం దాతఁడు కడు నేర్పరి. ఔరంగజేబు పాదుషా కతనియం దమితమగు దయ. మేము బ్రదికియుండునంతకాల మతఁడు మాకు సాయ మొనరించుచుండును.

పోయనంతర మతఁడే యుత్తరాధికారి యగును. మీరేమియుఁ గలఁతపడవలదు. ఆర్యసంతతికిని, మహమ్మదీయుల్లకును బరస్పరద్వేషకాలము గతించినది. ఇక నిరువురిసమ్మేళనమున కిది సమయము. ఆసమ్మేళనమున కుపక్రమణిక యీరీతినే యుండవలయును. మీకెట్టియన్యాయము, దౌష్ట్యము, జరుగదని విశ్వసింపుఁడు. రిణదుల్లాఖాను స్వయముగ బుద్ధిమంతుఁడు. మఱియు నేనాతని కింకను బోధించెదను. మీరన్నివిధములఁ నిశ్చింతులై యుండురుగాక."

కంచుకిరాయలవక్తృత్వము పూర్తికాకమునుపే సభయందంతట నల్లరి యారంభ మాయెను. జను లొకరితో నొకరు రహస్యసంభాషణ మొదలిడిరి. చాలమందిసరదారులు, నాగరకులు లేచి యెద్దియో చెప్పఁగోరియు, సజ్జనరాయనిముఖముఁ జూచి మరల మానుచుండిరి. కొందఱికి నూరకుండుఁడని సజ్జనరాయఁడు సంకేతముఁగూడఁ జేసెను. కంచుకిరాయలయుపన్యాసము ముగియుటతోడనే సభయందంతటఁ గోలాహలము రేగెను. కంచుకిరాయలు కినిసి యిట్లనెను:—

"ప్రధానీ! ఇది యేమి! త్వరగ నీవు వీరి నందఱి నణఁచుము. ఢిల్లీలో ననుదినము రాజసభ జరుగుచుండును. కాని యందెప్పుడు నిట్టియల్లరి చూడలేదు. మేమేమియు ననుచితవాక్యముం బలుకలేదే. నీవు వీరల నడఁచుము. ఇంకను జెలరేగినవారి నుచితరీతి దండింపుము. ఇది నాయాజ్ఞ."

ప్రధానిసజ్జనరాయఁడు లేచి రెండుచేతుల నెత్తి యందఱకు శాంతింప సైగచేయుచు మిక్కిలికష్టముతో వారిని శాంతింపఁజేసి యిట్లనెను:— "మీరింత వ్యాకులపడకుఁడు. మహారాజుగా రుత్పపాదించిరి. దీనిసంబంధమగుకార్యక్రమ మేమియు నొసరింపఁబడలేదు. దీనిని మీరు యోజించి సమ్మతుల నిచ్చుటకు సమయము

క్షది. మహారాజుగారు మంచియాలోచనాపరులు. మీసమ్మతి లేక యు బాగుగ యోజింపకయు వారేకార్యము నొనరింపరు. బాగుగ నాలోచించి దీనిని వదలివేయుటకూడ సంభవము. నేను సమయము చూచి మహారాజుగారి నీవిషయమున నొప్పించెదను. ప్రభువర్యులు మనప్రార్థన నంగీకరింతు రనునాశయుఁ గలదు."

కాని నజ్జనరాయని యీపలుకులు కంచుకిరాయలకు రుచింప లేదు. రణదులహాఖాను ఓర్ఛాసభామందిరమునఁ దనతోఁ బ్రస్తావించి నపుడు తాను చింతాక్రాంతుఁడయి ఖానునిప్రస్తావమున కసమ్మతిఁ జూపినను, హీరాదేవి యతనికి మంచిచెడ్డలన్నియు బోధింప, నతఁడు తనరాజ్యమంతయు రణదులహాఖానుని కొసంగ సంసిద్ధుఁ డయ్యెను. అతఁడు రానుతా నీయుద్దేశమును వీడునేమో యని మఱియొకమాటఁ గూడఁ జేర్చి చెప్పెను. ఆమె యతనితో నిట్లనెను:—"మీపుత్రిక మాకడనున్నప్పు డెల్లప్పుడును ఛత్రసాలుని నతనికా... ... ... మెచ్చుకొనుచుండెడిది. ఇంచుక యతనియెడ ననురాగము ... ... నట్లుకూడఁ దోఁచుచున్నది. విజయాఛ్ఛత్రసాలురవివాహ మయి నచో ముందు చాల ననర్థమున్నది. చేసినదంతయు మంటఁ గలియును. ఛత్రసాలుఁడు ధాంధేరునకు రాజై కూరుచుండును. మ తల బుందేలఖండమున నుపద్రవము లారంభము చేయును." ఈతు మిమాట యతనికి బాగుగ మనసునఁ బట్టినది. కనుకనే యతఁడు తన రాజ్యము నంతను, ఖానున కిచ్చివేయ సంసిద్ధుఁ డయ్యెను. ఇట్టిదశ యందుఁ బ్రజలుమ నజ్జనరాయఁడును బలికినమాటలు కంచుకిరాయ లకు రుచింపలేదనిన నందాశ్చర్య మేమి ?

కనుకఖిన్నుఁడై కంచుకిరాయ లిట్లు పలికెను:—"ప్రధానీ! ఏమిట్లు పలుకుచుంటివి! మేమేమి చేసినను జెప్పినను ముందుగ దూర

మాలోచింతు మని నీకుఁ దెలియును. ఇఁక నిట్టి నిరర్థక మగుమాట లవలన నేమిప్రయోజనము! మేము చెప్పిన దంతయుఁ గడుంగడు నొప్పుగ నున్నది. అందేమియు మార్పు రాఁజాలదు. ఈవిషయమున మీ రేమియు విసఁగొనుట లేదు.

సజ్జ — మహారాజా! ఇదంతయు బాగుగనే యున్నది. కాని యొకహిందూరాజ్యము మునల్మానులచేతిలోని కీవిధముగఁ బోవుట చూడ జనులు సహింపఁజాలరు. మునల్మానులు న్యాయముగ నధికారము సేయుస్థలములఁగూడఁ బ్రజలు వారినటనుండి తొలఁగఁజేయుటకై చింత సేయుచున్నా రని దేవరవారు చూచుచునే యున్నారు. ఇట్టితరి నెఱిఁగియుండియు, రాజ్యమున నూతనోపద్రవముఁ బాముకొల్పుట యెంతన్యాయయుక్తమో దేవరవారే భావింపఁగలరు. దేశమున మునల్మానులదురాచారములు నానాఁటికిఁ బెరుగుచుండుటఁ గాంచియు నింతగొప్పరాజ్యము నొకమునల్మానున కొప్పగించుట గోవును వ్యాఘ్రశరణమున నుంచుటే. యువరాజు లేనపుడు రాజకుమారిని నొకయర్హుఁ డగురాజకుమారుని కిచ్చి వివాహ మొనరించి యాతనికే రాజ్యాధికారము నొసంగుట యెల్లవిధముల నుచితమగు కార్యము. బుందేలఖండమండలిరాజ్యము బుందేలులహస్తములయందే యుండఁదగును. ఇదియే శాస్త్రసమ్మతము. ఇదియే నీతియుక్తము."

కంచు — ప్రధానీ! నీవు వృథాగా నీవిషయమున నధికవేళము బూని మాక్రోధమునకు గురికాకుము. శాస్త్రమర్యాద మాకు బాగుగఁ దెలియును. నీతితత్త్వము మేమెఱుఁగనిది కాదు. మేమీవిషయమున బాగుగ విచారించితిమి. భవితవ్యమునుగూర్చి యెంతయో దూర మాలోచించితిమి. మీరెవ్వ రింక నంతదనుకఁ దెలియఁజాలరు. మఱియు — నీరాజ్యము మా యమ్మాయి కిచ్చివేయుటకైన మాకధి

కార మున్నది. ఇంకెవ్వరియాతంకమును గలుగరాదు. ఈవిషయ
మున మాకెవ్వరేని విరుద్ధులైనచో రాజద్రోహులుగ నెంచఁబడు
దురు."

అటుపై ననేకులు కోలాహలముచేయ మొదలిడిరి. "ఇట్లె
న్నఁడుఁ గాఁ" దని యొకరు "మేమిక్కడ నుండఁజాల" మని
మఱియొకరు, "ఇఁక మనకు వినాశకాలము వచ్చిన" దని వేఱొకరుఁ
బల్కుచుండిరి. వివిధము లగువచనములను బెద్దకలకలమును విని కం
చుకిరాయలు, ఖిన్నుఁడు వ్యాకులుఁడు నయ్యెను. తుట్టతుద కతఁడు
సభ ముగియ నానతి యొసంగి తాను సభ వీడి లేచిపోయెను. అతఁడు
లేచిపోయిన వెనుక సజ్జనరాయఁడు రాజుగారిసంకల్పము నెఱవేఱుట
సంభవము కాదనియు నెల్లరు నిశ్చింతులై యుండఁదగు ననియు సర
దారులకు నగరవాసులకు నాశ్వాసన మొసంగెను. అప్పు డతికష్టమున
జనులమనసులు కుదుటఁబడెను. ఎల్లరుఁ దమతమయిండ్ల కేగిరి. కం
చుకిరాయ లున్మత్తుఁ డయ్యెనని యనేకులు చాలమంది తలఁచిరి.

సూర్యభగవానుఁడు లోకము వీడి యేగెను. అల్లనల్లన నల్లని
రాత్రి వెలువడుచుండెను. ఆమె తనపతి యగుచంద్రదేవునిరాకఁ బ్రతీ
క్షించుచుండెను. విభునిరాకయందు జాగగుటఁ గాంచి యామె, యిం
చుక యుద్విగ్నతఁ గాంచెను. ఆమె శ్యామవదనమునఁ జింతాచ్ఛాయ
కన్పడసాగెను. ఈరీతి రెండుగడియ లగుసరికిఁ దనకాంతుఁడు స్వర్గీ
యసుధారసమున స్నానమాడి తన్నుఁ గౌఁగిలింపఁ గరములు చాచి
కొని వచ్చుచుండుట యామెకుఁ గానవచ్చెను. ఆమెయు నతిత్వరిత
గతి నేగి నాథునియంకమునఁ జేరిసుఖముండెను.

ఆసమయమున రాణి సుఫలాదేవి విశ్వసనీయ యగునొకదా
సిని బ్రధానిసజ్జనరాయుని జీఁజబనిచెను. కొలఁదిసేపటికో వృద్ధుఁడగు

సజ్జనరాయ లేతెంచి సుఫలాదేవి కభివాద మొనరించి యిట్లు పలికెను. “సెలవిండు. ఇంతరాత్రివేళ రాజ్యలక్ష్మి యీదాసు నేల రావించెను!”

సుఫ—ప్రధానీ! నేఁడు సభయందు జరిగినదంతయు మీరు చూచితిరి. దీనికిఁ బ్రతికృతికై యెట్టియుపాయ మాలోచించితిరో చెప్పుఁడు.

సజ్జ—శ్రీమతీ! మహారాజున కించుక మతి చలించిన ట్లున్నది. మహారాజనేకము లగుకృత్యములు సల్పుచుండెడివాఁడు. కాని నేఁటియాలోచనములఁ బోలునాలోచనములు మున్నెన్నఁడు వారి కుండుట వినలేదు. మనమింకను గొలఁదిదినము లోపికపట్టి యెడరు చూచి మహారాజున కించుక నచ్చఁజెప్పుట బాగుగనుండునని నేఁదలఁచుచున్నాను.

సుఫ—ప్రధానీ! అట్లు కార్యము సాగదు. గాంధేరరాజ్యమును, రాజవంశమును, రక్షించుటకై మన మొక కపటమగు శేర్పాటు చేయవలసి యుండును. అందు సాయ మొనరించుటకే మిమ్మిపుడు పిలువనంపితిని.

సజ్జన—మంచిది. శ్రీమతి నాకేమి యాజ్ఞ పెట్టినను నిర్వహింప సంసిద్ధుఁడనై యున్నాను.

సుఫ—ప్రధానీ! మీరిప్పుడే విజయను గొని యోరాఖ కేగుఁడు. వెలుపల మీయిరువురికొఱకు రెండశ్వములు నిలుపఁబడి యున్నవి. వాని నధిరోహించి మీరిరువురును వెంటనే యోరాఖమార్గముం బట్టుఁడు.

సజ్జ—రాజకుమారిని గొనిపోయి యోరాఖలో రాణీహీరాదేవియాశ్రమమున నుంచిరమ్మనియా శ్రీమతి యిచ్ఛయించునది!

కాని యీయుపాయమువలనను లాభము లేదు. ఏల యన. హీరాదేవి—

సుఖ—ప్రధానీ! మొదట నామాట బూర్తిగ నాలింపుఁడు. మీరు విజయను గొని హీరాదేవికడ కేఁగుఁడు. ఆమె మిమ్మెఱుఁగును కదా! ఏగుటతోడనే మీ రామెను రహస్యమున సందర్శించి “విజయను ఛత్రసాలుని కిచ్చి వివాహము సేయుటయు, ధాంధేరరాజ్య మంతయు నతనికే యొసంగుటయు, రాణిసుఖలాదేవి యభీష్టము. కావుననే మహారాజు నన్ను విజయతో మీకడ కంపిరి. విజయను ఛత్రసాలునకుఁ బెండ్లి చేసినచో నాతఁడే ధాంధేరమున కుత్తరాధికారి యగుననియుఁ, గాన ననురూపులగువిజయావిమలదేవులకు వెంటనే వివాహము చేసినచో ధాంధేరరాజ్యమున కీయాపద తొలఁగి ఛత్రసాలునకు రాజ్యము లభింపకుండు ననియు వారి యభీష్టముగఁ చెప్పిరి” అని యామెతో వచింపుఁడు. విజయావిమలదేవులవివాహ మొనర్చుటకు మీకు మహారాజుగారు సంపూర్ణాధికార మొసఁగి రని యామెతోఁ జెప్పుఁడు. ఆసమయమునం దామె శీఘ్రముగనే పెండ్లియేర్పాటులఁ గావించి విజయపరిణయము గావించును. సాధ్యమగునంతవఱకు మీ రామెకు ఛత్రసాలుఁడు వచ్చి వివాహమునకు విఘ్నముఁ గూర్చునేమో యనుభయముఁ గల్గించి వివాహము నతిత్వరితముగఁ జేయింపుఁడు. చాలు. ఇంతమాత్రముననే కార్యము నెఱవేఱును.

సజ్జనరాయనికి సుఖలాదేవిమాట యొక్కటియు బోధపడలేదు. అతఁడు వ్యాకులతతో నంతయు వినెను. సుఖలాదేవిమాటలు సమాప్తి నందినవెనుక గూడ జాలసేపతఁ డూరక యుండ సుఖలాదేవి మరల నిట్లనియె:—

“ప్రధానీ! నా యుక్తి మీకు సమ్మతము కాలేదా! లేక మీరిం

తరాజ్యముయొక్కయు మీస్వామియొక్కయు క్షేమమునకై నంత
యపత్యమూడ వెనుదీయుచున్నారు కాంబోలు. మీరు నేఁజెప్పినయీ
కార్యము నొనరించినచో ధాంధేరరాజ్య మెన్నఁడు మ్లేచ్ఛులహస్తము
లఁ బడదని నమ్ముఁడు."

సజ్జ—శ్రీమతీ! మధురఫలప్రాప్తికై కంటకావృతములగువృ
క్షములఁ జేరవలసివచ్చును. ఆరోగ్యప్రాప్తికై విషతుల్యము లగునౌ
షధముల మ్రింగవలసివచ్చును. అట్లే మిగుల న్యాయయుక్తముఁ
బవిత్రము, ఋజుకలితము నగుపక్షమునకు విజయముఁ గూర్చుటకై
యొకప్పు డసత్యము నన్యాయముఁ దోడు కావలసివచ్చును. ఇప్పుడు
నట్టిసందర్భమే. నేను తమయాజ్ఞఁ బాలింప నెల్లవిధముల సంసిద్ధుఁ
డను. కాని యొక్కటిమాత్రము తమ రాలోచింపుఁడు. రాజకుమారి
విమలదేవునికి వివాహిత యగుటయు నొప్పుకాదు. అట్లైయెడ ధాం
ధేరమంతయు హీరాదేవికరతలమునఁ జిక్కును. అదియుఁ దక్కువ
యనర్థము కాదు.

సుఖ—మీరీవిషయమునఁ జింత సేయవలదు. వాస్తవమున
విజయ ఛత్రసాలునికే వివాహిత యగును. నేను నారాజ్యము నెన్నఁ
డు హీరాదేవిచే జిక్కనీయను.

సజ్జనరాయనిమాశ్చర్య మినుమడించెను. అతఁడు చకితుఁడై
యిట్లడిగెను. "సరేకాని యొకసారి విజయకు విమలదేవునితోఁ బెండ్లి
యైనపిదప మరల ఛత్రసాలునితో నెట్లు కాఁగలదు!"

సుఖ—ప్రధానీ! ఇందొకగొప్పరహస్య మున్నది. మీకిదే
చెప్పుచున్నాను. ఓర్ఛారాజగువిమలదేవుఁడు వాస్తవమున స్త్రీకాని
పురుషుఁడు గాఁడు. కొడుకు లేకుండుటచేఁ దనరాజ్యము మహీ బారా
జులయధికారమున నెక్కడఁ బోవునో యను భయమున హీరాదేవి

తనకూఁతురగు విమలను విమలదేవకుమారునిగఁ జేసి పెంచినది. తన యావన్నగడ నెవ్వరెఱుఁగ రని హీరాదేవి పెట్టినమ్మకము. కొలఁది కాలముననే యామె పెద్దయాడంబరముతో విమలదేవునకుఁ బట్టాభిషేకముఁ గావింపనున్నది. దీనికి ముందుగనే విజయావిమలదేవులవివాహము కావలయును. ఈపెండ్లివలన విజయకన్యాత్వమునకు భంగము రాదు. ఇరువురికన్యకల పరస్పరవివాహము వాస్తవమునకు వివాహమే కాదు. ఛత్రసాలుఁడు బుందేలఖండమున స్వాతంత్ర్యము స్థాపించి రణదుల్లహాఖానును బారఁద్రోలినపిదప విజయతో నాతనికి వివాహము కాఁగలదు. ఇఁక మీకంతయు జక్కఁగఁ దెలిసినదా?"

ప్రధానిసజ్జనరాయనికి బాగుగ సమాధానము కలిగెను. అతఁడు మిగుల సంతసించి విజయనుగొని యోర్ఛాకుఁ బయన మయ్యెను. మార్గమధ్యమున విజయవలన నతనికి విమలదేవునిస్త్రీత్వవృత్తాంతము సుఫలాదేవి కామెయే యెఱింగించెనని తెలిసెను.

కొంచెముసేపుండి సుఫలాదేవి యొకపత్రము నొకవిశ్వాసపాత్రుఁ డగుసేవకుని కిచ్చి దానిని ప్రాణనాథస్వామిని వెదకి యాతని కిమ్మని చెప్పెను. అతఁడును బత్రముఁగొని ప్రాణనాథప్రభునియన్వేషణమునకై బయలుదేఱెను.

---

# ఇరువదిమూఁడవప్రకరణము.



ఆపాదపిశరాదపి.

అనంతవిశ్వమధ్యమున భగవంతుఁ డగుసహస్రకిరణుఁడు సుశోభితుఁ డగుచుండమున, నగణ్యతారకామధ్యమునఁ దేజస్వియై కన్పట్టు నిశాకరుఁడువోలె, ముప్పదిమూఁడుకోటులదేవతాగణమున నోర్ఛాప్రజలకు నేకమాత్రపూజ్యుఁడై కానవచ్చుచతుర్భుజదేవునిభంగి, నసంఖ్యమానవగణమధ్యమునఁ బాణినాథస్వామి యలౌకికతేజశ్శోభితుఁడై యుండెను. ఓర్ఛారాజసభాభవనమునఁ గూరుచుండి రణమిలహాఖానుఁడు నేఁటిమూఁడవజామునఁ జతుర్భుజవిష్ణుమూర్తి భగ్నమొనరింపఁబడవలయు ననియు, రేపటికిఁ దదాలయము విధ్వస్త మొనరింపఁబడఁ దగుననియు సాధ్యమైనంత శీఘ్రముగ నాస్థానమున నొకయున్నత మగుమసీదు సిద్ధము చేయవలయుననియు నాజ్ఞాపించెను. దీనిని వినఁగనే యోర్ఛాపురవాసు లత్యంతదుఃఖసంతాపములకు లోనై కోపించి తుదకు దౌర్జన్యపరు లగుయవనాధికారులఁ దిట్టి శాపవర్షము గురియించుచుండిరి. కాని వారికిఁ బ్రతీకారమార్గ మేదియుఁ గానవచ్చుటలేదు. ఓర్ఛానగరమునందలి చిన్నవియుఁ బెద్దవియు నగునఖిల దేవాలయములు భగ్నము లయ్యెను. కాని చతుర్భుజదేవాలయమునకు మాత్ర మట్టియవస్థ పట్టదని యెల్లరు విశ్వసించి యుండిరి. కాని తుద కాయాలయముఁగూడఁ బడఁగొట్టఁబడునని యెఱింగినంత వారి కసహ్యమగు సంతాపము జనించెను. వారి కాయదనునఁ గార్యాకార్యజ్ఞానము లేకుండెను. హీరాదేవి తనపుత్రుఁ డగువిమలదేవునిపవా

మహాప్రయత్నమున నుండెను. తనరాజ్యములో నేమియనర్థకకార్యము జరుగుచున్నదో యనువిచారమే యామెకు లేకుండెను. కావున మిగులఁ గష్టమునఁ బన్నామందలి సుప్రతిష్ఠితు లగువారు శ్రీహీరాదేవియొద్దకుఁ జని యెట్లైన రణదులహాఖానుని యాజ్ఞ నిర్వహింపఁబడకుండ చేయవలయు ననియుఁ జతుర్భుజదేవాలయము భగ్నముకాకుండఁ గాపాడఁబడుఁగాక యనియుఁ బ్రార్థించిరి. కాని హీరాదేవి "నేనిప్పుడు పెండిలిసందడి నున్నాను. అదియుఁగాక రణదులహాఖానుని యొక్కయు, నౌరంగజీబుచక్రవర్తియొక్కయు నాజ్ఞకు విరుద్ధముగ బ్రతిప్రయత్నము నొనర్చుట సరికాదు. ఇప్పుడు రణదులహాఖాను విచ్చవచ్చినట్లు కావింపనిండు. అతఁడు వెడలిపోయినపిమ్మట మరల నూతనాలయములఁ గట్టుకొందము." అని వారితోఁ జెప్పెను. ఇంతియే. ఇంతటి సంభాషణముతోనే వారికి సెలవు దొరికెను. ఇందుచే నోర్ఛానాగరికులనిరాశ పారము ముట్టెను. వారికి యోగ్యుఁడగుసహాయుఁడుగాని, మార్గదర్శకుఁడుగాని కన్పట్టుటలేదు. సూర్యోదయమప్పటినుండియే జనులు గుంపులుగుంపులుగఁ జతుర్భుజదేవుని యంతిమదర్శనాపేక్షులై యాలయముదెసకుపోవుచుండిరి. నగరమంతటను దుఃఖరోదనములు శోకధ్వనులు, సంతాపోద్గారములు, నాత్మనిందావాక్యములు విన్పించుచుండెను. ఆనాఁడు ప్రజ లన్నము ముట్టలేదు. ఇంకఁ గొలఁదిసేపటిలోఁ బరమకృపాఘనుఁ డగు చతుర్భుజభగవానునిదర్శనము లేకపోవుఁగదా యనువిచారకరమగుభావన యెల్లరి కసహ్యవేదనఁ గల్పించుచుండెను. ఇంతలో నలువైపులనుండియుఁ బ్రాణనాథస్వామి వచ్చెనను సందడి యయ్యెను. ఓర్ఛానివాసు లెల్లరిమనముల నాశాతంతువులుత్పన్నము లయ్యెను. ఇప్పుడు స్వామి యేమిచేయుచున్నాఁడో చూతమని ప్రజలెల్లరు నాలయముఁ జేరిరి. కొలఁదిసేపటిలోఁ బ్రాణ

సాధుప్రభునిచుట నగణ్యమగుప్రజాసమూహము నిండిపోయెను.

ప్రాణనాథస్వామి యొకయున్నతస్థానమున నిలువఁబడి యుచ్చైస్స్వనమున మాటాడఁదొడఁగెను. ఆసమయమున శాంతత్వము గురియుచున్నట్లుగ వినువారికిఁ దోఁచుచుండెను. ఇంతటిగొప్పసమూహముండినను బ్రజలెల్లరుఁ దదేకచిత్తులై ప్రాణనాథప్రభునియుపదేశామృతముఁ గ్రోలుచుండిరి. స్వామి యిట్లు చెప్పఁదొడఁగెను.

"సోదరులారా! బుందేలఖండమందలి సర్వవ్యాప్తమగు నేఁటి యీస్వాతంత్ర్యేచ్ఛ నామనసున కమితానందదాయకముగ నున్నది. స్వరాజ్యఫలముల నెల్ల రెఱింగినను నవిస్వరాజ్యవృక్షముననే యుండు నను మాట నెఱింగినవారుమాత్రము కొలఁదిగనే యున్నారు. కావుననే యనేకులు స్వవాంఛితఫలముల కాధారభూత మగునావృక్షమునే యజ్ఞానవశులై నఱికివేయ సంసిద్ధు లగుచున్నారు. కాని నేఁటి యీస్వాతంత్ర్యేచ్ఛ యద్భుతముగ నున్నది. మీమనసుల నావరించియున్నయీయావేశము నడఁచికొని, శాంతముగఁ గర్తవ్యాకర్తవ్యముల బాగుగ నాలోచించుకొని యుక్తమగురీతిఁ బ్రవర్తించెదరుగాక యని నాప్రార్థనము. దేశము యవనులవశమైననాఁటినుండియు మన మనేకబాధల పా లగుచున్నామనుమాట యథార్థమే యగును. కాని మనబాధలఁ దొలఁగించుకొనవలయు నన్న ముందుగ మనయంతఃకలహముల నడఁచుకొనవలయు నను మాట మీరు మఱవరాదు. ఇంతకాలమునుండియు వ్యక్తిసంబంధము లగువిరోధములను, స్వార్థపరత్వమును స్వాతంత్ర్యమార్గమున నడ్డముగఁ బెట్టి మనము స్వదేశము నధోగతిపాలొనర్చివైచితిమి. తన్మూలమునఁ గలిగినఫలముల నిప్పు డనుభవించుచున్నాము. ఏవిధమునఁ బ్రజ లభివృద్ధిఁ గాంచవలయు నన్ననుఁ బ్రభుత్వము స్వదేశీయమే యైయుండవలయును. పరదేశీయులప్రభుత్వమున

నేదేశము నభివృద్ధిఁ గాంచఁజాలదు. తనచేఁ జిక్కి[illegible] విధముల దుర్బల మొనరించి తద్దౌర్బల్యసాధనమున సాధ్యమైనంత యధికముగ స్వార్థసిద్ధిఁ బడయఁజూచుటయే వైదేశికపరిభుత్వస్వభావము. కావున రాజకీయస్వాతంత్ర్యమే దేశదౌర్బల్యవినాశనకర మగు దివ్యౌషధము. అంతఃకలహము లడఁగవలయును. ఐకమత్యము ప్రబలవలయును. జనులయాత్మ లన్నియు నొక్కమాఱుగ స్వాతంత్ర్యేచ్ఛామహాజ్వాలలచేఁ బరిదీప్తములు కావలయును. ఆమహాజ్వాలాగర్భమునఁ బరపరిభుత్వము కరఁగిపోవలయును. కావున నీరహస్యముల బాగుగ నెఱింగి స్వదేశధర్మరక్షణమునకై యాత్మగౌరవరక్షణ[illegible]యంతఃకలహముల నెల్ల నడఁచికొని బుందేలఖండస్వాతంత్ర్యమే బుందేలప్రజాకల్యాణమే మీమనసుల నధిష్ఠింపఁజేసి చతుర్భుజదేవజయాజయధ్వాన మొనర్చుచు నేకీభావబద్ధులై భావికాలమున జరుగఁబోవుస్వాతంత్ర్యయుద్ధమునకై సంసిద్ధులు గండు. పిఱికితనము వీడుఁడు. ధైర్యముఁ బూనుఁడు. భూమ్యాకాశముల నిండుచతుర్భుజజయజయధ్వానములచేతనే వింధ్యవాసినీజయజయకారములచేతనే స్వదేశస్వాతంత్ర్యరక్షణమునకై మాసర్వస్వము నర్పించి యావశ్యకమైన బ్రాణములనైన నర్పించుటకు వెనుదీయమని యైకకంఠ్యమున శత్రువుల కెఱింగింపుఁడు—

నేఁడు చతుర్భుజభగవన్మందిరము యవనులచే విధ్వస్త మొనరింపఁబడనున్నదని నేను వినినపుడు నాకుఁ గలిగినదుఃఖమునకు మేర లేదు. యవనుల కీవిషయమున నొకమాట నెఱింగింపఁగోరుచున్నాను. మీరు స్వధర్మప్రచారమునకై యిట్టిదౌర్జన్య మేల కావింపవలయును. ఈరీతి నన్యమతస్థులధర్మమునకు భంగ మొనరింపకుండ, నన్యమతస్థులప్రాణము లపహరింపకుండ శాంతమార్గముల స్వధర్మప్ర

చారము కాఁజాలదా! నోరుగలవానిదే రాజ్యమై, బలముగలవానికే నిరంకుశప్రపంచశాసనాధికార మైనచో నీలోకమందలి యేజాతిప్రజలు సుఖముగ జీవింపఁగలరు! క్షణక్షణవిపర్యాసములకు లోనగునీప్రపంచమున గుండెపైఁ జేయి వైచికొని "నాయధికారనైరంకుశ్యములు స్థిరములే యగు" నని యెవ్వఁడు చెప్పఁగలఁడు! అట్టిచో నితరులు గూడ మనయట్టిమానవులే యనియు, మనమే వారియవస్థలయందుండిన నట్టిబాధలకే లోనై యుండెడివార మనియు మీరేల తెలుపరు! హిందువునకుఁ దలపన్నా! మతాంతరుఁడు మీపరిపాలనమున జీవించుటకు, గాలిపీల్చుటకుఁ గూడ నర్హుఁడు కాఁడా? మాకే రాజ్యశాసనాధికార ముండి మేమే మీపై నట్టిపన్ను విధించిన మీరు సహింపఁగలరా! భారతదేశముననే నివసించుచు, భారతదేశమునఁ బండు పంటలనే యనుభవించుచు, భారతదేశనదీనీరములనే త్రాగుచు, భారతదేశసుఖదుఃఖములనెల్ల సమానభాగస్వాములమై యనుభవించుచుండు మనము, పరస్పరధర్మవినాశనము లేకుండ పరస్పరవిరోధముల మాని, "మనమెల్లరము భారతమాతృపుత్రులమే" యనుభావమున మైత్రితో నేల వసింపరాదు! అది యసాధ్య మెన్నటికిఁ గాగని యెఱింగి మీరు యుక్తరీతిఁ బ్రవర్తింతురుగాక!—

ఇఁకఁ బ్రభుత్వమున నొక్కమాట. ఈజీవితస్వాతంత్ర్యవిరోధము, ఈపరధర్మాసహనము, మతముపేర జరుగునీఘోరదురాచరణము, నీయలంఘిరుప్రభుత్వముననే తలయెత్తినవి. కాని, యక్బరు, షాజహాన్ మున్నగు వెనుకటియవనసార్వభౌములకాలమున నుండలేదని మీరెఱుంగుదురుగాక. సామాన్యప్రజ లొకవేళ మతావేశాంధులై యన్యులపై దురాచరణములకొడిగట్టినను, దేశరక్ష[illegible] వహించుచు నెల్లరిగొయ్యొద్దఁ బన్నులఁ గొనుచునుండెడిప్రభుత్వము యీ

రీతిఁ బక్షపాతము వహించి తనధర్మము వీడి యిట్టియన్యాయదురాచరణములకుఁ గడంగుట మిగుల హేయము. ఇట్టిఘోరదురాచరణములే యిటుపైఁగూడ సాగుచుండిన నీప్రభుత్వము చిరకాల[illegible]శించుట తప్పదనియు, నివి యన్నియు వినాశనలక్షణములే యనియుఁ బ్రభుత్వమువారు బాగుగ నెఱుంగుదురుగాక."

అంతట జాలమంది సావేశముగ నిట్లనిరి. "స్వాతంత్ర్యయుద్ధము నేఁడేయారంభింపనిండు. చతుర్భుజపరమాత్మాలయరక్షణమే తన్మంగళమహోత్సవారంభము కానిండు. తుదకు దీనిపరిణామముఁగూడ సుఖమయముగనే యుండును. మనము తప్పక విజయము నందెదము"

ప్రాణ—(గంభీరముగ) నేఁడే యుద్ధ మారంభింపవలయునని నేనాజ్ఞ యొసంగను. మీరు నాయకుడగుఛత్రసాలుఁడు దక్షిణప్రాంతమునుండి మరలివచ్చువఱకు వేచి యుండఁదగుననియే నేఁజెప్పెదను."

కాని, యీమాట లావేశపూరితు లగునోర్ఛావాసులకు రుచింపలేదు. చాలమందియవనసైన్యప్రతిఘటనమునకై సంసిద్ధులు కాఁజొచ్చిరి. అప్పుడుమరల స్వామి యిట్లనెను.

"నిలువుఁడు! నిలువుఁడు! నిరాయుధు లగుమీరు నిరర్థకముగఁ బ్రాణములర్పింప సంసిద్ధులు కాకుఁడు. మీయీయవిచారంపుదుష్పరిణామము కేవలమీయోర్ఛానగరమునకే కాక బుందేలఖండమున కంతటికి ననుభూత మగునని ముందుగ నెఱుఁగుడు. అటుపై ముందునకు సాగుఁడు."

ఇంతలోఁ జాలమంది యవనసైనికులు ప్రజలు తమ్ముఁ బ్రతిఘటించినందము ముచ్చవచ్చినట్లు పురమంతయుఁ గొల్లఁగొట్ట నవకా

[illegible] గదా యని యెంచి యట వచ్చి సగర్వముగ సంచరిం [illegible] ఎవ్వోచ్చజవామెన్నఁడు స్నానమాడి పవిత్రులు కాకుండ నడుగిడరో యట్టిస్థానములు మద్యోన్మత్తులగు యవనుల పాదతాఘాతములపాలగుటఁ గాంచి బుందేలులనేత్రములు క్రోధారుణితము లయ్యెను. వారియావేశ మినుమడింపఁజొచ్చెను. ఇదంతయుఁ జూచి ప్రాణనాథస్వామి యిట్లనెను.

“ సోదరులారా ! మీరీసమయమున శాంతి వహించి యుద్రేకము మానియుందురుగాక. ఎట్టిసాహసకార్యమునకుఁ గడంగకుందురుగాక. ఇది నాప్రార్థన. మీకు నాపై గౌరవ మున్న, భగవంతుఁడే సకలచరాచరప్రపంచసంరక్షకుం డనియు, ధర్మరక్షణపరుఁ డనియు, మీకు సంపూర్ణమగు విశ్వాస మున్న, మీరు నామాటఁ బాటింపుఁడు. శాంతి వహింపుఁడు. అప్పైనఁ జతుర్భుజదేవమందిర మసంఖ్యాకులగు యవనులు వచ్చినను విధ్వస్తము కాఁజాలదు. భవిష్యత్కాలమున రాఁబోవుస్వాతంత్ర్యయుద్ధమున మీయుద్రేకముఁ, బరాక్రమముఁ జూపుటకుఁ జాలినంతయవకాశ మున్నది. ప్రాణము లర్పింపదగునావశ్యకత యున్నది. దాని కిది తగుసమయము కాదు.”

ఈమాటలను వినఁగనే యెల్లరు నెట్లో నిర్బంధమునఁ దమయుద్రేకమునణఁచుకొని నిశ్శబ్దముగఁ గూరుచుండి యుండిరి.

ఇంతలో నున్మత్తుఁ డగునొకయవనసైనికుఁడు ముందునకు వచ్చి మిగులమోటుదనమునఁ బ్రాణనాథస్వామితో నిట్లనియె. “ ఓరీ ! నీవెవఁడవు ! ఇచ్చటనింతటిసమూహము నేల కూర్చి యుంచితివి ? నీవు మహాద్రోహివిగఁ గన్పట్టుచున్నావు. ప్రజలను బాదుషావారికి విరుద్ధముగఁ బురికొల్పుచున్నావు ! కలది కలయట్లు నుడువుము. నీవెవఁడవు ! ఇప్పుడు వీరితో నేమి చెప్పుచుంటివి ! ”

ప్రాణనాథస్వామి యొక్కమాటయైన నాడలేదు. శాంతగభీరుఁడై నిలువఁబడి యుండెను. ప్రాణనాథుని యాశాంతిగాంభీర్యములఁ గాంచి యాయువసైనికుఁడు మనసున మిగుల నసహ్యించుకొని కత్తి దూసి, " ఓరీదౌర్భాగ్యుఁడా! నేను నిన్ను ప్రశ్నించుచుండ నీవు మాటాడక గర్వముఁజూపుచున్నావా! ఆఁగుము. నేను నీయాగర్వమునకు, దౌష్ట్యమునకు, విద్రోహమునకు ఫల మనుభవింపఁజేసెద" ననుచు నాతనిఁజంప ముందునకు వచ్చెను.

అంతట గభీరుఁడై ప్రాణనాథస్వామి యిట్లనియె.

" బుందేలఖండము స్వతంత్రమగువఱకు నేను మరణింపఁజాలను. నీవు నన్ను సమీపింపకుము. అవతలనే దూరమున నిలువఁబడుము. నీయట్టి త్రాగుబోతుల నేముట్టను. (కసరుచు) నీవు దూరముననే యుండుము."

ప్రాణనాథస్వామిమాటల నెట్టిమాయ యుండెనో కాని యాయువనుఁడు నిజముగ రెండడుగులు వెనుకకు వైచెను. వాఁడు వెనుకకుఁ బోవుటఁ గాంచి యోర్ఛానివాసులు ప్రచండప్రాణనాథజయజయధ్వానములఁ గావించిరి. అంత రణదులహాఖానుఁడేయైన యాయువనుఁడు కొంచెము కోపముతో తనప్రక్కనే నిలువఁబడియున్న మఱియొకనితో నిట్టులనియె.

" ఓయీ! కాసిం! చూడుము. ఈద్రోహిని దండింప ఫిదాయీఖానుఁడు తనసైన్యము వెంటఁగొనివచ్చుచుండనోపు. నీవీక్షణమ పోయి యాతని వెంటఁగొని శీఘ్రముగ రమ్ము. విద్రోహియగు సన్న్యాసిప్రాణనాథుఁడు పట్టువడినాఁడని నీవతనితోఁ జెప్పుము. శీఘ్రముగఁ బొమ్ము. ఓసన్న్యాసీ! నీవీక్షణమ వీరి నందఱి నిటనుండి తొలఁగింపుము. లేకున్న నీయెదుటనే వీరినందఱి నంతమొందించెద"

[illegible]సులు ప్రాణనాథస్వామికైన యీపరిభవము [illegible] వాఁడు రణదులహాఖానుని ముక్కలుముక్క లుగ నఱికివేయుటకై వానిపై దుముకనుండ స్వామి మిగులఁ గష్ట మున వారిని సంజ్ఞచే వారించెను. కాని స్వయముగ వానిమాటకుఁ బ్రత్యుత్తర మొసంగలేదు.

కొలఁదిసేపటిలో నాయుధహస్తు లగు పెక్కండ్రు సైనికుల వెంట నిడికొని ఫిదాయిఖానుఁ డటఁ జేరెను. వానిని జూడఁగనే రణదులహా ఖానుఁడు మరల మహాక్రోధమునఁ బ్రాణనాథస్వామితో నిట్లనియె.

‹‹ ఓసన్న్యాసీ! నీవు బుందేలఖండమం దంతట విద్రోహము వ్యాపింపఁ జేయుచున్నా వనియుఁ, బ్రజలను బాదుషావారికి విరుద్ధ ముగఁ బురికొల్పుచున్నా వనియు నేను విని యున్నాను. కావున నీజీ వనము నంతమొందింపవలయునని నేఁగోరుచున్నాను.

ప్రాణ—(మిగుల శాంతముతో) కాని బుందేలఖండమునుండి యవనాధికారము నెగురఁగొట్టువఱకు నేను మరణింపఁజాల నని మొద టనే నీతో నుడివియుంటిని.

రణ—శాయిచ్ఛకు విరుద్ధముగ జీవించియుండ నీ వెట్లు సాహ సింపఁగలవు? ఫిదాయిఖాన్! వెంటనే యీయయోగ్యునికంఠము నెగురఁగొట్టుము.

కాని తేజస్వంత మగుప్రాణనాథునిమొగముఁ జూచిన ఫిదా యిఖానున కాతనిపైఁ జేయి సాగింప సాహసము లేకుండెను. అతఁడు తనసేనాని నొకనిఁజూచి యిట్లనియె.

‹‹ హైదర్ ఖాన్! ఒక్కవ్రేటున నీజోగిశిరమును శరీరమునుండి వేఱుసేయుము.

రణదులహాఖాను తనకప్పగించినకార్యము ఫిదాయీఖానునకు హైదరున కప్పగించుటఁ గాంచి ప్రాణనాథస్వామి మందహాస మొనరించెను.

మందహాసమున గభీరుఁడై యున్న ప్రాణనాథునిఁ జూచి హైదరు తనసహచరుఁ డగునొకనితో నిట్లనియె.

«మహమ్మద్ ఖాఁ! తల వ్రేలవైచి చూచుచున్నా వేమి! ఖానుగారియాజ్ఞ నెఱవేర్చి యీకాఫరుకంఠమును తొక్కికొన్నపొత్తు వలె నఱుకఁగొట్టుము.»

పాప మామహమ్మదుఖాను మిగుల వ్యాకులపడెను. వాఁడెవనితోఁ జెప్పనేగును! కావున గతిమాలినవాఁడు హైదరుఖానునితో నిట్లనియె:—«బాగున్నది! మీరుండఁగనే నేనొక్కవిద్రోహిశిరము నఱుకఁగొట్టుదునా! నేనెన్నఁడు నట్టియవిధేయత నొనర్పఁజాలను. మీరించుకయైన సంశయింపక నేలపైఁ దలక్రిందుగఁ బడునట్లు ఈనిర్భాగ్యునికంఠముపై నొక్కవ్రేటునేయుఁడు.»

హైదరుఖాను మఱేమియుఁ జెప్పఁజాలక ఫిదాయీఖానునిఁ జూచి యిట్లనియె:—«మహాశయా! ఇట్టిగొప్పగొప్పవిద్రోహులఁ జంపుట తమవంటినాయకులకు శూరులకుఁ దగినకార్యము. పాప మీ సామాన్యసైనికు లిట్టిసాహసకార్యము నొనరింప నెట్లు చాలుదురు.»

అంత ఫిదాయీఖానుఁడు మాటాడక రణదులహాఖానునిఁ జూడసాగెను. ప్రాణనాథునిపైఁ జేయియెత్తుట సామాన్యకార్యము కాదని యిప్పుడు రణదులహాఖానునికిఁ దెలియవచ్చెను. తన్మూలమున నతఁడు మనసున నెంతయసహ్యించుకొన్నను నేరితోడ నేమియుఁ జెప్పఁజాలఁ డయ్యె. ఎవనిపైఁ జేయియెత్త నేనే సాహసింపఁజాలకుంటి నట్టివానిని సామాన్యసేనానులు, సైనికులు నెట్లు చంపగల్గుదు రని యతఁ డెం

చెను. చంపతరాయలచెఱనుండి విడివడిననాఁటినుండియు నతఁడు నిరపరాధులగు హిందువులకంఠముల ఖండించుటయే తనకర్తవ్యమని నిశ్చయించుకొనియుండెను. ఏకమాత్రకృపాణధారచేతనే యాతఁడింతదనుక ననేకహిందూమస్తకముల ఖండించి యుండెను. మఱియు నాతఁడాకార్యమును బాగుగ నభ్యసించి యుండెను. కాని ప్రాణనాథునిపైఁ గత్తినెత్త నాతనికి ధైర్యము చాలకుండెను. తన్మూలమున మనసున నతఁడు మిగుల లజ్జితుఁ డయ్యెను. మిగులఁ గష్టమున సాహసించి యధరము బాగుగ దంతములచే బాగుగ, నణఁచిపట్టి స్వకోపము నుగ్రముగ నొనరించి శరీరమునందలి బలమంతయు నేకత్రముఁ గావించి ముందునకు సాగి స్వామిపైఁ ఖడ్గమెత్తఁ జేసెను. కాని ప్రాణనాథస్వామి ప్రతిఘటనప్రయత్న మేమియు నొనర్పక శాంతుఁడై పర్వతముభాతి నిశ్చలుఁడై నిలువఁబడి యుండెను. అంతట చేతనెత్తి స్వామిపై వేయఁబోవునంత, శీఘ్రవేగమున సుందరి యగునొకబాలిక యచటికేతెంచి రణమస్తఖానుని హస్తముఁ బట్టుకొని యిట్లనియె.

“రణమస్తఖాన్ ! నీవెట్టియన్యాయ మొనరించుచున్నావు ! ఈమానవుఁ డెవరో నీ వెఱుఁగుదువా ! జాగ్రత్త. ఇఁకముందైన నిట్టికార్యముఁ జేయకుము.”—మిగులఁ గ్రోధమున ఖానుఁ డామెకరము విదళించి యిట్లనెను.

“ఓసీ ! మూర్ఖబాలా ! నీవెవ్వతెవు ! నీదురదృష్టము నిన్నిట కీడ్చుకొనివచ్చినట్లున్నది. నడువుము. దూరముగఁ దొలఁగుము. లేకున్న నీఖడ్గము ముందుగ నీరక్తముతోఁడనే తనదాహముఁ దీర్చుకొనఁగలదు”

ఆబాలిక సహాసముగ నిట్లు వచియించెను.

“రణమస్తఖాన్ ! కొంచెము తెలివిఁదెచ్చుకొమ్ము. కన్నులఁ

దెఱచి నేనెవ్వతెనో ముందు బాగుగఁ జూచు మటుపై నిట్టినిర్ధకవచ నము లాడవచ్చును.''

స్వామిసంరక్షణమునకై దేవత యెద్దియే స్వయముగ వచ్చి యుండవచ్చునని ప్రజలెల్లరుఁ దలఁచుచుండిరి. తనకై యింతటికష్ట మంది యచటి కేతెంచిన యీబాలిక యెవతెయో, యెఱుంగ స్వామి యు నుత్కంఠఁ గొనియుండెను. ఎల్లరు సాశ్చర్యముగ నాసుకుమారిం జూచుచుండిరి,

రణదులహాఖానుఁ డామెం జూచి యిట్లు చెప్పెను. ఈబాలి కకుఁ బిచ్చియెత్తిన ట్లున్నది. లేకున్నఁ బ్రాణములు బరువయ్యెనో! నీకు నీప్రాణలముపై మక్కువయున్న నాయెదుటినుండి తొలఁగిపొమ్ము. నిన్ను మరల నేనాజ్ఞాపించుచున్నాను. లేకున్న నొక్కదెబ్బతోనే నిన్నంతమొందించినై చెదను.''

బాలిక కధికతరమగునావేశము గలిగెను. ఆమె తీవ్రముగ నిట్లనియె. ఓయయోగ్యుఁడా! తెలివి దెచ్చుకొని కన్నులఁ దెఱచి నేనెవ్వతెనో చూడుము. రాజకుమారి యగుబదరున్నీసా యీక్షణ ముననే ససైన్యముగ నిటనుండి వెడలిపోవ నీకాజ్ఞ నొసంగుచున్నది.''

రాజపుత్రి యగుబదరున్నీసానామము వినఁగనే రణదులహాఖా నునికిఁ గొఱతవేసిన ట్లయ్యెను. కోసిన రక్తము కానరాదు. వానిమొ గము వెల్లనయ్యెను. గజగజ వణఁకుచు నాతఁ డంజలి యొనర్చి రాజ పుత్రియెదుట నిలువఁబడియెను—భయకారణమున వానిముఖము నుండి యొకమాటయైన వెలువడలేదు. రాజపుత్రి వానినిఁ గాలఁ దన్ని యిట్లనియె:—

''ముందుగ నీమహాసీయుల మన్నింప వేడుకొనుము. వారు నిన్ను క్షమించిన నేను క్షమింతును.''

రణదులహాఖానుఁడు రాజపుత్రి యాజ్ఞను యథాయోగ్యముగఁ పాలించెను. స్వామియు మిగులసంతసమున క్షమించివైచెను. అతఁడు [illegible]టనుండి వెడలునప్పుడు బదరున్నీసా యతనితో నిట్లనెను:—

"చూడుము! నీవు ఢిల్లీసార్వభౌముని ప్రజవు. సార్వభౌముని కపఖ్యాతిఁ దెచ్చుకార్యము దేనినిజేయఁగూడదు. సామ్రాజ్యస్థితి యంతయుఁ బ్రజలపై—నందు 'విశేషముగ హిందూప్రజలపై నున్నది. మరియు హిందువులు మొదటినుండియు న్యాయబుద్ధులు, విశ్వాసపాత్రులునై యున్నారు. వీరిపై నెన్నఁడు నెచ్చట దౌర్జన్యము నెఱపరాదు. వీరియెడ దయాపూర్వకము, నుత్తమము నగు ప్రవర్తన [illegible] బ్రోత్సాహింపఁజేయ సంసిద్ధు లగుదురు. [illegible] మిగుల నయుక్తము. వీరియెడ సత్ప్రవర్తన[illegible]న్నఁడుఁ గష్టములఁ గల్పింపరు. ఎల్లవేళల [illegible] నాయుఁడీరాజ్యమున శాంతిస్థాపన మొనరింతురు. వీరు క్రోధించిరేని భారతదేశమున యవనసామ్రాజ్యవినాశనమే యని తెలియుఁగుఁడు. అన్యాయాచారుల భగవంతుఁ డసహ్యించుకొను ననియు జ్ఞప్తియం దుంచుకొనుఁడు. అన్యాయదౌర్జన్యములకు భగవంతుఁ డెన్నటికి సమ్మతింపఁడు. నీయాదురాచరణములమూలమున బాదుషావారికిఁ గడు నపఖ్యాతి కలుగుచున్నది. జాగ్రత్త. ఇంక ముందెన్నఁడు నిన్నిహపరములరెంటఁ బాపాత్మునిఁజేసివైచు కార్యము దేనిని నొనరింపకుము. పొమ్ము. నీకార్యమున నుండుము."

రణదులహాఖానుఁడు సైనికుల వెంట నిడికొని నిశ్శబ్దముగ నట నుండి వెడలిపోయెను. పోవుతరి నతఁడు రాజపుత్రికిని బ్రాణనాథస్వా

మికిని వినయపూర్వకనమస్కారము లొనర్చెను. నగరవాసు లెల్లరు
ననూహ్యమగురీతినిజచతుర్భుజాలయమునం, బ్రాణనాథుఁడు రక్షింపఁబ
డుటఁ గాంచిభగవానునికి బదరున్నీసాకుఁ గృతజ్ఞత నొసంగుచు స్వా
మియాజ్ఞఁ గొనితమతమయిండ్లకు వెడలిపోయిరి. అటుపై నీనాఁడు
మరియేవిశేషసంఘటనము జరుగలేదు.

వివాహప్రయత్నముల నిమగ్నయైయున్నహీరాదేవికిఁ జతు
ర్భుజాలయ మింకను గూల్పఁబడలేదని యెఱింగినంత నచ్చెరువు జనిం
చెను. ఇంతలోనే రణదులహాఖానువివాహనము మరలివచ్చిన దని
యామెయెఱిఁగెను. ఆమె యచ్చెరము మఱింత యధిక మయ్యెను.
ఔరంగజేబుచక్రవర్తి కొమరితె స్వయముగఁ దనపత్త్రమున కేతెంచి
చతుర్భుజదేవాలయము విధ్వస్తము గాకుండఁ గాచినదని యామెకుఁ
దెలిసినప్పుడు తనయౌదాసీన్యమునకై యామె యత్యంతలజ్జిత య
య్యెను. అట్లయ్యు నామె ఛత్రసాలుని విధ్వంస మొనరించి యటుపై
ముసల్మానులదురాచరణమును బ్రతిఘటింపఁబూనెద నని తలఁచి
సంతృప్త యయ్యెను. ఇంతకన్ననధికముగ విచారించుట యనావశ్యక
మని యెంచి యామె మరలఁ దనకుమారునివివాహోత్సవప్రయత్న
ముల నిమగ్న యయ్యెను.

... ... ... ... ...

వింధ్యవాసినీధ్యానతాత్పర్యమున మునిఁగియుండుటచేఁ బ్రాణ
నాథస్వామికి నర్ధరాత్రి యెప్పుడు గడచినదియుఁగూడఁ దెలియదాయె.
ధ్యానము వీడినపిమ్మట సూర్యభగవానునికతనశౌనన మంతయొం
డపనుపచల్లనియేలుబడి చాలకాలమునుండియే యారబ్ధమైయుం
డుటఁ దనయనుటగాంచెను. ప్రాతఃకాలమునఁ దనయెదుట నుండిన
వారెల్లరుఁ దొలఁగిపోవుటయుఁ, జతుర్భుజదేవాలయమూ యథావిధ

మున నుండుటయువింధ్యవాసినియే ప్రత్యక్షముగ సాంజలియై తనయెదుట నిలువఁబడి యుండుటయుఁ గాంచి యాతఁడు మిగుల నచ్చెరువందెను. చిత్రకూటనివాసిని యగువింధ్యవాసిని గర్భోజ్జ్వలమూర్తి [illegible] మందిరమును దివ్యాయుధమునువీడి యట కేలవచ్చెనో, యున్నతాసనమునఁ గూరుచుండి భక్తులసేవల నందెడిదేవి సాంజలియై యింతటి నమ్రభావమునఁ దనయెదుట నేల నిలువఁబడియుండెనో, ప్రథమమున నాతఁ డెఱుంగఁడయ్యె. అతఁడు సవినయముగ ‹‹ జగజ్జననీ ! వింధ్యవాసినీ ! ఈసేవకునికి నీయాజ్ఞ యేమి ? ” యని యామూర్తి నడుగనుండెను. ఇంతలోఁ గొంతసావధానతతోఁ జూచితనయెదుట రాజపుత్రి యగుబదరున్నీసా నిలువఁబడి యుండుటఁ గాంచెను. ధ్యానస్థుఁ డగుటకు వెనుకటిచిత్రము లన్నియు నాతనిమనశ్చక్షువునెదుటఁ బ్రత్యక్షము లయ్యెను. అప్పు డాతఁ డాబాలికయున్నతోన్నతాశయములఁ బ్రశంసించుచు నిట్లు నుడివెను.

‹‹ బొగ్గుగనిలో వజ్రము పుట్టినట్లు, కంటకావృత మగుపరణ్యమునమనోహరమగు గులాబిపువ్వు పుట్టురీతి, వివిధభీకరజంతుమయమగునదినుండి యుత్తమతేజస్వంత మగువజ్ర మెల్లజ్వలించుచున్నదో యట్లే [illegible] దేవివగుచు పుష్పమంటితివి. [illegible] గుణములు నిశ్చయముగ దేవగుణములతోఁ బోలినవి. నేను నిన్నిప్పుడు దేవతవని యెంచియే సంబోధింప నుంటిని. ధైర్యగుణ యఁడగు — [illegible] నీయట్టిదే యగు [illegible] కన్యా [illegible] శ్రీరామచంద్రుని యర్ధాంగియగుసీతాదేవియు లంకా [illegible] యేయని చెప్పుదురు. మంచిది. నీవిక్లింటి [illegible] చెప్పుము.

బద — స్వామి ధ్యానస్థులై నప్పటినుండియు —

ప్రాణ—ఇట్టికోమలతనువును నేను నాలుగుజాములవఱకు నిలిపి యుంచితినా! సుకుమారీ! నీకోమలచరణములు బాధపడుచుండెనో? కూర్చుండి నీయీశరపతనశ్చరణమునకుఁ గారణమేమో నా కెఱింగింపుము.

స్వామిదూనతి నంది ఉదయున్నసా నేలపైఁ గూరుచుండి బహువినయమున నిట్లనియె:—"ప్రభూ! మీరు జ్ఞానులు. సర్వజ్ఞులు. వర్తమానకాల మనుగురుయవనికాంతర్గుప్తమగు భవిష్యత్కాలము మీదివ్యదృష్టిమూలమున మీకువిస్పష్టమై కానబడుచుండును. శ్రీకరములుఁ, పవిత్రములు నగుమీవాక్యములమూలమున బుందేలఖండస్వాతంత్ర్య మెప్పుడు లభియించునో యనిమాత్రము, సెలవిఁగోరుచున్నాను."

ప్రాణ—నేను దివ్యదృష్టి గలవాఁడను గాను. రహస్యజ్ఞాని నను నభిమానముగూడ నాకు లేదు. అయినను బుందేలులమానసికావస్థ సావధానముగఁ బరికించినవాఁడ నగుటచే బుందేలఖండస్వాతంత్ర్యము మిగులదూరమున లేదని నేను చెప్పుచున్నాను. కాని ఢిల్లీసార్వభౌమునికో మరితే కింతటిబుందేలఖండస్వాతంత్ర్యచింత యేల! తత్కాలము నెఱుఁగుటకే యీమె నాల్గుజాములవఱకు నిలువఁబడి యుండ నేమియావశ్యకత యుండెఁ?

బడ—నాయైహికజీవనంపుసుఖమయత్వము గాని, దుఃఖమయత్వము గాని సంపూర్ణముగ బుందేలఖండస్వాతంత్ర్యనిర్భరమై యున్నది! స్వామీ! స్వతంత్రబుందేలఖండము నేనెన్నటికిఁ గాంచఁగల్గుదును?

ప్రాణ—బహుశీఘ్రకాలమున—మాసచతుష్టయమున నే! బుందేలఖండమునుండి యవనసత్త్వ మంతర్హితమై యిచ్చటిప్రజలు

స్వతంత్రు లగుదురు. ఢిల్లీశ్వరునిశక్తి యత్యధిక మగుట బుందేలుల స్వాతంత్ర్యవినాశనప్రయత్న మొక్కటియు మిగుల్పఁబడదు. అట్లయ్యు బుందేలుల కొక్కవరి స్వాతంత్ర్యము లభించిన వారు తద్రుచి నెఱింగిన వన్యులెవ్వరు దాని సహింపఁజాలరు. నాఁడు నేనుస్వాతంత్ర్యప్రయత్నమునకై సంసిద్ధుల నొనర్చితిని. [illegible]నారగునాయకులను, రాజకుమారులను ఛత్రిసాలు[illegible]గరదేశవుయుతరాజగు దలపతిరాయలు దేశము [illegible] యున్నాఁడు. చంపతరాయలు స్వర్గవాసి యగుటచేఁ దత్పూర్వమాలిన్యమెడను, దశాశయములమెడను, దమకుఁగలద్వేషభావమును బ్రజలు వీడినారు. ఈ కారణముననే ఛత్రిసాలుఁడు స్వాతంత్ర్యకేతనస్థాపన మొనర్పఁగనే యెల్లరురాజకుమారులు సేనానులుఁ, దచ్ఛాయాగతులుఁగా సంసిద్ధులై యున్నారు. ఇంతియకాక హీరాదేవియు నామెభక్తులగుమువ్వురునలువురు కంచుకిరాయలఁబోలువారు తప్ప తక్కంగలనరపతులెల్లరు సర్వవిధముల ఛత్రిసాలునికి సహాయభూతులై బుందేలఖండమును స్వతంత్రమొనర్ప నున్నారని దలపతిరాయ లనుచున్నాడు. హీరాదేవికుమారుఁ డగువిమలదేవుని నమ్మతింపఁజేసి యతనిఁదనపక్షమునఁ గొన దలపతిరాయలు నేఁడిటకు రానై యుండెను. విమలదేవునిఁగూడి యతఁ డిట రావలసియే యుండెను. ఇంతదనుక నేలరాఁడయ్యెనో యెఱుఁగరాదు.

బద—(ప్రసన్నయై) సాగరయునబా యిప్పుడే యిటకువచ్చునా!

ప్రాణ—అగును. బహుశః అతఁ డిప్పుడే వచ్చుచుండనోపు. నీకతనితో నేఁటిపరిచయము!"

బదరున్నీసావదనము లజ్జారుణితము కాఁజొచ్చెను. ఆమె కొంచెము మాఁగియిట్లుచెప్పెను.

"అతనితోడిపరిచయముఁ బోలుపరిచయము ముల్లోకముల మఱియేరితోడను నాకులేదు."

ప్రాణనాథస్వామికి మిగుల నాశ్చర్యము గలిగెను. అతఁ డేది యో ప్పనుండ నింతలో దలపతిరాయ లచటి కేతెంచి తనశిరము స్వామిచరణములఁ జేర్చెను. అతనిఁ బ్రేమముమిగుల లేవనెత్తుచు స్వామి యిట్లనిగెను:—"దలపతీ! ఈబాలికను నీవు గుర్తించుచు న్నావా?"

చిరకాలమునకు నేఁడిరువురినేత్రములు సమ్మిళితము లయ్యెను. హఠాత్తుగ బదరున్నిసా నటఁ గాంచి దలపతిరాయ లధికాశ్చర్యమగ్నుఁ డయ్యెను. దలపతిరాయలదర్శనమున బదరున్నిసాయానందమునకు మేర లేకుండెను. తనయచ్చెరువు కొంత తగ్గినంతనే దలపతి యిట్ల నెను:—

"నేనీబాలికను గుఱుతించునట్లు ముల్లోకముల మఱియెవరు గుర్తింపనేరుఁగ?" ప్రాణనాథస్వామి సరళభావమున నిట్లువచించెను:—

"ఇట్టిదేవితోడిపరిచయము మహాభాగ్యము. నేటియుద్ధ మున రణదూలహఖానుఁడు నాప్రాణముల హరించి యీయాలయ మును విగ్రహములను విధ్వస్తములఁ గావింపనుండ నీయుదారయగు బాలిక యడ్డుపడి మమ్ముఁగాపాడెను. ఈకుమారి తాను ఢిల్లీశ్వరుని పుత్రిక నని చెప్పకొనుచున్నది. కాని యీమె తనసుగుణములతో బుందేలఖండమందలిమహద్వంశసంజాత లగు రాజకుమారికలఁగూడఁ బరాభూతలఁ గావించుచున్నది. నిష్కలంకము లగునీమెసుగుణసౌం దర్యములఁ గాంచిన నీమె యొకసామాన్యబాలిక కాక యసామాన్య యగుదేవి యని తోఁచును. దలపతీ! ఈమె బుందేలఖండమునకుఁ బరమశత్రు వగువానికొమరితె యయ్యు, బుందేలఖండస్వాతంత్ర్య

చింతఁదగిలియున్నది. అసురవిధ్వంసిని యగు దేవయానియో, జానకియో యనఁదగు."

దలపతిరాయ లిట్టిమంచియదనును బోఁగొట్టునా! అతఁడు శీఘ్రముగ నిట్లనెను.

"అసురకన్య యగు దేవయాని దేవకుమారుఁడగు కచునికరగ్రహణ మొనర్పయత్నించెను. మఱి యాజానకియో, శ్రీరామచంద్రుని యర్ధాంగియై త్రైలోక్యధన్యతఁ గాంచెను. అట్లే యీయవనకన్యకయు నేబుందేలరాజకుమారునైనఁ బెండ్లియాడఁ దలఁచిన నందేమియపరాధ మేమియు లేదుకదా?"

ప్రాణ—సాధారణముగ నేఁటియవనయువకులు నైతికముగ నత్యంతాధఃపతితులై యున్నారు. ఈబాలిక పవిత్రాంతఃకరణమును, సుగుణములను, కోమలబుద్ధినిఁ గాంచిన హిందూయువకుఁడే యీమె కనురూపుఁ డగుపతి యగునని తోఁచుచున్నది.

బద—(గద్గదస్వరమున) స్వామీ! ఉన్నతవంశసంజాతుఁ డగు నేహిందూయువకుఁడైన నన్నుఁ బరిణయమాడ మాటయిచ్చినఁ దత్కార్యము నిందనీయము కాదుగదా!

ప్రాణ—(సోద్రేకముగ) బదరున్నిసా! నీవు నీతిపవిత్రతామాంగల్యములయాకారమవు. నిన్ను గ్రహించిన నమరులు గూడ ధన్యులగుదురు. ఇంక మానవులమాట యనుగనేల! నిన్ను గ్రహింప సంసిద్ధుఁడై యున్నభాగ్యశాలియగు నాహిందూయువకుఁ డెవఁడు?

బదరున్నీసా సలజ్జయై దలపతిచరణముల దెసఁజూడఁదొడఁగెను.

ఇంతసేపటికిఁ బ్రాణనాథస్వామి కన్నివిషయములుఁ దెలిసెను. రహస్యమంతయు నాతనికి బోధపడెను. ప్రథమమున నతనిముఖము

కొంచెముగ వ్యాకులిత. మయ్యెను. తరువాత చంచల మయ్యెను. తుదకు విచారమగ్న మయ్యెను.

దలపతిరాయలును స్వామికి సంపూర్ణముగ విచారింప గడువో సంగవలయునని యెంచి యిట్లనియె:—"ప్రభూ! ఛత్రసాలుఁ డచిర కాలమున బుందేలఖండముఁ జేరును. జయసింహునిసైన్యము ఛత్ర సాలునిపరాక్రమముచే మూలమున విజయమై ఢిల్లీకిఁ బోయినది. మహా త్ముఁ డగుశివాజీని దర్శింప ఛత్రసాలుఁడు దక్షిణప్రాంతమున కేగి నాఁడనియు శీఘ్రకాలమునఁ దద్దర్శనముఁ గావించుకొని యతఁడు బుందేలఖండమునకు మరలి వచ్చుననియు నాకుఁ దెలియవచ్చినది. ఛత్రసాలుఁ డిట రాఁగనే స్వాతంత్ర్యసమరారంభ మగుచుగదా! భావివింధ్యవాసినీమహోత్సవమునాటికి బుందేలఖండమున స్వాతం త్ర్యపతాక యెగురుచుండునట్టిప్రయత్న మొనర్పనగును."

ప్రాణనాథస్వామి ప్రముదితాంతఃకరణమునఁ గంపితుఁ డయ్యె ను. కొలఁదిసేపటికి స్వామి ప్రాతఃస్నానాదులకై బేతవానదీదిశ కేగెను.

ఆసమయమున దలపతిరాయలు ఖదరుస్సీసా నిట్లడిగెను. "రా జకుమారీ! ఢిల్లీయందలి రాజమందిరసౌఖ్యముల వీడి, నీవీబుందేలఖండ మున కెప్పుడు వచ్చితివి!"

బద—యమునాతీరమున మీతోడిసంభాషణమునకుఁ బూర్వ మే రాజమందిరసుఖములచే నామనసు నిండిపోయి యుండెను. నేవాం ఛించినసుఖము నందుటకే ప్రాసాదసుఖముల వీడనయ్యెను. సాధ్యమై నంతవఱకు నేను మీకార్యమున సాయ మొనరించెద నని మీతో నుడివియుంటిని. అందులకే రాజమందిరమునకు మరలి పోయితిని. అదనెఱింగి నేను పాదుషావారికి బోధించి బుందేలఖండము స్వతంత్ర

మొనర్ప వారు సమ్మతించునట్లుకూడఁ జేసితిని. కాని యాసమయము ననే లేచి వారు రోషనారమందిరమునకు వెడలిరి. అచ్చటరోషనార కొన్నివిరుద్ధవాక్యము లాడుటచే వారియాశయము మరల విపర్యస్తమై మొదటియట్లు మరల బుందేలఖండమునకు వైరులైరి. ఆనాఁడే నావిశ్వాస మంతయు నశింపఁదొడఁగెను. రాజమందిరమ్ములను వీడి మిమ్ము వెదకుచు నిట కేతెంచితిని.

దల—(సప్రేమముగ) నీసౌందర్య మెంతటియుత్తమమో నీసుగుణము లంతటియుత్తమములు. బంగారమున సుగంధ ముండదని ప్రజ లాడుదురు. కాని నీవు బంగారమై యుండుటయు, గంధవతివై యుండుటయుఁగూడఁ నేఁగాంచుచున్నాను. సువర్ణము నీసౌందర్యము. సుగంధము నీసుగుణములు. ఇంక నీకవిశ్వాస మక్కఱలేదు. బుందేలఖండ మతిశీఘ్రకాలమున స్వతంత్రతఁగాంచును. ఛత్రసాలుఁడు బుందేలఖండమునఁ బ్రవేశింపఁగనే యొక్కొక్కబుందేలుఁడు నాయుధహస్తుఁడై కానఁబడును. ఆసమయమున నొక్కక్షణమున బుందేలఖండమునుండి యవనశాసన మెగిరిపోవును.

బద—మఱి యప్పుడు!

దల—మఱి యప్పుడు సంపూర్ణముగ నేను నీవాఁడనై పోవుదును.

అటుపైఁ జాలసేపటివఱకు వారిప్రేమాలాపము సాగుచుండెను.

కాని మేమిప్పు డాప్రేమాలాపముకన్న నధికతరమహత్త్వపూర్ణములగు సంఘటనములకడకు పాఠకులఁ గొనిపోవలయును.

---

## ఇరువదినాల్గవప్రకరణము

శివాజీతో సమావేశము

పర్వతమహాగర్భమున జన్మమొందు భిల్లకన్యక లెవ్విధమునఁ దమజీవనమంతయుఁ దత్పర్వతతటవిహారములనే పుచ్చుచుందురో, ఋషికన్యకల కేవిధమునఁ దమతపోవనము వీడి స్థలాంతరమునకుఁ బోవ మనసురాదో, విశాలనేత్రములు గలహరిణులు, తనుమధ్యములు గల సింహాంగనలు, మంజులగమనము గలహంసవనితలు, మధుర రుతములు గల కోకిలలు నేపగిది నొక్కట్టుమ్మడి జనసంఘమున నడు గిడ నొల్లకుందురో, యట్లే హిమాలయము, వింధ్యాచలము, సహ్యాద్రి మున్నగు గంభీరజనకగృహముల జననమొందు కన్యకలుగూడ వనవాసముననే తమయధికజీవనభాగమును గడపుచుందురు. "నేనర ణ్యవాసినిని. వన్యకుసుమములుదక్క నాకు వేఱే యాభూషణములు లేవు. బాలసూర్యుఁ డొసంగు పచ్చనిపచ్చడము, రజనీకాంతుఁ డొ సంగు తెల్లనిపచ్చడము, కాంతునియనుపస్థితిని రజని యొసంగు నల్లని పచ్చడముఁ దక్క నాకు మఱేవస్త్రము లేదు." అని ప్రతిగిరికన్యయు భావించును. కాఁబట్టి యావనవాసిని యగు పర్వతకుమారి, తనపతి కడ కేఁగుచుండునప్పు డామె ప్రతిస్థలమునను యువతులు సింగార మెట్లు చేసికొందురో చూచుటకై కుతూహలపడుచుండును. జనకుఁ డగు పర్వతునిగృహమునుండి శ్వశురాలయమున కేఁగుతఱిఁ బ్రతివాహినీమ తల్లియు నొకపత్తనముకడకుఁ దిరిగి యచటివనితల యభిరుచిని దన నిర్మలమానసమునఁ బ్రతిబింబిత మొనర్చుకొని మరల నరణ్యమార్గ మును బట్టును. వనమునఁ బ్రవేశించుటతోడనే యచటిప్రకృతిసౌం

దర్యముఁ గాంచి, యామె యువతులకృత్రిమశృంగారము మఱచిపో వును. మరల నాలుగైదువంకరలు తిరిగి శృంగారప్రియలగు కాంతల వీక్షింప నామె వేఱొకనగరముఁ జొచ్చి, యటనుండి వెనుకటివిషయ ముల మఱచుటచేతనో, యేమో కాని మరల నరణ్యమార్గముఁ గొనును.

పాపము “ భీమ ” చాల యమాయిక. ఏమాయ నెఱుఁగని శంకరునికులమున నామె జన్మించెను. ఇఁక నామె యమాయికత చెప్పుటకేమున్నది! సరియగు శృంగారశిక్ష నందుటకు భీమ యెన్ని యో కుటిలగతులఁ గాంచెను. నగరమందలివిలాసవతులు మొదల్కొని, గ్రామమందలి నీరోగయువతులవఱకు “ లింబాజీపటేలు ” కూతు రగు “ సుఖీ ” మొదల్కొని సార్వభౌమకుమారి యగు బతదున్నీసా వఱకు నామె యెందఱియువతులశృంగారముఁ జూచియుండెనో లెక్క లేదు. అరణ్యమునఁ గొంచెము దూర మేగుసరికి భీమ యంతయు మఱచి మరల శృంగారము నెఱుఁగఁ బౌరమార్గముఁ బట్టుచుండెను. భీమకు శృంగారలాలసయు, నమాయికతయు మితిమీఱియుండుటచే నామె నిత్యము శృంగారప్రియలగు జానపదనాగరయువతీమణుల సహ వాసముననే మునిఁగియుండెడిది.

బాలసూర్యునిపీతాంశుకము ధరించి సరళ యగుభీమ యొయ్యా రముగ లింబాజీపటేలుగృహముప్రక్కనుండి పోవుచుండెను. లింబాజీ కేకమాత్రపుత్రిక యగు “ సుఖీ ” దానిచెంతనే నిలిచి దానివిలోల వర్తనముఁ గాంచుచుండెను. సరళభీమ యామెను దనకుఁ దగినశిక్షకు రాలిగ భావించి చాలప్రసన్నతఁ గాంచెను. మొదట నామె సుఖీకో మలచరణముల స్పృశించెను. దాన సుఖీకిఁగూడ నానంద మొదవెను. ఆమె మిగుల సంతసముతో భీమకు సపర్యసేయ మొదలిడెను. భీమయు

సుభీతో నెయ్యముఁ బెంపొందింపసాగెను. తుదకు భీము సుభీకొనునఁగరములుంచెను. ప్రియాసమునసుభీవలనఁదనకుఁజాలశృంగారశిక్ష లభింపఁగల దని భావించి భీము తనకరములతో నామె నింకను జేరఁదీసికొనియెను. భీమునకుఁ దనయానందావేశమున సుభీ తత్తరపాటుకూడ తెలియలేదు. సుభీని బొందుటచే భీము కమితానందముకలిగి యామె నెచ్చట నుంచఁదగునో, యెచ్చట నుంచఁదగదో యామెకుఁ దెలియక తుదకు సుభీని దనగర్భమున నిడికొనియెను.

కొలఁదిసేపటిలోనే గ్రామమందంతటను భీముసుడిగుండమునఁడి సుభీ మునిఁగిపోయె నని కోలాహలము నిండెను. ఎల్లరు వలలు మున్నగుసాధనములఁ దీసికొని నదివంకకుఁ బరువిడిరి. తమతమశౌర్యములఁ బ్రకటింప వివిధోపాయములఁ గావించిరి. తేపలపై నెక్కి వెదకువారు సుభీ నిర్లక్ష్యత్వము నిచ్చవచ్చినట్లు నిందింపసాగిరి. ఆమె నెవరికిఁ దోచినరీతి వారాడిరి. పాపము పతే లోకమూలఁ గూరుచుండి యేడ్చుచుండెను. అతనినిఁ జాలమంది చుట్టి నిలిచి పిల్లవిషయమున నేమియు శ్రద్ధవహింపక యిచ్చవచ్చినట్లు తిరుగనిచ్చె నని యతని నిందింపఁ దొడగిరి. మునిగిపోయినబాలికనుదీయు ప్రయత్నముల నెవ్వరుఁ జేయుటలేదుకాని, తమతమబుద్ధిశౌర్యముల నందఱును గొప్పగ వర్ణించుచుండిరి. ఆగుంపున నొక తేజశ్శాలియగు యువకుఁడు వారివినోదవర్తనముఁ జూచుచుండెను. బాలికను దీయుట కెవ్వరికిని సాహసములేకుండుటఁ గాంచి సహింపక యాతఁడు ముందునకు వచ్చి యిట్లనెను. "ఇట్టితర్కవితర్కముల కిది సమయము కాదు. ఎట్లో శీఘ్రముగ బాలికను దీయుటకు యత్నింపవలయును. లేకున్నఁ గొలఁదిసేపటిలో నామెప్రాణములు పోవును. మీచేఁ గాకున్న దో నామె

మెచ్చట మునింగినదో, యాస్థలము నాకుఁ జూపుఁడు. నే నామెను వెంటనే తీసివైతును"

అని పలికి యావీరవరుఁడు పర్వతగృహమునుండి వెలుపలికిఁ బోవుచుండెను. ఇంతలో లింబాజీయుఁ దక్కినజను లనేకులును, "శ్రీశివాజీమహారాజునకు జయము" అని యఱచిరి. సంభ్రమ దీయుటకై పోర్తుయువకుఁడు నడుమనే యాగెను. అతఁడు విస్మితుఁడై చూచుసరికి లోకబలిష్ఠుఁ డగు మహారాష్ట్రుఁ డొకఁడు కేలఁ గత్తి నూని రెండవచేత సుభీకవలంబ మొసంగి మందహాస మొనర్చుచు వచ్చుచుండెను. అతనివస్త్రము లన్నియుఁ దడిసియుండుటచేఁ గండలు దేఱిన జిగిబిగి యొడలంతయు బాగుగఁ గన్పట్టుచుండెను. తళుకులఁ జిమ్ము నతనివేఁడికన్ను లమితానుగుభూతదయ వర్షించుచుండెను. గడ్డమువలన నతనిప్రసన్నముఖగాంభీర్య మింకను బెంపొందెను. అతని విశాలలలాటము నిస్తులబుద్ధిశాలితఁ బ్రకటించుచుండెను. "ఇంతకష్టమోర్చి యింతదూరమునకుఁ బ్రవాసమొనరించుటకు నాకు సాఫల్యము లభించెను. నాకు సాక్షాత్పరమేశ్వరునిదర్శన మయ్యెను." అని యాయువకుఁడు భావించెను. ఈవిచారమున నతఁ డానందపులకితుఁడై యొక్కయురకను ముందున కేగెను. అతులితభక్తిభావమున నాయువకుఁడు శివాజీపాదములఁ బడెను. అంతటిభక్తిభావము శ్రీకృష్ణపరమాత్మపాదములఁ బట్టుకొని సద్గుణునకైనఁ గలిగియుండదు. మహావీరతీర్థంకరునకు వందన మాచరించునపుడు శ్రేణికమహారాజునకుఁ గూడఁ బుట్టియుండదు. బోధివృక్షతలమున భగవానుఁడగు గౌతమబుద్ధునిచరణసేవ సలుపునెడ నశోకసార్వభౌమునకుఁ గూడ నుదయించియుండదు.

అపరిచితవేషము, నపరిచితభాషయు, నపరిచితముద్రయుఁ గల

యొకతరుణుఁ డింతభక్తితోఁ దనపదములఁ బడుటఁ జూచి శివాజీ కడు విస్మితుఁ డయ్యెను. అతనిహృదయమున నొకయపూర్వభావ ముదయించెను. అతఁడు గద్గదస్వరమున నిట్లనెను.

" ఓయపరిచితయువకుఁడా! మన మొక్క భారతమాతపుత్రులమే. జగజ్జనని భవాని యగు, భారతమాతకుఁ దనపుత్రు లందఱు సమానులే. అట్టియెడ నాపదములఁ బడనేల! లెమ్ము. నన్నాలింగనము సేసికొనుము."

ఇట్లు పలుకుచు శివాజీ రెండుచేతులతోఁ బట్టి యాయువకుని లేవనెత్తుచుండెను. అతఁడును దననయనములస్నేహాబాష్పములఁ దుడిచికొనుచు, సూర్యునివలెఁ దీక్ష్ణముఁ, జంద్రునివలెశీతలమును, నగ్నివలెఁ దేజోభరితము; జలమువలె నిర్మలము, వజ్రమువలె గఠోరముఁ, గుసుమమువలె సుకుమారము నగు శివాజీరూపమువంకఁ జూచుచు వినయపూర్వకముగ నిట్లనియె.

" మహాత్మా! భవత్సందర్శనాభిలాషనే నేను బుందేలఖండమునుండి యింతదూరక నేతెంచితిని. ఇన్నిదినములప్రయత్నమునకు నేఁడు నాకు ఫలము లభించినది. నేను మహిబాభూపతి చంపతరాయకుమారుఁడను, ఛత్రసాలుఁడను. నాదేశము మునల్మానులవశమైనది. అచ్చటప్రజలు వారియుపప్లవములకు నన్యాయములకుఁ జాల కటకటపడియున్నారు. నేను నాదేశమును స్వతంత్ర మొనరింపఁగోరుచున్నాను. ఈవిషయమునఁ దమయొద్దనుండి గుహ్యోపదేశముఁ బడయఁగోరుచున్నాను. తమసదుపదేశమును వేదవచనమువలెఁ బవిత్రముగ నెంచి తదనుసారమే కార్య మొనరించెదను. తమరు గురువులు. నేను శిష్యుఁడను. గురువులకుఁ జరణసేవ యొనర్చుట శిష్యులపరమధర్మము. కావుననే తమచరణములఁ దాఁకితిని. అనుగ్రహించి నన్ను

భవచ్ఛిష్యునిఁగఁ జేసికొని, నాయొనర్చుసేవ నంగీకరింపుఁడు. సాధ్యమగునేని నన్నుఁ గొంతకాలము తమసేవయం దుండనిండు. తమయాను దినకార్య ప్రయత్నాదికముఁ గొంతకాలమువఱకుఁ జూచి శిక్షఁ బొందు నవకాశము నాకొసంగుఁడు. ఇవ్విధముగఁ దమ రెన్నఁడు నన్నుఁ దమకడ శిష్యత్వమున కర్హునిగ నంగీకరింతురో యానాఁడు గురూపదేశ మొనరించి శిష్యునిగఁ జేసికొని నాకరముల బుందేలఖండము స్వతంత్రము కావింపఁబడున ట్లాశీర్వాదము నొసంగుఁడు.”

శివాజీనేత్రములనుండి ప్రేమబాష్పములు ప్రవహింపఁజొచ్చెను. సుభీభుజముపైనుండి హస్తము నెత్తి యది ఛత్రపాలునిభుజముపై నిడి ప్రేమపూర్వకముగ నిట్లు నుడివెను.

“ మాతృభూమి కింతహృదయపూర్వకముగ సేవఁజేయు ధన్యుఁడ వగు నోయువకుఁడా! మహారాష్ట్రదేశమున నేను నీకు స్వాగత మొసంగుచున్నాను. నాయుద్దేశములను గార్యములను నన్నుఁ బోలినయొకమిత్రునిఁ బొందుటచే నాకవర్ణ్యమగు నానందము ప్రాప్తించినది. నీవించుకతడ విచ్చటనే యుండుము. నే నీబాలిక నామెజనకుని కప్పగించి యిట నేతెంతును. అపుడు నేను శాంతముగ రహస్యమున నీతో సంభాషించెదను.”

ఇట్లు పలికి శివాజీ లింబాజీపటేలుకడ కేగి సుభీ నతని కప్పగించి యిట్లనె:—“ కొనుము. ఇదే నీకన్నియ వచ్చినది. ఈమెకు నిర్లక్ష్యత హెచ్చు. అహమదునగరపు చాందబీబీవలెఁ గత్తిఁ ద్రిప్పుటలో నీమె వెనుదీయునదికాదు. ఢిల్లీపాదుషాసరదారు లిరువురు దిలేర్‌ఖాన్‌జయసింహులు గొప్పసైన్యముతో మహారాష్ట్రదేశముపై దాడి వచ్చుచున్నారు. ఆసమయమున నీ వధమ మొకవందమంది తరుణవీరులఁ గొని యరుణకేతనతలమున కేతేరవలయును.”

పటే—మహారాజా! మాగ్రామమునఁ గత్తిఁబట్టనేర్చినవా రందఱు భవదాజ్ఞానుసారము సేవయొనర్ప సంసిద్ధులు. దేవరవారిము ఖమునుండి వెలువడిన ప్రతిశబ్దమును జగదంబ యగు భవానినోటి నుండియే వెలువడినదని మాయెల్లర దృఢవిశ్వాసము. మనుజునియాజ్ఞ నుల్లంఘింపవచ్చుఁగాని భగవతియాజ్ఞ నుల్లంఘింప నెవరితరము? మహా రాజా! దయనేసి తడిసినవస్త్రములవీడి యీపొడివస్త్రములధరింపుఁడు."

శివాజీ యేమియుఁ బలుకక తనతడివలువలఁ దొలఁగించి పటే లొసంగిన వలువలఁదాల్చెను. పిదప లింబాజీపటేలు తన నంతసమున నిట్లనియె.

"పలికి ధనహీనులకు ధనము, దిక్కులేనివారికి దిక్కు, దుష్టశి క్షకులు, గోబ్రాహ్మణప్రతిపాలకులు"—అని జనులాడునది యెంత యు యథార్థము. దేవరపవిత్రపదకమలములు నాయీకుటీరము మెట్టు టచే నే నెంతయు ధన్యుఁడను. దేవర కాతిథ్య మొసంగి నాయింటఁ గల సామాన్యభోజ్యముల దేవ:సేవయం దుపస్థితములఁజేయు మహా భాగ్యము నాకు లభింపఁగ్గలదా ?

శివాజీ సాభిమానముగ నిట్లు పలికెను:—"నేను నీవాఁడను. సమస్తమహారాష్ట్రమునకు నట్లే. నేను మీమాటల నెప్పుడు తిరస్క రింపఁజాలుదును? కొన్ని యావశ్యకములగు మహద్విషయములఁ జర్చించుటకై యీబుందేలయువకునితో నేగవలయును. రెండుజా ములు కాకుండఁగనే రాఁగల్గుదును. అపుడు నీకోర్కె సెల్లించి నీయింట భుజింతును."

సర్వజనులయభినందనములను స్వీకరించుచు శివాజీ యటనుండి బ..లు సేయుచుండఁ బటే లిట్లు పలికెను:—దేవా! ఆబుందేలయువ కుఁడు నిన్నసాయంకాలముననే యిట కేతెంచియుండెను. అతఁడు

తనమధుర భావములవలనను బవిత్రవర్తనమువలనను మాకెల్లరకుఁ జాల ప్రేమాస్పదుఁ డయ్యెను. "శివాజీమహారాజుదర్శన మెట్టిది? పలు కెట్టిది? వారిదర్శనము సర్వసులభ మగునా? కాదా? స్వాతంత్ర్య ప్రాప్తికై వారు మొదట నే మొనర్చిరి? వారియుద్ధప్రక్రియ యెట్టిది! ఏయాయుధములను వా రుపయోగింతురు!" మున్నగు బహువిధప్ర శ్నముల నాతఁడు వచ్చుటతోడనే నన్నడిగెను. మహారాజదర్శనో త్కంఠచే నతనికి రాత్రి యంతయుఁ గన్ను మూఁతవడదయ్యె. నే న తనిఁ గొని దేవరసేవయం దుపస్థితుఁడనుగా సిద్ధపడితిని. కాని సుభీ సీటఁ బడుటచే నాఁగిపోవలసివచ్చెను. దేవరకృపవలన సుభీప్రాణ ములు దక్కెను. ఆబుందేలయువకున కప్రయత్నముగ మహారాజద ర్శనమును లభించెను."

ఆవల మరల శివాజీజయజయకార మయ్యెను. జయజయకా రము ప్రతిధ్వనింపకపూర్వమే యతఁడు ఛత్రసాలునిఁ దనవెటఁ గొని యటనుండి వెడలిపోయెను. ఒకనినోటి, యాబుందేలయువకునితోఁ గూడ మహారాజు, చూచుచుండఁగనే యంతర్హితుఁడయ్యె నని చె ప్పెను. ఎల్లరు గ్రామస్థులుఁ గను గంభీరముద్రఁ దాల్చి భవానిసద యసహాయమువలన మహారాజు తా నేమి కోరిన నది యొనరింపఁగలఁ డని పలుకుచుఁ దమతమ యిండ్ల కేగిరి.

శివాజీమహారాజు ఛత్రసాలుని వెంటఁగొని స్వతంత్రతావిష యికములగు ప్రసంగములఁ గావించుచు భీమానదియొడ్డున కేగి యట నుండి యానదీతీరము వెంబడి చాలదూరముపోయి తుద కొక మెత్తై నప్రదేశముకడఁ జేరుకొనెను. దూరమునుండి యాతావుఁ గాంచినచో నట మనుజావాసముండవచ్చు ననునూహకూడఁ గలుగదు. శివాజీ యొకపెద్దశిలకడకుఁ బోయి "ఏసాతీ" యని బిగ్గఱగఁ బలుకుటతో

డనే “ మహారాజా ” యని వినఁబడెను. ఆశిలబిద్రమై లోనికేగుట కొకచక్కనిమార్గ మేర్పడెను. ఛత్రిసాలునకుఁ జాల విస్మయము గలిగెను. కాని యాతఁ డేమియుఁ బలుకక శివాజీ వెన్వెంట నాగుహఁ జొచ్చెను. కొంచెముదూర మేగుసరి కొకసభామంటపము కానవచ్చెను. అచ్చట గాలియు బాగుగఁ దగులుచుండెను. వెలుఁగునకుఁ గొదువలేకుండెను. భూమిగర్భమున డాఁగియున్న యింతటిగొప్పమంటపముఁ గాంచ ఛత్రసాలునివిస్మయమునకు మేరలేకుండెను.

ఛత్రిసాలునిమనఃస్థితి గ్రహించుటకు మహారాష్ట్రదేశమునం తను దనపలుకుపై నాడించుజాణయగు శివాజీకి విలంబమేల యగు ? అతఁడు తత్క్షణమే ఛత్రిసాలునితో నిట్లనెను.

“ ఛత్రిసాలా ! ఈదివ్యమంటపముఁ జూడ నీకు గడునాశ్చర్యము గలుగుచున్నదికాఁబోలు. కాని యిట్టిగుప్తస్థలములును గుప్తమార్గములును, స్వాతంత్ర్యకార్యముల నెంతయుపకరించునో నీకుఁ దెలిసినపుడు నీయాశ్చర్య మినుమడించును. మహారాష్ట్రమందలిమహాత్ములు సన్యాసులు నిచటివారికి సమత్వతత్త్వమును బాగుగ బోధించిరి. కాని స్వాతంత్ర్యమునకై పోరుసల్పువారు చాలతక్కువమంది యేర్పడిరి. శూరులు చతురులు, రాజనీతిజ్ఞులు నగుమహారాష్ట్రులు బహుమినీరాజ్యసేవామగ్నులై యుండిరి. కావున మొట్టమొదట నరుణకేతనతలముఁ గూడినవారు రాజకీయవిషయములయం దజ్ఞులు, నపరిచితులు నై యుండిరి. మహానుభావుఁడగు రామదాసస్వామి కర్మమార్గోపదేశ మొనరించి, చాలమంది నరుణావయస్కుల నరుణకేతనముక్రిందఁ గూర్చెను. మహారాష్ట్రమందంతటను [illegible]లకు మాటుగఁ గృపాణములే కన్పింపఁదొడఁగినవి. హ[illegible] మాఱుగ హరహరమహాదేవశబ్దములు వినఁబడసాగెను. కాని యాను

భవము గలమ్లేచ్ఛసైన్యము నెదుట మేము నిలువఁజాలమని యెంచి యెడరు వేచి రహస్యాక్రమణము సేయ మొదలిడితిమి. నామహారాష్ట్రీయులు లెక్కకుఁ జాలకొలఁదిమందియే యైనను ప్రబలమగు బీజాపురపుసైన్యముపై నదరున రహస్యాక్రమణము సల్పి నిత్యము జయముఁ గాంచుచుండెడివారు. ఇట్టియాకస్మికరహస్యధాటీసమయమున నక్కియుండుట కిట్టి గుప్తస్థానములు బాగుగ నుపకరించును. గుప్తస్థానములం దక్కడక్కడ ధాన్యముకూడ నేర్పడియున్నవి. కావున నేము మహారాష్ట్రులేస్థానమున [illegible] యుందురో యెవరికిని జాడ తెలియదు. వారు రేపే యీతావునుండి నాల్గయిదుయోజనములదూరమున [illegible] టనో తేలుదురు. తఱచు మేము రెండుమూడుగుప్తధాటులు గావించి శత్రులను నిరర్థకులఁ గావించి చాలఁగ భోజ్యపదార్థములను, మందుగుండును మందును గొల్లఁగొట్టినవస్తువులఁ గొని కొలఁదిసేపటిలోనే యిట్టియొకగుప్తస్థానమున నంతర్ధానమై పోవుచుందుము. కావున నేమా కేమియు నష్టము గలుగదు. శత్రువులుమాత్రము సంకటమునఁ బడిపోవుదురు. ఛత్రసాలా! నీ కిప్పు డిట్టిగుప్తస్థానములయుపయోగము తెలిసినదా! రాజస్థానమందలిరాజపుత్రులు బుందేలఖండమందలి బుందేలురు, గొప్పవీరులు రణప్రియులు నగుదురు. కాని వారు బలాబలములను సమయాసమయములను భావింపఁజాలరు. గుట్టుమట్లనెఱుఁగరు. వారు తిన్నగఁబోయి పగతుర నాక్రమింతురు. తఱచుగ స్వనాశనమునకే కారణభూతు లగుదురు. కాని గుప్తధాటు లొనరించుదనుకఁ బ్రబలశత్రువు లోఁగఁడు."

[illegible] శ్రీరాగ్రమునస్కరించె యనినమాట లన్నియు [illegible]. అతనిచేతిని బట్టుకొని శివాజీ యిట్లనెను:—

"రమ్మా. మన మాకడఁ గూర్చుందము. ఈతావుననే

ను సంభాషణము జరుగు నని నేను మొదటనే నిశ్చయించుకొంటిని. నేను లింబాజీపటేలుగృహమునకు నిష్కారణముగ రాలేదు. అచ్చట నీతోసమావేశ మగు నని నే ననుకొనుచుంటిని."

శివాజీవంకకు భక్త్యాశ్చర్యములతోఁ జూచుచు ఛత్రిసాలుఁ డిట్లనెను:—"మహారాజా! తమసందర్శనమునకై నే నిటకు వచ్చు చుండుట తమ కెట్లు తెలిసెను? విశేషించి, తమ్మన్వేషించుకొనుచు నేసీగ్రామమునకే చేరుదు నని తమ కెట్లు తెలిసెను! ఈస్థానముననే తమరు నాతో సంభాషింపుదు రని యెట్లు నిశ్చయించితిరి!

ఛత్రిసాలునిప్రశ్న కుత్తర మీయకయే శివాజీ "ఏసాజీ! ఒకసారి యిటురమ్ము." అని పిలిచెను.

వెంటనే యేసాజీ వచ్చి శివాజీయెదుట నిలువఁబడెను. అపుడు శివాజి ఛత్రిసాలునితో నిట్లనెను:—"ఛత్రిసాలా! నీ వితని నెప్పుడైన నెచటనైనఁ జూచి యుంటివా!"

ఛత్రిసాలుఁ డేసాజీ నాపాదమస్తకముఁ దిలకించి యిట్లు చెప్పెను. "లేదు, మహారాజా! నే నితనిఁ జూచుటకు నేఁడే మొదటిసారి."

అటుపై శివాజీ నవ్వుచు నిట్లనెను:—రాజధానియందు ఢిల్లీసేనవిడిసియుండుటను రాజస్థానమండలిరాజపుత్రులకు శత్రుప్రవృత్తియే తెలియదు. శత్రుసేన రాజప్రాసాదమునఁ బ్రవేశించువఱకు బుందేలఖండమండలిరాజన్యులకు శత్రువులు తమదేశము స్వాధీనపఱచుకొని నాశనముచేసిరనికూడఁ దెలియదు. దీనికి ముఖ్యకారణ మేమనఁగ, శత్రువృత్తాంతముఁ దెలిసికొనుటకు బుందేలురు రాజపుత్రులు నెట్టి యుపాయములను నలుపరు. శత్రుశిబిరముల గుప్తరూపమునఁ జొచ్చి తద్వృత్తాంతములను సాంగోపాంగముగఁ దెలిసికొనుట వారికిఁ దెలి

యదో లేక యది యనుచితమనియుఁ బిఱికితన మనియు వారు భావిం తురో కాని యిది గొప్పలోటు. లేక ప్రమాదము. ఛత్రిసాలా! అసంఖ్యాకులగు నాగూఢచారులలో నేసాజీ యొకఁడు. నే నితని దేవగఢవృత్తాంతముఁ గొనిరమ్మని పంపితిని. దేవగఢమును జయించి సైన్యము ఢిల్లీకి మరలినతోడనే యితఁడుగూడ మరలిరాసాగెను. నీవు దేవగఢమునుండి బయలుదేఱుసరి కితఁడుగూడ వేసము మార్చి నీవెంటఁబ్రయాణమయ్యెను. మార్గమధ్యమునఁగూడ నితఁడెన్నియో పాఱులు వేసము మార్చికొనెను. అప్పటప్పటికి వివిధరూపములతో నా జాడ నీకెఱింగించినదికూడ నితఁడే."

ఇప్పుడు ఛత్రిసాలునికన్నులు విడినవి. దేవగఢమునుండి బయలుదేఱుసమయమున నేసాజీనిబోలు నొకమనుజునితోఁ దనకు సంభాషణ జరిగినట్లు జ్ఞప్తికి వచ్చెను. పిదప నతఁ డేసాజీయే యని గ్రహించెను. ఇంకఁ దానాఁగినయెల్లతావులందును సకలవిధసౌకర్యములు నేల కలిగినవో యతనికిఁ దెలిసెను. శివాజీవంకకుఁ గృతజ్ఞతాపూర్వకదృష్టులఁ జూచుచు నతఁ డిట్లు పలికెను:—

"మహానుభావా! తమచాతుర్యము రాజనీతిజ్ఞతయు నవర్ణనీయములు. నిన్నసంధ్యాకాలమున నేసాజీయే నన్నుఁ గొనివచ్చి నన్ను లింబాజీపటేలుగృహముకడ నిలిపెనని నాకు బాగుగఁ దెలిసినది. నేను చాలగుప్తముగ యాత్ర సల్పుచుంటిని. ఐనను గుప్తచరునివలన దేవర నాజాడఁ దెలిసికొంటిరి. అతనిసాయముననే తమరు నన్నుఁ దమపాదసాన్నిధ్యమునకుఁ బిలిపించి నాకపరిమితోపకార మొనరించితిరి.

శివాజీ గంభీరభావమున నిట్లు పలికెను:— "ఛత్రిసాలా! నేను కేవలము నాకర్తవ్యమును నిర్వహించితిని. అనేకకష్టములసహించుచుఁ

గఠోరమగు ప్రవాసశ్రమ మనుభవించుచు, నలంఘ్యమగు వింధ్యాద్రిని లంఘించుచు, దుస్తరమగు నర్మదానదినిఁ దరించుచు బుందేలఖండమువంటి దూరదేశమునుండి కేవలపరోపకారతత్పరుఁడై యొక యువకుఁడు నాకడ కరుదెంచుచున్నాఁ డని వినినపుడు నేనూరక కూరుచుండి నీకేమియు సౌకర్యము నలుపకున్నచోఁ బరమేశ్వరునియెదుట నేను గొప్పయపరాధి నగుదును. నేను స్వయముగ నేతెంచి నిన్నుఁ గలిసికొనుటయే యుక్తమైయుండెను. కాని నీవు దేవగఢమునుండి బయలుదేఱుతరిని నీయుద్దేశమేమో నాకుఁ దెలియదు. నాకు నీయుద్దేశము తెలిసినప్పుడు నీవు కడు త్వరితముగఁ బయనముసేయుచుంటివి. కానఁ జేయునది లేక నిన్నుఁ గలిసికొనుట కీస్థానము నిర్ణయింపవలసివచ్చెను.”

అటుపై శివాజీ యించుకతడ వూరకుండెను. సరోజమరందమునుగ్రోలు భ్రమరరాజమువోలెఁ ఛత్రసాలునిదృష్టి తదేకలగ్నమై శివాజీముఖమున నిలిచియుండెను. శివాజీముఖకమలమునుండి యుపదేశామృత మెపుడు వెలువడునో తదానందమునే నెపుడు కనఁగల్గుదునో యని యతఁడు యోజించుచుండెను. కొంచెముసేపు విచారించి యిట్లు శివాజీ పల్కెను:—

“ఛత్రసాలా! బుందేలఖండమునుండి యవనులఁ దోలుటకు నేఁటిదనుక ననేకయత్నములు జరిగియున్నవనియుఁ, గాని పరస్పరద్వేషవైరములచేతనే నేఁటివఱకు సాఫల్యము లభింపలే దనియు వినుచున్నాను. ఇది యథార్థమగునా! బుందేలఖండమందలియాంతరికస్థితిగతులు నీకు బాగుగఁ దెలిసియుండును. కావుననే నిన్నడుగుచుంటిని. బుందేలఖండపురాజులు సరిదారులు నటనుండి యవనులఁ

...గనుగొనుటకై యైకమత్యముతోఁ బ్రయత్నములు సలుప రనుట ...ముకాదా!"

ఛత్రసాలుఁడు మిగుల ఖిన్నుఁడై యిట్లు పలికెను:—మహా రాజా! బుందేలఖండస్వాతంత్ర్యయత్నమున నేఁటివఱకు జనులకు సంపూర్ణముగు విఫలతయే కలుగుచుండెను. కావుననే నేను దేవరవా రిసాన్నిధ్యమున నుపస్థితుఁడఁ గావలసివచ్చెను. బుందేలఖండముపై నుండి యవనులస్వామిత్వము తప్పక తొలఁగిపోవు నని మాతండ్రి గారి కత్యంతవిశ్వాస ముండెడిది. వారియందు గొప్పసాహసము, నసాధారణమగు ధైర్యము, నతులితమగు క్షాత్రము నుండెడివి. కాని యీయనైక్యకలహకారణముననే వారిరాజ్యము పోయెను. ప్రాణ ములు పోయెను. తుదకు బ్రాణములకన్నఁ బ్రియతరమగు నుదా త్తాశయము నష్టమైపోయెను. అవసానమున శాశ్వతనిద్ర వారికిఁ బ్రా ప్తించుకాలమున వారికన్నులు విడినవి. వారిసేన యంతయు మాసి పోయి రాజ్యము యవనులకు వశమైపోయి వారైహికవాంఛలు వీడి స్వర్లోకయాత్రోన్ముఖు లయిన సమయమునఁ దమవిఫలతకు హేతువు వారికిఁ దెలిసెను. ఆసమయముననే వారు నన్నిటకు వచ్చి తమకడ గురుమంత్రోపదేశముఁ బొంద నాజ్ఞాపించిరి. వారియాజ్ఞఁ బా లించుటకై వారియుదాత్తాశయము నెఱవేర్చుటకై బుందేలఖండమును యవనులకఠోరముష్టినుండి విడిపించుటకై నేనిపుడు తమసన్నిధి నుప స్థితుఁడ నైతిని. తమరు దయతో నాకు యోగ్యమంత్రోపదేశముఁ గావింపుఁడు. స్వాతంత్ర్యసంపాదనకు సులభతమమార్గమును దయచేసి నాకెఱింగించి స్వాతంత్ర్యముకొఱకు పోరుటకు నాకు దివ్యశక్తి కలుగు నట్లాశీర్వదింపుఁడు.

శివా—(సస్నేహముగ) ఉదాత్తమగు భూతదయాపవిత్రము

నెదుట నిల్పికొని, యేమనుజుఁడు స్వదేశోద్ధరణమునకై హృదయపూర్వకముగ యత్నము సలుపునో, యాతనిమార్గ ముజ్జ్వలబంధుప్రేమ తేజోవిలసితమై యొప్పును. నీతిన్యాయశమతాదేవతలు మంగళగానముసేయుచు నతని వెన్నంటి తిరుగుదురు. బంధుప్రేమ యనుదివ్యజ్యోతిని గేల బూని యాత్మోన్నతి యతనికి మార్గముఁ జూపుచుండును. ఔదార్యము, మాధుర్యము, సత్యప్రతిజ్ఞయు నతనికి వింజామరలు వీచుచుండును. దక్షతయుఁ దత్పరతయు నాతనిమార్గము నిష్కంటకముగ, సుగమముగ నొనరించును. ప్రసన్నతయు, సరళతయు నతనిమానసము నుత్సాహభరితముఁ గావించును. సంపన్నతయు, నీరోగతయు, నిర్వ్యసనతయు, నతనిసంపాదితమును గాపాడుచుండును. ఈవిధమున స్వతంత్రతాదేవి పరివారమంతయు నతనికి సాయమొనర్చును. కావున నావంటిపామరునివలన నేమిం గాఁగలుగును! ఛత్రిసాలా! నేనును నీవలె స్వతంత్రతాదేవి కొకభక్తుఁడను. ఇంతకు మించి నేను నీ కేమి చెప్పఁగలుగుదును!

ఛత్రి—(గంభీరముగ) మహారాజా! తమ రిట్లు పలుకవలదు. తమయందు గొప్పసామర్థ్య మున్నది. తమయధికార మత్యధికము. సమస్తభారతవర్షమునను యథార్థస్వాతంత్ర్యజ్ఞానము మొట్టమొదటఁ దమకే లభించినది. మత మనుసుడిగుండమునఁ దిరుగుమహారాష్ట్రులను ప్రథమమునఁ దమరే స్వదేశప్రేమవంకకు సంధించిరి. భారతవర్షమున స్వాతంత్ర్యబీజారోపణముఁ దొలుదొల్తఁ దమరే కావించితిరి. చైతన్యశూన్య మగుచుండు భారతవర్షపౌరుషమున మున్ముందు సుధావర్షముఁ గురిపించినది తమరే. భారతవర్షభావిస్వాతంత్ర్యమున కాదిగురువులు తమరే. స్వతంత్రతాదేవీమందిరముఁ జేరఁగోరు నావంటి

యుల్పజ్ఞులకుఁ దమయుపదేశానుసారముగ నడచుట మొట్టమొదటికర్తవ్యము.

శివాజీయాసమయమున నెవ్వియో విచారములందు మగ్నుఁడై యుండెను. ఛత్రసాలుఁడు మాటాడకుండ నాతనివంకకే చూచుచుండెను.

చాలసేపట్లే విచారమగ్నుఁడై యుండి శివాజీ యిట్లనెను:— ఛత్రసాలా! బుందేలఖండపరిస్థితియు మహారాష్ట్రపరిస్థితియు నొక్కటి కాదు. ఏప్రయత్నములవలన మహారాష్ట్రదేశమున స్వాతంత్ర్యము లభించెనో, కేవల మాప్రయత్నములవలననే బుందేలఖండమున స్వాతంత్ర్యము గలుగదు. దేశకాలపరిస్థితుల బాగుగఁ బరికించిన పిమ్మట సరి యని తోఁచినమార్గము నవలంబించుట శ్రేయము. మహారాష్ట్రము చాలనాళ్లనుండి స్వతంత్రముగనే యుండెను. ఏతన్నివాసులు స్వరాజ్య స్వాతంత్ర్యసౌఖ్యముల మఱచియుండలేదు. కావుననే వారిని స్వరాజ్యాభిముఖులఁ గావించుట కధికకాలము, నధికపరిశ్రమయుఁగూడ నావశ్యకములు కాలేదు. మహానుభావులగు రామదాసస్వామియుఁ గర్తవ్యదక్షులగు వారిశిష్యులును, బహుసంవత్సరములవిరళయత్నము సలిపి కేవలదైవాయత్తులై నిస్సత్త్వులగు మహారాష్ట్రుల నుపదేశామృతముఁ జిలికి తేజస్వులుగను సబలులుగను, స్వావలంబులుగను గావించిరి. అభిముఖులఁ గావించుటకుఁ గాలపరిశ్రమాధిక్య మావశ్యకము కాకున్నను నిస్సత్త్వులగుటచే మహారాష్ట్రులస్వాతంత్ర్యమునకుఁ బునాది సిద్ధమగుటకుఁ జాలకాలము పట్టెను. కాని బుందేలఖండపరిస్థితి యిట్టిది కాదు. బుందేలఖండము నేఁడు యవనులయధికారముననే యున్నది. కాని యచటిస్వరాజ్యస్వాతంత్ర్యస్వావలంబనములకు గౌరవాన్వితమగు నితిహాసము కలదు. బుందేలురు

స్వరాజ్యస్వరూపమును మఱచిపోయియే యుండినను, వారికి స్వతం
త్రతాశబ్ద మపరిచితముగనే కన్పట్టినను మధురస్వతంత్రతాఫలముల
స్వాదుమాత్రము వా రిప్పటికి మఱచియుండరు. కావున వా రేఫ
లముల నాకాంక్షించుచున్నారో యాఫలములు స్వరాజ్యవృక్షము
ననే యుండు నని వారి కొకసారి విశ్వాస మెప్పుడు కలుగునో యప్పుడు
బుందేలఖండస్వాతంత్ర్యమునకు దిట్టమగు పునాది సిద్ధమయ్యె నని
యెంచవచ్చును. బుందేలఖండప్రజ మిక్కిలి తక్కువకాలములోఁ గడు
సులభముగ సిద్ధపఱుపఁబడఁగలదు. ఇదికాక యచ్చటిప్రజ మాండలి
కనాయకులకు, సరదారులకు వశమై యున్నది. అంతయు మాండలిక
నాయకులు సరదారులు నన్యోన్య మైక్యమందిన నచ్చటిప్రజయు విశ
శమై వారికిఁ దోడొసంగవలసివచ్చును. ఛత్రసాలా! నీవు బుందేల
ఖండముఁ జేరుటతోడనే మొదట స్వార్థత్యాగముఁ గావించి ద్వేషవి
రోధబీజముల నాశనము గావింపుము. అభిమానులయెదుట నమ్రత
వహించియు, బుద్ధిమంతులకు నచ్చఁజెప్పియు, నజ్ఞానుల కుపదేశ మొ
సంగియు, మూర్ఖుల కాసఁజూపియు, వారిమనములందు స్వాతంత్ర్యస
హానుభూతిఁ గల్గింపుము. మనఃప్రకృతులు తఱచు భిన్నము లగుట
వలన వ్యక్తిగతకలహము, వ్యక్తిగతద్వేషము, వ్యక్తిగతమాత్సర్యము
నిర్మూలము కాఁజాలవు. ఐనను సాధ్యమగునంతవఱకు నీవు బుందేలు
రన్యోన్యవైరభావముఁ, గలద్వేషమాత్సర్యములను మఱచి స్వాతం
త్ర్యప్రయత్నమున సహాయ లగు నుపాయ మొనరింపుము. ప్రథ
మమున స్వాతంత్ర్యపతాకాతలమున బుందేలుర నెల్ల నొక్కచోఁ
గూర్చి పిదప స్వాతంత్ర్యయుద్ధము నారంభింపుము."

ఉపదేశసుధాపాతరోమాంచితుఁడై ఛత్రసాలుఁ డిట్లు పలికె
ను:— మహాత్మా! మహారాష్ట్రము రామరాజ్యస్థాపనకొఱకై బుందే

లఖండమునఁ బ్రాణనాథస్వామి జనులకు స్వాతంత్ర్యశిక్ష నొసంగుచుఁ దిరుగుచున్నారు. బుందేలఖండమునఁ బ్రాణనాథస్వామివచనములు రాజాజ్ఞలకన్న నమోఘతరములై యుండును. ఇదికాక దలపతిరాయ నామకుఁ డగు తేజస్వి యగు నొకరాజకుమారుఁడు కూడ నేతద్దేశమునందే బుందేలఖండమునం దంతటఁ దిరుగుచున్నాఁడు. కావున బుందేలఖండమున స్వాతంత్ర్యవిషయికమగు సన్నాహము చాలఁగ జరిగిన దని నేను వక్కాణింపఁగలను.

శివా—ఛత్రసాలా! బుందేలఖండమున నింతటిసన్నాహమై యున్నచో నీ వింక మిగిలినకార్యము నెఱవేర్చుటకు సైన్యబలముఁ జేకొనవలయును. అన్నిటఁ శత్రుసంహార మొనర్చి [illegible]వికమ్ము. స్వదేశముపైఁ గ్రమ్మిన యధికారమును [illegible]ము. తురుష్కులను మొగలులను నిశ్శేషించుటకై [illegible]ంపుము. అవి యత్యధికసంఖ్యాకములై నీపై ధాటిసల్ప నెంచినచో నాకు వార్త నంపుము. నే నెల్లవిధముల నీకుఁ దోడుపడి వారల ధ్వంసము నొనరించెదను. నాతో వారు వైరము మొదలిడినసమయమున సాక్షాద్భవానీమాతయే నాకు సాయమొనర్చుటచే నేను ముసల్మానుల నంతయు లెక్కఁగొననైతిని. గొప్పగొప్పయవనవీరులు నాతలఁద్రుంచుటకై దర్పపూరితులై నాపై కేతేర, నేను వారి నెల్లర మడియించితిని. కాన నీ వేమియుఁ జింతసేయకుము. నీదేశమున కేగుము. సేనఁ గూర్పుము. యవనుల దేశమునుండి పాఱఁద్రోలుము. ఎల్లప్పుడును గేల విచ్చుకత్తిని దాల్పుము. పరమేశ్వరుఁడు నిన్నుఁ గాపాడును. గోబ్రాహ్మణప్రతిపాలనము, వేదసంరక్షణము, సమరమునఁ క్షాత్రప్రదర్శనము క్షత్రియులముఖ్యకర్తవ్యములు. ఏతత్కార్యమున నీప్రాణములుగూడఁ బోయినను, నీవు సూర్యమండలము భేదించుకొని స్వర్గముఁ జేరి యు

చట నపారసౌఖ్యము నందుదువు. నీవు యుద్ధమున విజయివే యైనచో బుందేలఖండమున స్వరాజ్యము స్థాపితమగును. నీకీర్తి శాశ్వతమై వెలుంగును. కావున స్వదేశమున కేగి మ్లేచ్ఛులతోఁ బోరుసల్పుము. అవసరమైనచో బలీయ మగు శత్రుసేనపై గుప్తధాటి సల్పి తద్బల ము గుండిల్లఁపుము. విశ్వసనీయులగు బుందేలయువకుల మాఱువేస ములతో యవనులసమాచారముఁ గొనితేర నాజ్ఞాపింపుము. నీయం తఃకరణమున బంధుస్నేహతైలమున వెలుంగు భూతదయాదీపిక నెల్ల పుడు నుజ్జ్వలముగ నుంపుము. ఎంతవఱకు దాస్యనాశము కాకుండునో యంతవఱకు దేశమున శాంతిసుఖసద్భావములకుఁ దెంపుచేకుఱ దని నమ్ముము. పవిత్రస్వరాజ్యధ్యేయమును సతతము నీయెట్టయెదుట నుంచుకొనుము. బుందేలులు గొప్పవీరులు. వారియందొక్కమాఱు స్వరాజ్యప్రేమ ముదయించినచో వారు కృతాంతునివలె నితాం తవిక్రమప్రదర్శనముఁ గావించి స్వరాజ్యస్థాపనముఁ గావించుకొం దురు. ఛత్రిసాలా! మన మీజగన్నియామకుఁడగు పరమేశ్వరుని సుతులమే కదా! మన మన్యాయమునకుఁగాని దురాచరణమునకుఁ గాని చేతఁ గృపాణముఁ బూనలేదు. స్వార్థసిద్ధిఁ గావించుకొనుటకుఁ గాని, బరులస్వాభావికాధికారములఁ దొంగిలించుటకుఁగాని, యనా వశ్యకమగు రాజ్యతృష్ణను దృప్తిపఱచుకొనుటకుఁగాని మనము హస్త మున శస్త్రముఁ దాల్పలేదు. ఈశ్వరుఁడు వాంఛించున్యాయము వేఱు మార్గములఁ గానపుడు వివశతచే మనమాయుధ మెత్తవలసివచ్చును. మన మాన్యాయశీలుఁడగుపరమేశ్వరుని తత్పరులమగు సేవకులము. మనవంటిసేవకులను విజయులఁ గావించుట కేవల మాతనివశము. నిష్కామబుద్ధితో స్వకర్తవ్యములఁ బాలించుటయే మనపని. విజయుల మగుట యాపరమేశ్వరుని యధీనము. మన మేకాగ్రమనస్కులమై యా

పరమేశ్వరునికార్యము నిర్వహింప సంసిద్ధులమైనపు డాతఁడు మన యెడ సంతుష్టుఁడు కాకుండునా?

ఛత్ర—(గద్గదస్వరమున) మహారాజా! తమయుపదేశామృత సేవనమున నామనమున నొకనూతనతేజస్సంచార మొదవుచున్నది. నానిరాశమగు మనసు బలిష్ఠమయినది. ఇతికర్తవ్యతావిమూఢమగు బుద్ధి ప్రౌఢమయినది. తేజోవిహీనమగు నాత్మవిశ్వాసము తేజోమయమైనది. సాధ్యమైనంతశీఘ్రముగ స్వదేశమున కేగి దానిని స్వచ్ఛందముఁ గావించి నాసోదరుల దాస్యనరకమునుండి తొలగింపవలయు ననియే నే నిపుడు వాంఛించుచున్నాను. కాని దీనికిఁ బూర్వమొక సారి నేను ఢిల్లీకేఁగవలసియుండును. మహారాజా! జయసింహునకు నాపైఁ జాలప్రేమ కలదు. దేవగఢయుద్ధమున నేను ఢిల్లీశ్వరునిపక్షమునఁ బోరాడితిని.

శివాజీ ఛత్రసాలునివంకకుఁ గడు నానందమునఁ జూచుచు నిట్లు పలికెను:—"ఢిల్లీశ్వరునితోఁ బోరుటకు నున్న నీ వాతని సేనాభ్యంతరస్థితుల నెఱింగితివి. చాల మంచిపని చేసితివి."

ఛత్ర—రాజాజయసింహుఁడు నతనిసైనికులుఁ దుదకు బహదూర్‌ఖాన్‌కోకాయు దేవగఢయుద్ధమున నామూలమున ఢిల్లీశ్వరుని పక్షమునకు జయము లభించె నని యంగీకరించిరి. కావున జయసింహుఁడు నన్నొకసారి ఢిల్లీ కేగి సార్వభౌమునిసందర్శింపవలయు నని కోరుచున్నాఁడు. నన్నుఁగూర్చియు నాదేశముఁ గూర్చియుఁ బాదషాతో నివేదించునట. అతఁడు నన్ను ఢిల్లీకి రమ్మని చాల పట్టుపట్టెను. కాని యట్లు చేసినఁ జాలకాలము వ్యర్థమగు నని నే నెంచుచున్నాను. తమ రాజ్ఞ యొసంగినచో నేను ఢిల్లీ కేఁగక వెంటనే బుందేలఖండ

ముఁ జేరి సాధ్యమగునంత త్వరితముగఁ బోరుసల్పి నా దేశము స్వాతం
త్ర్యముఁ గావించుకొనెదను.”

శివా—ఢిల్లీ కేగుటఁ జాలకాలము వ్యర్థమగు నని నేను నంగీకరింతును. కాని యంతిమోపాయమగు యుద్ధమునకు ముందుగ నీవొకసారి ఢిల్లీ కేఁగివచ్చినచో బుందేలు రందఱు నింక యుద్ధము తప్ప వేఱుపాయము లే దని గ్రహింతురు. బుందేలఖండమున నలసులు, నీచులు, విలాసలోలురు నగు రాజులే యెక్కుడు మందికలరు. కాన సామోపాయము లన్నియు నెఱవేర్చినఁగాని వారు యుద్ధమునకుఁ గడంగరు. కావున ఢిల్లీ కేగి ముందుగనే ఢిల్లీపతిచే లేదనిపించుకొనుట యుత్తమము. నీవు జయసింహుఁడు చెప్పినట్లు ఢిల్లీకిఁ బొమ్ము. అచటఁ బాదుషా నీతో సరళముగ మాటలాడఁడు. సరళమార్గముల ననుసరించుటచేఁ బాదుషా లెక్కగొనఁ డని బుందేలనృపతులకు బోధపడినప్పుడు వా రంతిమమార్గమగు యుద్ధము నంగీకరింపక తప్పదు. ఢిల్లీనుండి నీవు వెంటనే బుందేలఖండముఁ జేరుము. ఉపదేశించి, ప్రార్థించి యెట్లు సాధ్యమైన నట్లు జనుల నీపక్షమునకుఁ గొనుము. పిదపఁ బాదుషాతోఁ బోర సిద్ధపడుము. నీసామనస్యము, నీపవిత్రాశయము, నీనిస్స్వార్థవ్యాపారముఁ గాంచి బుందేలయువకులు నీ మాటఁ బాటింతురు. కొన్నిదినము లిచటనుండి నాకార్యప్రణాళికఁ జూతు నని చెప్పితివి. కాని పరిస్థితులనుబట్టి స్వాతంత్ర్యమార్గము మారుచుండును. కావున నీకు స్వాతంత్ర్యప్రేమకంటె మిన్న యగు వేఱొకమార్గ ముండఁజాలదు. కావున నిచ్చటను నీవు వ్యర్థముగ సమయముఁ గోల్పోవకుము. నీవీరాష్ట్రమునుండి నాసాయముఁ గొని మన మిరువురముఁ గలిసి శత్రువులపై దాడివెడలినచో జనులు కీర్తి నంతను నాకే యాపాదింతురు. దాన బుందేలఖండమున కంత లాభ ముండదు.

కావున నీవు స్వయముగ నీదేశమునకుఁ బోయి యుద్ధముసేయుము. కొలఁదికాలములనే మిత్రశతంబులు వచ్చి నిన్నుఁ గలియును. నీవు కీర్తిలక్ష్మినిఁ జేకొందువు. నీయశమాచంద్రార్కము విలసిల్లును."

శివాజీ యుపదేశము విన ఛత్రసాలునిహృదయ మాశోత్సాహభరితమై యాతనినేత్రములనుండి యానందాశ్రువు లొలుకఁ దొడఁగెను. అతఁ డపారమగు భక్తితో శివాజీపాదములఁ బడెను. శివాజీ ప్రేమపూర్వకముగ నాతని నెత్తి కౌఁగిలించుకొనెను. భరతవర్షస్వాతంత్ర్యేతిహాసమునఁ గల్యాణమయమగు నేతత్ప్రసంగము కడు మహత్త్వపూర్ణముగ నెంచఁబడును.

త్వరితముగ ఛత్రసాలుఁడు దక్షిణమునుండి పయనమయ్యెను. వెడలునపుడు శివాజీ యతనికిఁ బ్రేమపురస్కారముగ నొకఖడ్గము నొసఁగెను. ఆఖడ్గము తనకరమున నున్నంతకాలము స్వయముగ శివాజీ తనతో నున్నట్లు ఛత్రసాలుఁ డెంచుచుండెను.

ప్రచండమగు దేవగఢయుద్ధమున నౌరంగజేబునకే జయము లభించెను. ఔరంగజేబు దక్షిణాపథము నంతను దనవశము గావించుకొనఁగోరుచుండెను. తదిచ్ఛాపరిపూర్తికి మంచియారంభమే యయ్యెను.—ఈవిజయకారణమునఁ బాదుషాయాజ్ఞానుసారముగ ఢిల్లీనగరమున గొప్పయుత్సవము జరిగెను. నగరమంతయు బాగుగ నలంకరింపఁబడెను. దీపికలు వెలిగింపఁబడెను. బాణసంచాలు కాల్పఁబడెను. మసీదులందు నమాజులు పఠింపఁబడెను. విజయమంది మరలి వచ్చు జయసింహునకును బహదూర్‌ఖాన్‌కోకాకును నగరప్రవేశ సందర్భమున నాదరసత్కారములు గావింపఁ బెద్దయేర్పాటులు సేయఁబడియెను. సాయంప్రార్థన యైనవెనుక సూర్యప్రకాశమున నాజయశాలురను స్వాగతము కానుండెను. ఉత్సవప్రియులగు ఢిల్లీనగరవాసులు విలువఁగల

వస్త్రములు ధరించి వితానమండపమున విహరించుచుండిరి. వీరులకు స్వాగత మొసంగుటకుఁ బ్రార్థనానంతరము స్వయముగఁ బాదుషా కూడ నచటకు రానుండె.

నిష్కామముగ ధరాభాగముల కన్నిఁటికి నుపకృతి యొనర్చు సూర్యభగవానుఁడు భూమ్యపరార్థభాగము వెల్గింపఁజనెను. అలంఘిరుపాదుషా మనమునఁ బశ్చాత్తాపము నిండియుండెను. దానిమూలమున నతఁడు కొండొకకాలమున కొక యన్యాయముఁ గావింపనుండెను. కావుననే భాస్కరుఁ డింక నచట నుండుట యనుచిత మని భావించెఁగాబోలు. గజారూఢుఁడై యేతెంచుతరిని బాదుషా కడు నుద్విగ్నుఁడై యుండు నని జను లెంచుచుండిరి. కాని యొకఘోరపాతకము నాచరించు మనుజునిముఖము సిగ్గుచేత నాత్మనిందచేత నెంతశోభాశూన్యమై యుండునో పాదుషాముఖ మాసమయమున నంతశోభాహీనమై యుండుటఁ గాంచ నెల్లరికిఁ గడు నబ్బురమాయెను. సరియే. శతఘ్నులు గర్జింపసాగినవి. కఠోరసమరవాద్యములు మొరయఁదొడఁగినవి. ఇరువురివీరులకు స్వాగతమొసంగుతావున నొకయుద్దండమగు పటభవనము నిర్మింపఁబడెను. ఆభవనమున నొకయత్యున్నతాసనమున నౌరంగజీ బాసీనుఁడయ్యెను. అందుఁ దమతమస్థానముల నుపస్థితులై యుండిన సరదారులు, వజీరులు, నమీరులు మున్నగువారెల్లరు నుఁ బాదుషా వచ్చుటతోడనే లేచి యుచితాచరణముల సలిపిరి. వీరవిజేతల నగరప్రవేశము కాఁదొడఁగెను.

బహదూర్‌ఖాఁ కోకా కొందఱు విశిష్టులగు వీరులతోఁగూడ సదర్పముగ వితానమంటపముదెసకు సాగుచుండెను. కాని నగరవాసులదృష్టి యతనివంకకుఁ బోలేదు. రాజాజయసింహుఁడును నడుమ నడుమ విజయకారణమున మందహాసమొనరించుచు, నొకొ[illegible]

ప్పుడు తనతో నున్న యొకతరుణవీరునితో మాటాడుచు మండపము వంకకు నడచుచుండెను. కాని యతనివైపునకును జనులదృష్టి పోలేదు. అందఱిమనములకు నేత్రములకు నొక్కటే కేంద్రస్థానముగ నుండెను. అందఱియంగుళులు నొక్కదెసకే చూపుచుండెను. అందఱిస్వాంతములు నొక్కవిషయమే యధిష్ఠించియుండెను. దేవగఢ మెవ్వనియతులపరాక్రమమున విజితమయ్యెనో, ఢిల్లీవాసు లెల్లరు ముందుగనే వినియుండిరి. దేవగఢదుర్గమును జయించినవీరుఁడు కడు నుద్బజుఁడు, మాంసలుఁడు—ననుభవశాలి, వయోవృద్ధుఁడుఁ, గాంభీర్యమూర్తియు నై యుండు నని చాలమంది భావించుచుండిరి. కాని రాజా జయసింహునెడమప్రక్క నశ్వారూఢుఁడై యున్న తేజస్వి యగువీరుఁడే దేవగఢయుద్ధమును జయించె నని వినుటతోడనే వారియాశ్చర్యమునకు మేరలేకుండెను. అందఱిదృష్టియు నావీరునిదెసకే పరచెను. బహదూర్ ఖాఁ కోకా పాదుషాచెంతనే యొకయాసనముపై నాసీనుఁడయ్యెను. రాజా జయసింహునకును బాదుషాసమీపముననే యొకయాసనము లభించెను. కాని యెల్లరదృష్టి యమాంతముగ నొకమూల నిలిచియున్న తరుణవీరునియందే లగ్నమై యుండెను. ఆవీరునకుఁ గూడఁ బాదుషాసమీపమునఁ గూరుచుండుట కాజ్ఞ లభించునేమో యని యెల్లరుఁ దలచుచుండిరి. కాని దేవగఢవిజేత యగు నాయువకవీరవరుఁడు నిలిచియున్న దెసకు నౌరంగజేబు బుద్ధిపూర్వకముగఁ జూడకుండుటఁ గాంచ నెల్లరికి నత్యాశ్చర్యము గలిగెను. రాజా జయసింహునకు దీనివలన మిక్కిలి యాశ్చర్యము విచారముఁ గలిగెను. ఏలయన, నతఁడు మొదటినుండియు ఛత్రసాలునివిక్రమముఁగూర్చి పాదుషాకుఁ బూర్ణముగ నివేదించియుండెను. ఇట్టియెడఁ బాదుషా యాదాసీన్యము నాతఁడు సహింపఁజాలకపోయెను. ఛత్రసాలునివిషయమున

నాతఁ డేమియుఁ జెప్పఁజాలకపోవుటచేఁ బాదుషా దేవగఢయుద్ధము మాటనెత్తక విడిచి, మీఁదుమిక్కిలి రాజా జయసింహుని ఛత్రసాలుని నగౌరవించుటకై బహదూర్‌ఖాన్‌కోకాను మిక్కుటముగఁ బొగడెను. ఇది యతనిమనసు నింకను వికలించెను. ఏదియో పల్కుటకై యాతఁడు లేచి నిలిచెను. కాని కపటి యగు నౌరంగజీ బతని కేమియు మాటాడ నవకాశ మొసంగక తానే యతనితో నిట్లనియె:—

"రాజా! మీరు ఛత్రసాలునివిషయమున నేదేని చెప్పఁగోరుచున్నారు కాఁబోలు. దేవగఢమును జయించుటలో ఛత్రసాలుఁడు గూడఁ గొంతశౌర్యముఁ జూపియుండవచ్చును. మీ కించుక తోడుపడి యుండవచ్చును. ఐన నతనియాసేవ యంతగఁ బ్రశంసనీయము కాదు. మహోబారాజవంశము మొదటినుండియు సామ్రాజ్యమునకు నిస్లామునకుఁ గటువిరోధి. చంపతరాయచ్ఛత్రసాలులు విప్లవకారులగుటయందు సంశయ మెంతమాత్రము నుండనవసరములేదు. కావున నతనియెడ నాదరముఁ జూపుటకాని, యతనికున్నతపదవి నొసంగుట కాని యనుచితము. అనావశ్యకము. ఒకసారి చంపతరాయనికిఁ బదవి యొసఁగఁబడెను. దానిపరిణామము మీ కందఱకు విదితమే. వెనుకటివిప్లవోద్ధత్యముల కేమియు దండనము విధింపఁబడకుండుటయే ఛత్రసాలునికి గొప్పయదృష్టము. సామ్రాజ్యమున కిట్టివిప్లవకారుల సేవ యింతయు నావశ్యకముకాదు. మీరు వ్యర్థముగ నతనిఁగూర్చి యేమియు నివేదింపనక్కఱలేదు. ఇంక మీరొనర్చిన సేవలు ప్రశంసనీయములే."

జయసింహుఁడు కడు ఖిన్నుఁడు, లజ్జితుఁడు నయ్యెను. ఏమి పల్కుటకు నాతని కేమియుఁ దోఁపలేదు. ఇంతలో నొకసారి పాదుషాదృష్టి ఛత్రసాలునిపైఁబడెను. అతఁ డాతనిఠీవియుఁ, దేజముఁ,

గాంచెను. అతఁడు మొదట నించుక సిగ్గువడెను. పిదప సుంత తత్తర పడెను. తుదకుఁ గ్రోధశోణితుఁ డయ్యెను. కాని యతఁడు తనయీ స్థితి నేరికి నెఱుకపడనీక వెంటనే వేఱొకప్రక్కకు మరల్చి మెల్లమెల్లఁగ నొకయమీరుతో మాటాడఁదొడఁగెను. రాజా జయసింహుఁడు మాత్రి మిదియంతయుఁ గనిపెట్టెను. మొదటినుండియు [illegible] యున్న యాతఁడు పాదుషావిలక్షణౌదాసీన్యమును గ్రోధమునుజూచి మఱింత యావేశభరితుఁడయ్యెను. ఈపక్షపాత మాతఁడు చూడఁజాల కపోయెను. ఆసమయమున నతఁడు చేయునది లేక యంత[illegible] దిగ మ్రింగి యూరక తనస్థానమునఁ గూరుచుండెను. ఇంతలో ఛత్రసాలుఁ డతనిచెంతకేగి యెదుట నిలువఁబడి యిట్లు పలుకనారంభించెను:—

“ అయ్యా! విషమున కింతకన్న నెక్కుడు పరీక్ష యనావశ్యకము. బాగుగను మాటిమాటికిఁ గడిగినలాభమేమి! ఇఁక నా[illegible]దేశమునకుఁ బోవ ననుజ్ఞయొసంగుఁడు. నామనసు స్వదేశీయులపైననే యున్నది. కేవలము తమయాజ్ఞానుసారము తమ్ము సంతోషపెట్టుటకే—నాకిష్టము లేకున్నను—నే నిచటికి వచ్చితిని. ఇఁక నే నేగదను.”

అని పలికి ఛత్రసాలుఁడు పోవుటకు సంసిద్ధుఁడయ్యెను. ఆసమయమున నెల్లరిదృష్టియుఁ, దుదకుఁ, బాదుషాదృష్టియుఁ దనపైననే యుండుటఁ గాంచి యీయవకాశమును విడువనేల యని యాతఁడు పాదుషాదిక్కై యిట్లనెను:—

“ ఏపదవినిగాని, బిరుదమునుగాని, బహుమానమునుగాని యాసించి నే నిటకు వచ్చియుండలేదు. రాజావారు నాకుఁ బితృవ్యసమానులు. నాపై వారికిఁ జాలమక్కువ. వారియాజ్ఞవలననే నే నచటికేతెంచితిని. సామ్రాజ్యమునకు దాసుఁడనై నేను, దేవగఢదుర్గమును

జయింపలేము. బుందేలురను మసల్మానులదాస్యమునుండి యుద్ధరింపఁ దనప్రాణమునైన నర్పింప సంసిద్ధుఁడగు పురుషుఁడు మసల్మానులకు దాస్య మెట్లు నలుపఁగలుగును? నేను రాజావారితో దక్షిణమున కేగినయుద్దేశము నెఱవేఱినది. వీక్ష్మపాణములోడ నేను దేశగధ మనా జయించితినో యూక్ష్పాణమే బుందేలురను దాస్యవిముక్తులఁ గావింప సౌదామినివలె మెఱయును. బుందేలఖండమందలి ప్రతిబుందేలుఁడును ఛత్రసాలుఁ డని జ్ఞప్తియందుంచుకొనఁదగును. (రాజాజయసింహునివంకఁజూచి) మహారాజా! ఇఁక నే వేఁడుమను. రాఁబోవు వింధ్యవాసినీమహోత్సవమునకు శయసేయఁ దమరించుక శ్రీమఁగై కొనినచో ననుగృహీతుఁడ నగుదును. తమరు నాకొఱ కేమియుఁ జింతిసేయకుఁడు. వింధ్యవాసినీదేవియే నన్ను రక్షించును."

అని పలికి ఛత్రసాలుఁ డటనుండి శరవేగమున బయలుదేఱెను. మున్ను ఛత్రసాలునిపరాక్రమముఁ దెలిసి విస్మితులైన ఢిల్లీవాసులు అతనియావేశభరిత మగుభాషణము వినియు నాకస్మికముగ నదృశ్యుఁడగుటఁ గాంచియు స్తంభితులైపోయిరి. ఛత్రసాలునివిషయము దక్క మఱేప్రసంగమును వారికి రుచింపదయ్యెను.

---

## ఇరువదియైదవప్రకరణము

### విమలవిజయము

“సౌమిత్రీ! ఈలంక స్వర్ణమయమైనను దీనిని నామనస్సిచ్ఛగింపదు. జననియు జన్మభూమియు స్వర్గముకన్న గరీయములు.” అని భగవంతుఁ డగు శ్రీరామచంద్రుఁడు స్వదేశమునకై వెడలునప్పుడు చెప్పియుండెను. భగవంతుని యీపీయూషతుల్యమగు పల్కుల నేదియో యొకరూపమునఁ బ్రత్యేకదేశభక్తుని హృదయమున నిమిడి యుండును. స్వదేశము నిర్ధనమని భావించి ధనసంపాదనమునకై విదేశముల కేగువాఁడు, స్వదేశము నిర్వీర్యమని యెంచి యాత్మశౌర్యబలప్రదర్శనమునకై యితరదేశగతుఁ డగువీరుఁడు, స్వదేశము రసవిహీనమని యెంచి ప్రకృతిసౌందర్యదర్శనాభిలాషియై సమీపస్థములగు దేశముల సంచరించురసికుఁడుఁగూడ స్వదేశపరిత్యాగమనమునకై యెంతటియాతురుఁ డగుచున్నాఁడు? అట్టిచో రత్నఖనిమయమై, మహాశౌర్యసమన్వితమై, సృష్టిసుందరీవిలాసభవనమై యుప్పారు బుందేలఖండమును దర్శింప ఛత్రసాలునిఁ బోలు నద్వితీయమాతృభక్తుఁ డెంతయాతురుఁడై యుండునో, దేశమాతసార్థకజన్ములగు పుత్రులు, భక్తులుమాత్రమే యెఱుఁగఁగలరు. బలీయములగు పితురాజ్ఞాబంధముల ననుభవించి, ముష్కరకర్తవ్యకుద్యముల నుల్లంఘించి, శ్రీరామచంద్రుని మాతృదేశానురాగము స్వర్గసుఖమును దృణీకరించి, భారతవర్షదక్షిణాగ్రమునుండి యుత్తరాగ్రమునకుఁ లంకనుండి యయోధ్యవఱకు కొలఁదికాలమునఁ జేరుచుండెను. అట్లు దేవగిరియుద్ధమునందలి

యద్వితీయపరాక్రమప్రదర్శనసమయమున, శివాజీమహారాజుతోడి సంభాషణకాలమున, ఢిల్లీసామ్రాజ్యమునిర్మూలించుటఁ బ్రసంగించుతఱి, ఛత్రసాలునిశరీరముమాత్ర మాస్థానముల నుండినను మనసుమాత్రము బుందేలఖండముననే సంచార మొనరించుచుండెను. కాని శ్రీరామచంద్రునికి లంక యెట్లు మనసున కెక్కలేదో, విభీషణునియాదరసత్కారముల వీడి యయోధ్యఁ జేరుట యెట్లాతనికి సురలోకసుఖముకన్న మిన్నయై తోఁచెనో, యటులే ఢిల్లీనగరశోభాసౌందర్యముల నిచ్ఛగింపక ఛత్రసాలుఁడు జయసింహునాజ్ఞఁ గైకొని సాధ్యమైనంత శీఘ్రముగ బుందేలఖండముఁ జేరెను. బుందేలఖండప్రాంతముఁ జేరి ముందుముందుకుఁ బోవుచున్నకొలఁది నతనికిఁ బ్రాణనాథస్వామియుపదేశములు బుందేలులహృదయముల నెంతటివిలక్షణమగు పరివర్తనముఁ గలిగించినదో స్పష్టముగఁ దెలియవచ్చుచుండెను.

దర్పణమునఁ బ్రతిబింబమును గొన బాలకు లెట్లు వివిధప్రయత్నము లొనర్చుచుందురో, యట్లే బేతవాతరంగిణ్యంతర్గతము లగు భూజప్రతిబింబములఁ బట్టుకొన నెంచి జలోపరిభాగమున దినకరుఁడు తనస్వర్ణకరములఁ జాచుచుండెను. బేతవానదీతీరమున నిలువఁబడి యిరువురుసుకుమారకుమారులు వానివ్యర్థప్రయత్నముఁ గాంచుచుండిరి. వారివేషచర్యలఁ గాంచినఁ గేవలప్రకృతిసౌందర్యదర్శనాభిలాషతోడనే వా రచటి కేతెంచిరని చెప్పఁజాలము. సృష్టిశోభావీక్షణాగతులగువారి కిన్నియస్త్రశస్త్రములయక్కఱయేముండును! వారిముఖము లింతగంభీరములై యేల యున్నవి! తన్ముఖముల నానందేతరమగు నవ్యవికార మేల ప్రత్యక్ష మగుచున్నది! ఒక్కొక్కయడుగిడ వా రింతసావధానులై యుండనేల?

కాని యింతలోఁ దమగాంభీర్యముఁ ద్యజించి యొకయువకుఁడు

తనసహచరునితో నిట్లనియె:— "విపులదేవా! వీరోచితములగు శస్త్రాభరణాదికముల ధరించినవారు తమవిచారాచరణములచేఁగూడ వీరోచితమగు స్వరూపము నొసంగవలయును. లేకున్న నసామంజస్యదోషము జనించి నటనయంతయు వెలువడును.

తనసహచరునిఁ గాంచుచు విపులదేవుఁ డిట్లనెను:— నీవు నాకై సుంతయు విచారింప నక్కఱలేదు. నే నెల్లప్పుడు నీవేషముననే యుండుటచే నేతన్నిర్వహణము నాకు బాగుగఁ దెలియును. కాని విపులదేవా! నీచింతయే నాకన్నిటికన్న నెక్కుడుగ నున్నది. నేనెన్నిదిది నాళ్లనుండియు నొకేరీతి నీకు నేర్పుచునే యున్నను నీవట్లే పొరపడు చునే యుందువు.

విజ— మంచిది. నేనెప్పు డట్లు పొరపడితినో యెఱింగింపుము. ఎవరైన విజయదేవా! యని పిలిచిన నే నెప్పుడు వ్యాకులపడితిని? సేవకులనుండి నమస్కారము లందుకొనుసమయమున నే నెప్పుడు లజ్జించితిని? నాయొుగమునఁ బౌరుష మెప్పుడు కొఱతపడెను? నీవు నానడకను బలుమాఱు లాక్షేపించియుంటివి. కాని యిచటి క్షేత్రం చుతరి నాగమన మెంతపౌరుషవంతమై యుండెను? విమలదేవా! ఈవేషపరివర్తనమున నీవు తప్పక నాకు గురుఁడవే యగుదువు. కాని యిప్పటివానర్తనముఁ గాంచిన నీవు తప్పక నాయెదుట నోటమి నొప్పుకొనవలయును.

విమ— అవునవును. ఏలకాదు! నేటినీగమనము నేమనవలయును? నీవు నడచుచుండఁ జూచిన జలనిధిలోఁ దరంగము పొగడుచున్నట్లున్నది. నాఁటిపాఠముల బాగుగ నప్పగించి పూర్వపాఠముల నన్నిటి మఱచినశిష్యునిఁ గాంచినగురువున కెంతటియానందము కలుగఁ జాలునో, యట్టియానందమే నేఁడు నీనడకను నిన్నుఁ గాంచిన నాకుఁ

గలుగుచున్నది. విజయదేవా! ఛత్రసాలునిఁ గలిసికొనఁ బోవుమార్గమునసే నీదృష్టి యింతటికోమలమైపోయినది. కపోలములు లజ్జారుణితములైనవి. వదనము మనోహరమగు ఘర్మబిందుకిరీటము ధరించియున్నది. ఇఁక ఛత్రసాలుసంయోగమున నీదశ యెట్లుండునో!

జయ—(మందహాసముతో) నీదశ యెట్లులుండునో నాదియునట్లులే. అత్యల్పములగు నన్యులదోషములఁ గాంచఁ గల్గుటయు, నాత్మదోష మెంతగొప్పదైనఁ గాంచఁజాలకుండుటయు, మానవమాత్రునికి సహజగుణము. నీయందలి దానిని మించిన విశేషగుణ మేమనా నాత్మదోషములు నీకు నాయందుఁ గన్పట్టుటయే. సుందర[illegible] నీనేత్రము లమృతవర్షముఁ గురియుచున్నవి. చంచ[illegible] తాండవమాడుచునే యున్నది. నీసుందరవదనము భావప్రకాశకమగు నానందము లొలుకుచున్నట్లున్నది. కాని యిట్టి యవస్థలో ఛత్రసాలునియెదుటికిఁ బోవుచున్నట్లు నీవే యెఱుఁగవని తోచుచున్నది.

విమ—విజయదేవా! జయసాగరసరోవరమున మునుఁగుసమయమున నే నేవేషమున నుంటినో నీకుఁ దెలియును. ఆసమయమున స్త్రీవేషముఁ గాంచి రవ్వంతయు సందియమందఁజాలని ఛత్రసాలుఁడు పురుషరూపమున నున్న నన్నెట్లు సంశయించును? పదునాలువత్సరములనుండియు నిరంతరపురుషవేషమున నుండి ప్రజలచే యువరాజనియు, రాజపుత్రుఁడనియు భావింపఁబడి, వరరూపమున వివాహమొనరింపఁబడి, రాజుగఁ బట్టాభిషిక్తుఁడై యున్న నన్నీతఁడు పురుషుఁడు కాఁడు, వనిత యని యెవ్వ రనఁగలరు! నావాస్తవికస్వరూపవిషయమున ఛత్రసాలుని కెట్టిసందియముఁ గలుగలే దని నేను దృఢముగ విశ్వసించుచున్నాను. అచిరమునసే నేను ఛత్రసాలునిస్వాగతం

త్రియసమరమునఁ బోల్గొనెదను. కాని నీవిషయమున నా కొక్క సంశ దియము జనియించుచున్నది. గులాబిపూలఁబోలు నీకపోలములు, స్నిగ్ధసుందరములగు నీహస్తములు మధురమందహాసము, మృదుగా త్రిముఁ గాంచి నీ వంతఃపురమున నుండఁదగుదువు కాని యుద్ధరంగ మునఁ బోరాటమునకుఁ దగ వని ఛత్రసాలుఁ డెంచును. నీవు విజయ దేవునుండి విజయుఁడవై ఛత్రసాలునియంతఃపురము వెలుంగఁజేయ నగును.

విజ—(నవ్వుచు) నావర్తమానహృదయేశ్వరుఁడు నన్నట్టు లొనర్ప ననుమతించునా!

విమ—ఈవివాహము తుద కెట్లుగఁ బరిణమించునో, వివా హంపుదినముననే నిశ్చయింపఁబడియె. ఎచ్చట విజయ—కానుకాదు. విజయదేవుఁడు నివసించుచుండునో, యచ్చటనే విమలదేవుఁడు నుం డును.

విజ—నీలౌకికసహధర్మచారిణిని సహవాసినిఁగఁ జేసికొనఁగో రుచున్నట్లున్నది. నాథా! సమయము లభించినప్పుడు నీయీప్రియ పత్నిపై నీయనుగ్రహముఁ జూప మఱువవుకదా!

విమ—విజయదేవా!

విజ—విజయదేవా! విజయదేవా! యని పట్టుకొంటివేమి! ఇట్టియేకాంతస్థానమున నిజనామమున నేల పిలువవు! నాథ్యమైనంత వఱకు మన మిరువురముమాత్రమే కలిసియున్నప్పుడు నన్ను విజయా యనియే పిలుచుచుండుము. దాననే, నాకధికతమమగు నానందము కలుగును.

విమ—కాని నీయాఙ్ఞకానందమునకై నేను ఛత్రసాలుని సహవాససుఖమును వీడఁజాలను. బుందేలఖండస్వాతంత్ర్యప్రాప్తి

యగువఱకు మనమిరువురము విజయదేవవిమలదేవులుగనే యుందము. ఏలయన, నీరూపముననే మనము ఛత్రసాలునియంతికమున నుండఁగలుగుదుము. బుందేలఖండము స్వతంత్రమైనప్పుడు విమలదేవుఁడు విమలగను విజయదేవుఁడు విజయగను బరివర్తనముఁ జెందుటలో విలంబముండదు.

విజ—విమలదేవా! నీమాట యెంతయు బాగుగ నున్నది. ఏయాశయము సిద్ధింప మనము రాజభవనమునుండి బయల్వెడలితిమో, యది సిద్ధించుదనుక మనమీ మాయావేషములతోడనే యుండుట మంచిది. ఛత్రసాలునకు మననిజరూపము తెలియఁబడిన మనలను యుద్ధరంగమున కేల కొనిపోవును! మన మాతనికిఁ బరిచర్య యెట్లొనర్పఁగలము!

విమ—విజయదేవా! భావిసౌఖ్యమును దలఁచికొని మనము మిగుల జాగరూకతతో మెలఁగవలయును. ఛత్రసాలుఁడుఁ, దదనుచరులు మననిజవేషముల గుర్తెఱుంగకుండ నుండుట మనము ముఖ్యముగ మనసునం దుంచుకొనఁదగువిషయము. లేకున్న నాట యంతయుఁ జెడిపోవును. కాని విజయదేవా! ఛత్రసాలునికడ కేగి యతనికి సేవఁజేయ మనము సంసిద్ధులమైతిమికాని, యతని కెట్టిసేవఁ జేయవలయునో మనము తెలఁపలేదు. నీవెట్టికార్యము కోరఁదగునో నిశ్చయించుకొంటివా!

విజ—(స్థైర్యముతో) నేను సమరకాలమున హస్తమునఁ గృపాణము ధరించి పోరాడుటకును, నెల్లరును శిబిరములలో నిద్రించుసమయమున ఛత్రసాలునిశిబిరములోని కేగి యతనికి సేవఁజేయుటకును నిశ్చయించుకొంటిని.

విమ—(సాలోచనముగ) ఎనిమిదిజాములు ఛత్రసాలునికి

సేవఁజేయుట నాకత్యంతానందకరముగ నుండును. కాని యుద్ధరంగ మున నిలువఁబడి కత్తిగూయుటెట్లు! కేవలశోభామాత్రముగ నేఁటిద నుకఁ గృపాణము వ్రేలాడవేసికొని తిరిగిననేను దాని నొరనుండి బయ ల్వెడలించి శత్రువులపై నెట్లు ప్రయోగింపఁగలను? నా నాశ్రే ... ణులగు మనుజుల ఖడ్గాహతుల నెట్లు కావింతును? రక్తప్రవాహములను శవపర్వతములను గాంచిన మనోనేత్రము లెట్లు స్థైర్యము వహించి యుండఁగలవు! విజయదేవా! మనము సమరరంగమునకుఁ గేవలాప రిచితులము! కృపాణహస్తులమై మన మాత్మని కెట్లు ... గ లము!

విజ—విమలదేవా! నీ వీయన్నివిషయములఁ జింతింపకుము. మహాపరాక్రమవంతులగు వీరులకుఁగూడ సమరరంగప్రవేశమున కొక తూరి ప్రథమదిన ముండనే యుండును. శూరులు, సాహసులుఁ, గఠి నమనస్కులు నగుటకై వారును సమరదేవతకడ ననేకపాఠములఁ జదువవలసియే యుందురు. ఛత్రసాలునికిఁ బరాక్రమశాలులగు తత్సైని కులకుఁ దోడుపడుటకై భగవతియగు వింధ్యవాసినియే యాహవరం గమున సంచరించుచుండును. ఆమెయే మనలను ఖడ్గచాలనసమ ర్థులఁ జేయును. ఆమెప్రభావముననే కార్యసిద్ధి యగును ఛత్రసా లునికి విమలవిజయప్రాప్తి కలుగును.

ఇట్లు నుడివి విజయదేవుఁడు మెల్లమెల్లగ ముందునకు సాగెను. నాల్గడుగులిడి వెనుదిరిగి చూడ విమలదేవుఁడు పులకితవదనుఁడై య చ్చటనే నిశ్చలముగ నిలువఁబడియుండె సమాపస్థమగు నొకచెట్టునీడ నుండి వచ్చుచున్న యొకవ్యక్తినిఁ దదేకదృష్టిని జూచుచుండుట కాన వచ్చెను. అతనికది మిగుల నచ్చెరువు జనించెను. అతఁ డేదియో

చెప్పనుండ నింతలోఁ బరిచితముఁ బ్రేమమయము నగు మధురస్వరము వినఁబడెను.

"మిత్రులారా! నిలువుఁడు, నిలువుఁడు. నష్టమగు స్వాతంత్ర్యమును మరలఁ బొందుటకై మీయట్టిమృదులసుకుమారగాత్రులగు యువకులు సమరభూమిఁ జొఱ సంసిద్ధులు గాఁగా ఛత్రసాలునికి విమలవిజయప్రాప్తికి విలంబముండదు. బుందేలఖండస్వాతంత్ర్యకేతనచ్ఛాయ మీ కత్యంతప్రేమమయస్వాగత మొసంగుచున్నాను."

విమలవిజయదేవులు తేజస్వంతమగు ఛత్రసాలునిముఖమును దదేకదృష్టిఁ జూచుచు మాటాడక నిలువఁబడిరి.

ఛత్రసాలుఁడు తమ్ము సమీపించుకొలఁది వారియానందాశ్చర్యములు పెంపొందుచుండెను. విమలవిజయదేవులసౌందర్యము లోకదాని నొకటి మించియుండెను. వారి ముఖభావపవిత్రత వైమల్యము గూడ లజ్జితము నొనరించుచున్నట్లుండెను. వారు కుసుమకోమలులై యుండిరి. వారినేత్రములు విద్యుత్ప్రకాశములై యమృతము వర్షించుచున్నట్లుండెను. శరీరము స్నిగ్ధమై సుందరమై యుండెను. తచ్ఛాయ పరమమనోహరమై యుండెను. వారిని గాంచఁగనే ఛత్రసాలుఁడు కొలఁదిసేపటిదనుక సంభ్రాంతుం డయ్యెను. జయసాగరసరోవరమందలి దేవీమానవీసౌందర్యములఁ గాంచిననాఁడు ఛత్రసాలుని మానసికావస్థ యెట్లుండెనో నేఁడు నట్లే యుండెను. అతఁడు వారి ననురాగపూర్వకముగఁ జూచుచుండెను.

తుదకు విమలదేవుఁ డెట్లో సాహసించి సవినయముగ నమస్కారమాచరించి యిట్లనియె:—మహారాజా! తమసేవకై విమలదేవుఁడు స్వశరీరము నర్పింప సంసిద్ధుఁడై యున్నాఁడు.

ఛత్ర—ఎవ్వరు? విమలదేవుఁడా?

విజ—మహారాజా! ఈవిజయుండుగూడఁ దమసేవకై స్వశరీరము నర్పించుచున్నాఁడు.

ఛత్ర—మఱి నీవు విజయుఁడవా? ఈవిమలవిజయులిరువురు నేఁటినుండి నావారైనారు కదా! మంచిది. నాకు నేఁడు విమలవిజయుల లాభము గలిగినది. రక్తముఁ బ్రవహింపఁ జేసి ప్రాణములనర్పించి శౌర్యముఁ జూపి లభించెడువిజయముకన్న నీవిమలవిజయ మెంతయుఁ బవిత్రతరము. అధికతరశుభదాయకము. విమలా! నపరిచితుఁడవగు నోవిజయా! మీరు నాతో భీకరరణరంగమున దుమికెదరా?

విమ, విజ—(ఒక్కసారిగ) చిత్తము మహారాజా! శిబిరమున విశ్రాంతిసమయమునఁ దమకు సేవఁజేయుట మా కెంతమంచిపనిగఁ దోఁచుచున్నదో సమరరంగమునఁ దమశత్రువులతోఁ బోరాడుటయు మాకంతమంచిపనిగనే తోఁచుచున్నది.

ఛత్ర—(మిగులఁ గుతూహలమున వారిఁ జూచుచు) సుకుమారకుమారులారా! పుష్పకోమలములగు మీతనువులఁ గాంచిన మీరు సేవఁజేయుటకుఁగాక సేవ నందుటకు జన్మించితి రని తెలియవచ్చును. ఛత్రసాలుఁడు తనకు సేవచేయించుకొనఁ గోరఁడు. కాని మీయట్టిసుకుమారులకు సేవసేయుటయందే నా కధికతరానందము గలుగును. మీరు నాతో శిబిరమునకు రండు. (ప్రాణనాథస్వామివాక్యోపదేశమున బుందేలఖండమంతయు నెంత సంభ్రమమున మేల్కాంచినది! ఉద్యానవనములయందలికుసుమములయందును, గగనమునందలినక్షత్రములయందును, గృహములయందలిశిశువులలోను లభింపని కోమలత కేవలస్వాతంత్ర్యమునకై యాహవక్షేత్రమున నటుక సిద్ధముగనున్నదని బుందేలవీరు లెఱుంగుదురుగాక. రణరంగగాములగు నీసుకుమారయువకులఁ గాంచినఁ బ్రత్యేకవీరునియందు నాత్మాభిమా

నను జనియించును. రణోత్సాహతేజ ముద్భవించును. మీయట్టియ లోకసౌందర్యకాంతులును, బవిత్రకోమలులు నగు దేవదూతలను బుందేలఖండస్వాతంత్ర్యయోద్ధులుగఁ జూచి వింధ్యవాసినీదేవి ప్రసన్నచిత్తయై మాకు వరముల నొసంగి దేశము స్వతంత్ర మొనర్చును.

విను—మహారాజా! మేము [illegible] నిశ్చయించుకొని [illegible].

విజ—[illegible] శివశంకరుఁ డెచట నున్నాఁడో చెప్పనక్కఱ లేదు. పరమేశ్వరుఁ డెచట దొరకునో భక్తుల కెఱింగింప నక్కఱలేదు. భృంగమునకు మకరంద మేడ లభించునో తెలియఁజెప్పఁ బనిలేదు. మహారాజా! భవదీయసేవార్థులమై స్వస్థానమునుండి వెడలునప్పుడు భవదీయతేజము గుప్తరూపమున మాకు మార్గముఁ జూపుచుండెను. సద్గుణమాధుర్యము మాశ్రమము నెడబాపుచుండెను. ఇట్లగుటఁ దమ జాడల నరయ మాకుఁ గష్టమేమియుఁ గలుగలేదు.

విమ—ఓర్ఛారాజమందిరము వీడిన క్షణకాలములోనే మిమ్ముఁ గలిసికొంటిమి. దీని మూలముననే మామార్గదర్శకుఁ డెంతచతురుఁడో మీ రెఱుఁగఁగలరు.

ఛత్ర—విమలదేవా! నీతల్లి యగు హీరాదేవి నీవు స్వాతంత్ర్యపతాకాచ్ఛాయ నిలిచి పోరాడవలయు నని యిచ్ఛగించుచున్నదా?

విమ—ఆమెకు నాయీకార్యము సమ్మతమేయైన నే నీవిధముగ రహస్యమున భవనమునుండి బయల్వెడనేల! ఓర్ఛాసింహద్వారమున స్వాతంత్ర్యపతాకస్థాపన మొనరించి, భేరీమ్రోగించి, ప్రచండ [illegible] జయధ్వాన మొనర్చి చతుర్భుజశుభనామోచ్చారణముఁ [illegible]గావించుచు, వేలకొలఁది వీరుల వెంట నిడికొని తమసహాయ

మునకై వచ్చియుండెడివాఁడను. కాని నేనంతటిభాగ్యవంతుఁడనా? మహారాజా! తమతండ్రిగారిప్రయత్నములకు నాతల్లి యెంతటివిఘ్నములఁ గల్పించెనో తమప్రయత్నములకుఁగూడ నట్టివిఘ్నములనే కల్పింపనున్నది. తమరు బుందేలఖండమునకు మరలివచ్చితి రనియు, సైన్యమును బ్రోత్సాహమునఁ బ్రోగొనర్చుచున్నా రనియు బుందేలులు గుంపులు గుంపులుగ వచ్చి మిమ్ముఁ జేరుచున్నా రనియు విని నప్పటినుండి యామె మిగుల వ్యాకులయై యున్నది. ఎల్లుండి యామె తనసభాభవనమున స్వపక్షనాయకులసభ నొకదానిని మరల జరుపనున్నది. అందుఁ దమప్రయత్నముల నెట్లు నిష్ఫలముల నొనర్పవలయునో తమసహాయకుల నెట్లు నాశనమొనరింపవలయునో యాకునంశము చర్చింపఁబడును."

ఛత్రసాలుఁడు తదేకధ్యానమున విమలదేవునిమాటల నాలకించుచుండెను. విమలదేవుఁ డిట్లు చెప్పసాగెను:—కాని యాసభలోఁగూడ నామెయాశయము నెఱవేఱదనియే నే నెంచుచున్నాను. ఏలయనఁ బ్రాణనాథస్వామియొక్కయు, దలపతిరాయనియొక్కయు విరతపరిశ్రమమున బుందేలు లెల్లరుఁ దమయుత్తమకర్తవ్యము నెఱిఁగినారు. కాబట్టియే ప్రథమమున నామెపక్షమున నుండిన యనేకులగు రాజులును, నాయకులును, నిప్పు డామెపక్షము వీడి తమ్ముఁ జేరుదురు.

ఛత్ర—విమలదేవా! నీమాట యెంతయు బాగుగ నున్నది. ప్రాణనాథస్వాములవారు తమదివ్యవాణిచే బుందేలఖండమున విలక్షణమగు పరివర్తనముఁ గలిగించినారు. ఇప్పటివఱకు నాశిబిరస్థానము నిర్ణయించుకొనలేదు. యుద్ధము నింకను బ్రకటింపలేదు. నాయాశయములఁ బ్రజల కింకను దెలుపలేదు. ఐనను సంఖ్యాతీతులగు బుందేలయువకులు నాకై వెదకుచున్నారు. విమలదేవా! నేనొక్కమాట నీత

ల్లిని గలిసికొనఁగోరుచున్నాను. ఆమెపక్షమువారి నొకమాఱు సమాధానపఱుపఁ గోరుచున్నాను. స్వాతంత్ర్యవిరుద్ధములగు ప్రయత్నముల వా రేల యొనర్చుచున్నారో విని యటుపై వారిని న్యాయపక్షావలంబనమునకై ప్రార్థింపఁగోరుచున్నాను. కావున నెల్లుండి జరగెడిసభలోని కేస్తైనను బోవలయు నని యెంచుచున్నాను.

విజ—రాణి యగు హీరాదేవియు నామెపక్షమువారు మీ మాటల విందు రని మీ రాశించుచున్నారా!

ఛత్ర—విందురుగాక వినకుందురుగాక. కాని నే నొక్కమాఱు వారికిఁ దప్పక బోధించెదను. అన్యోన్యమాత్సర్యదహ్యమానము లగు వాత్మలు, ప్రార్థనలచేతను, మృదువచనములచేతను శాంతము లగు నని నావిశ్వాసము. కావున నేను మానావమానములను సుఖదుఃఖములను జింతింపక నాబుండేలసోదరుల స్వాతంత్ర్యదేవీభక్తులుగ నొనర్చెద. విమలదేవా! చతుర్భుజాలయవిగ్రహధ్వంసమునకై ఫిదాయీఖానుఁ డీదినము నిర్ణయించినాఁడు.

విమ—మొదటిసారి తత్ప్రయత్నమున నతఁడు వైఫల్యము నందుటఁజేసి యతఁడు ఢిల్లీనుండి తద్ధ్వంసమునకై రాజాజ్ఞఁ దెప్పించుకొనెను. రెండుదినములకుఁ దరువాత సభాభవనమున హీరాదేవిసభ జరుగును. సభ జరుగుసమయముననే ఫిదాయిఖానుని సైనికు లేగి దేవాలయము ధ్వంస మొనర్తురు.

ఛత్ర—చాల బాగున్నది, కాని రణదులహఖానుఁ డేల ధాంధేరమునకుఁ బోయెనో మీ రెఱుఁగుదురా!

మొదట విమలదేవుఁడు కొలఁదిసేపటిదనుక మాటాడకుండి విజయదేవునిదెసఁ జూచుచు నిట్లనియె:—“కంచుకిరాయలు తనరాజ్యము నాతని కిచ్చివేయ నిశ్చయించెను. ఇందులకే యాతఁడు నిన్నటి

సాయంకాలమున మహాడంబరముతో ఘాంధేరమునకుఁ బోయినాడు.

ఛత్రి—(సాశ్చర్యముగ) ఏమంటివి! కంచుకిరాయలు తనరాజ్యము రణమలహాఖానున కిచ్చివేయునా! దుర్బలులగు హైందవులశక్తి నీరీతి ధ్వంసమొనర్ప సమకట్టుట కతని కేమి పట్టినది! అతని కెవ్వరుఁ జెప్పవారు లేరా!

విమ—మహారాజా! మొదటినుండియు నతనియభిప్రాయములు గుప్తములుగ నుండలేదు. అదియుఁగాక "నీరాజ్యము రణమలహాఖానున కిచ్చివేయుము. లేకున్న ఛత్రసాలుఁ డేతెంచి నీరాజ్యము నాక్రమించి లోఁబఱచుకొనును" అని నాతల్లి యతనికిఁ జెప్పెను. విజయవివాహ మొకసాధారణమాండలికునికుమారునితోఁ గావలయు ననియు, తారలకు రాజ్యమున నల్పభాగమైన నొసంగరా దనియుఁ గూడ నిశ్చయింపఁబడినది. ఘాంధేరరాజ్యనివాసులును, మంత్రి యగుసజ్జనరాయలును దానికి నొప్పుకొనలేదు. కాని కంచుకిరాయ లెవ్వరిమాటలను వినఁడయ్యె.

ఛత్రి—ఓయీశ్వరుఁడా! నీవే దయఁదలఁచి వీరికి సుబుద్ధి నిమ్ము. విమలదేవా! నీవీసమయమున నీభవనమునకు మరలి పొమ్ము. ఘాంధేరరాజ్యప్రజలసహాయ మిప్పు డత్యంతావశ్యకమై యున్నది. హీరాదేవి సభజరుపునాఁడు నేను నిన్నుఁ గలియుదును. నీరాజ్యమంతయు సైన్యమంతయు నాకు సాయమొనర్ప సంసిద్ధమైయున్నది. నీసేనాని యగు చాముండరాయలు నాయాజ్ఞకై నిరీక్షించుచున్నాడు. నీవీపత్రము నాతనికిమ్ము. హీరాదేవిసభ యారంభము కాగనే చాముండరాయనిఁ గూడి నీసైన్యమునంతనుఁ గొని ఫిదాయిఖానునిసైన్యము ముట్టడింపవలయును. నీసాయమునకై యెన్నికఁ గన్న బుందేలవీరులఁ గొందఱ వెంటనిడికొని సరియగుసమయమునకు దలపతిరాయలటఁ జేరుకొనును. చతుర్భుజభగవానుఁడు నిన్ను విజయి నొనర్చుచు."

విమలదేవుఁ డటనుండి మరలిపోవ సిద్ధముగ నుండెను. కాని విజయదేవుఁ డటనుండి కదలఁగోరుట లేదు. అది చూచి విమలదేవుఁడు "ఇవ్వు డేమి యాలోచించుచున్నావు! నడువుము. మరలిపోదము." అని విజయదేవునితో ననెను.

విజయు — నే నిచ్చ డట వచ్చి చేయునదేమి! వన్నెదియైన కార్యము నిర్వహించుకొననిమ్ము. మహారాజా! తమయాజ్ఞయైన నేను తమతో నుండి తమ కేదైన సేవఁజేయుదును.

ఛత్రి — విజయా! నా కెట్టిసేవయు నక్కఱలేదు. ఐనను మీతోడనుండినఁ నాకు స్వర్గసుఖము లభించును. విమలా! నీవు నీమిత్రుని రెండుదినములదనుక వీడుము. అటుపై మరల నీతనిఁ గలిసికొందువు.

విమ — మహారాజా! దాన నా కేమియు హానిలేదు. కాని యీసమయమునఁ దమరు విజయునిపైఁ జూపిన యనుగ్రహము నాపైఁగూడఁ జూప వాగ్దానమొసంగుఁడు.

ఛత్రి — విమలా! విజయుఁడు నా కెంతటి ప్రియుఁడో నీవు నంతటిప్రియుఁడవే. ఈవిమలవిజయులాభము నా కెంతయు సుఖావహము. మీయిరువురిపైనను నాకు నిర్వ్యాజమగు ననురాగము గలదు."

విజయవిమలుల యానందమునకు మేరలేకుండెను. కొంతసేపటికి విజయదేవుని కోమలహస్తస్పర్శసుఖ మనుభవించుచు ఛత్రసాలుఁ డటనుండి వెడలిపోయెను.

విమలదేవుఁడు తనమందిరమునకు మరలివచ్చునప్పటికి నవహితయను నొకకాంత హఠాత్తుగ జారిపడి యేగెనని యతని కెఱుక వచ్చెను! అతఁ డత్యంతతాత్పర్యమునఁ దదన్వేషణమగ్నుఁ డయ్యెను!

# ఇరువదియాఱవప్రకరణము

## ఛత్రసాలజయజయధ్వానము

చంపతరాయలు వీరస్వర్గము నందిననాఁటినుండియు హీరాదేవి తాను కృతకృత్యురాల నైతి నని తలఁచుచుండెను. చంపతరాయలు వధియింపఁబడె ననియు, మహీబా యాక్రమింపఁబడె ననియు, సుభద్రాచ్ఛత్రసాలులు గతిమాలి యరణ్యములపాలైరనియు నేఁడు కాకున్న రేపైన వా రంత మొందకతప్పదనియు నామె యేనాఁడు వినెనో, నాఁడే చంపతరాయలు సమూలముగ విధ్వస్తుఁ డయ్యె ననియుఁ దనజీవితప్రధానకర్తవ్యము ముగిసెననియు నామె [illegible] ఇంక నేయే చోటులనుండి యేయేవిధములఁ దనప్రా[illegible]యిశ్చిత్త మొనరించుచుం దు శేషజీవనముఁ గ[illegible] యనియు నామె నిశ్చయించుకొనెను. [illegible]కులి మూలమున ఛత్రసాలసుభ[illegible] [illegible]కముయుఁ డెలియకుండుటచే వారి నిరువురిని గాటిమెకము లంత మొందించియుండు ననియు నిశ్చయించుకొని యామె మిగులఁ బ్రసన్నయై యుండెను. ఆసమయముననే శుభకరణమహారాజు సమరపరిత్యాగతుఁ డయ్యె. శుభకరణునితోఁడి కుణికసమావేశము నామె చాలకాలమువఱకు మఱవలేదు. కాని యానడుమనే విమలదేవునివివాహముఁ బట్టాభిషేకము జరుగుటనే నాయుత్సవమున నామె శుభకరణుని మఱచుచుండెను. ఇంతలో దేవగఢయుద్ధముఁ బౌము పాఠకుమున నుండి పోరాడి ఛత్రసాలుఁడు మహద్విజయము నందె నని యామె వినెను. ఆమెకు మరల నిప్పుడు భావ్యావస్థ స్మృతికి వచ్చెను. బుందేలులయాశయము

తప్పు డింతయధికముగఁ బరిపక్వమగుఁ గాంచు నని యామె స్వప్నమున నైనఁ దలఁచియుండలేదు. శుభకరుఁడు నాపక్షమున నుండ పోరాడకున్నను, నే నొంటరిగనే సమయము చిక్కినప్పుడు ఛత్రసాలునిఁ బరాభూతు నొనరింపఁగల నని యామె దృఢముగ నమ్మియుండెను. కాని ప్రాణనాథస్వామి ప్రజాశయముల నెంతగ విపర్యస్తములఁ గావించెనో, యాతఁడు ప్రజలభక్తిమాలస్యముల నెంతగఁ బాఱఁద్రోలెనో, దాస్యవిమోచనప్రయత్నము తమకర్తవ్య మని ప్రజ లెంతగ భావించుచుండిరో, తనప్రజలుఁ దనదుఁ దనసైన్యమే తనకుఁ బ్రతిపక్షమై యాయుధము నెత్త నెంతగ సంసిద్ధమయ్యెనో, యామె యూహింపనైన లేదు. స్వపక్షములోనిరాజు లెల్లరు వెనుకటిరీతిఁ దనకు సాయ మొనర్తు రనియు తనప్రత్యేకవచనమునకు సమ్మతింతు రనియు, బుందేలవీరు లెల్ల రధికవేతనముల నంది తనయానతిఁ బాలింతు రనియు నామె పూర్ణముగ విశ్వసించియుండెను. కావుననే యామె ఛత్రసాలుఁడు సైన్యసంగ్రహ మొనర్చుచున్నాఁ డని వినఁగనే స్వపక్షమునందలి రాజులకు నాయకులకు నెల్లరకు సభానిమంత్రణము లంపెను. సభాదినము నియత మొనరించి రాష్ట్రపాలకుఁడగు ఫిదాయీఖాను తదధ్యక్షుఁడుగ నుండ నేర్పాటొనరించెను. ఓర్ఛానగరవాసుల నేత్రములు మరల నమావేశసభాభవనంపు వెస కాకృష్టము లగుచుండెను.

నేఁటిహీరాదేవివేషము పురుషవేషమా స్త్రీవేషమా యని నిశ్చయించుట మిగులఁ గష్టముగ నుండెను. ఆమె తనమస్తకముపై రాజాపర్వతసింహశిరస్త్రాణ ముంచుటచే ముఖాకృతి పౌరుషవంతమై కన్పట్టుచుండెను. ఆమె యుత్తరీయాంచలము భుజములనుమాత్రమే యంటియుండెను. హస్తముల రత్నాచ్ఛన్నమగు కృపాణ మొగయు

చుండెను. ఆమె సభామందిరమున కెప్పుడు వెడలునా యని విమల దేవుడు నిరీక్షించుచుండెను. కొలదిసేపటి కామె భవనమునుండి వెలువడి యుపయుక్తమగు నలంకరణములతో సభామందిరముదెస కేగెను. విమలదేవుడు నానందమున నశ్వారూఢుడై శీఘ్రముగ సేనాని యగు చాముండరాయనికడ కేగెను.

హీరాదేవి సభాభవనముం జేరునప్పటికి ఫిదాయీఖానుం డక్కడ పీఠముపై నాసీనుడై యుండెను. మండపమంతయు బుందేలఖండ పురాజులతోడను, సర్దారులతోడను నిండియుండెను. ఆమె పురుష గమనమున ఫిదాయీఖానునియొద్దం జేరి యచ్చటనే యొకయాసనముపైఁ గూరుచుండెను. ఆమెవ్యవహారముం గాంచి యెల్లరుం జకితులైరి. అప్పుడే హీరాదేవి లేచి యీరీతి గర్జించెను. "ఢిల్లీపాదుషావారు బుందేలఖండమున విద్రోహమును విద్రోహులను సమూలముగ ధ్వంసమొనరించి మన కెంతటిమహోపకారముం గావించియున్నారో మీరెఱుంగుదురు. ఈదేశమును దాము స్వాధీనమొనర్చుకొని సరదారు ఫిదాయీఖానుంబోలు నరరత్నము దీనిపై నధికారిగ నియమించి యీదేశమందలి సామ్రాజ్యహితులగు ప్రజలహితముం బెంపొందింపఁ బాదుషావా రెంతయు సాయపడినారు."

నడుమనే యొకయువకుడగు నాయకుడు లేచి యిట్లనెను:—

"రాణీ! ఈసమయమున నిచ్చట నుపస్థితులైనవా రెల్లరంధు లనియు బధిరు లనియు మూర్ఖు లనియు నీ వెంచుచున్నావు కాబోలు! ఫిదాయీఖాను కాని పాదుషావారుగాని మన కేమి హిత మొనరించినారు? మహోబాధిపతి యగు చంపతరాయనిప్రాణముల హరించి మరల బుందేలఖండముపై నన్యాయపూర్వకమగు జిజియాపన్ను విధించినాడు. మనప్రాణాధికములగు దేవాలయము లతిశీఘ్రముగ విధ్వస్తము

లగుచున్నవి. మనలను మనధర్మమును సమముగ వీరు నశింపఁజేయు చున్నారు. ఇట్టియనర్థ[illegible] మహితము పెంపొందుచున్నదను టేటి మాట!

హీరా—(సోద్రేకముగ) నీ విట్టిమాటలచే నన్నుఁ బాదుషా వారినిఁ గూడ నవమానించుచున్నా నని యెఱుంగకున్న ట్లున్నావు. దీనిపరిణామము నీవిషయమున నెంతభయంకరముగ నుండునో యూది యు నెఱుఁగనట్లున్నావు. ఇంకను నీవు పిల్లవాఁడవు. సర్దారుఫిదాయీ ఖానునియొక్క కాని పాదుషావారియొక్క కాని యౌదార్యము నూ హింపనైనఁ దగవు. నీవు సమర్థుఁడవై బుద్ధిమంతుఁడ వగుదనుక మేము చెప్పెడి మార్గము ననుసరించుటయే నీకుఁ గర్తవ్యము. శుభ కరము.”

సభయందే యొకముదుసలియేలిక యిటు లనుచు లేచె:—

“రాణీ! ప్రజల కుపదేశ మొనరించి పెడదారిఁ బెట్టి యనుభవశాలి యట్లు నటించి నీవు నేఁటిదనుక బుందేలఖండమునకు మహోపకార మొనర్చితివి. బుందేలఖండమున నీరీతి నగ్గి రగిల్చి నీవు దూరమున నుండి చిత్రముఁ జూచుచుంటివి. బుందేలులయొకతరమును దేశద్రోహిగ నొనర్చివైచితివి. కాని యీయనర్థము లన్నియుఁ జాల వని యెంచి కాఁబోలు. నూతనానర్థములఁ గల్పింపఁజూచుచున్నావు. ఐన నింక నీవు దయయుంచి యీయువకులను మోసగించి నశింపఁజేయుప్రయత్నములను వీడుము.”

హీరాదేవి యావేశ మెక్కుడయ్యెను. ఆమె యిట్లనెను:—

“నీవిట్టు ల[illegible]ముగ మాటాడుచున్నావు! నీకు మతిపోలేదుకద!”

సభ[illegible]డి యుండిన యొకముదుసలిసరదారుఁ డిట్లనియె:—“అలసకే మతియుఁ బోవలేదు. అతఁ డనాలోచితముగ

పోటాపోటయు లేదు. ఇప్పటివఱకుఁ దానొనర్చినపాతకములకై యా తనికి విచారము గలుగుచున్నది."

హీరా—(గట్టిగనఱచుచు). చాలును. ఇంక మీరు నోరెత్త కుఁడు. మీయీమాటలు నాకుఁగాని రాష్ట్రపాలకమహాశయునికిఁగాని సమ్మతములు కావు. ఇఁక మీ రిట్టిమాటల నాడిన యీమహాశయు నకు వేఱుపాయములేక మీరాజ్యములను మండలములను స్వాధీనపఱ చుకొనవలసివచ్చును."

హీరాదేవియొక్క యీబెదరింపు చాలమందిరాజులకు సర్దా రులకు నవమానజనక మయ్యెను. ఒకఁ డిట్లు చెప్పసాగెను:—

"నీవు మాటాడకుము. మా రాజ్యముల నేగతిఁ గాపాడుకొన వలయునో మాకు బాగుగఁ దెలియవచ్చినది. పరులచేఁ దన్నులఁ దినుచుఁ జిత్తము చిత్తమను చుండుటకంటె యాత్మబాహుబలవిశ్వా సమున మారాజ్యములు బాగుగ సంరక్షింపఁబడు నని మే మిప్పు డెఱింగితిమి. మీరు మారాజ్యముల సంరక్షణవిషయిక మగు చింతవీడు టయే మాకు శుభకరము."

హీరా—(అధికవిచారమున) నేఁడు మీబుద్ధులు సరిగ లేవని తోఁచుచున్నది.

కలిం—రాణీ! మాబుద్ధులు మొదటనే తిన్నఁగ లేకుండెను. నీమాయమాటలలోఁ బడియే యిప్పటివఱ కెన్నియో దురాచరణము లొనరించితిమి. ఇప్పటిబుందేలఖండమందలి నీతివినాశనమునకుఁ గా రణము రాజుల మగు మేమే. మాబుద్ధులు తిన్నఁగనే యుండినఁ బతి హంతకురాలివచనములకు లోనై తన్మార్గముల ననుసరింపకుండియే యుందుము. చంపతిరాయలమహాపావనకార్యము దోషయుక్తముగ మాకుఁ గన్పింపకయే యుండెడిది. తన్మూలనాశనమునకై కత్తినెత్తక

యే యుండెడివారము. మిగిలియుండిన మాయధికారముఁ గోలుపోవక యే యుండెడివారము. ఇప్పుడు మాబుద్ధులు తిన్నవడినవి. కావుననే నీపక్ష మెంతటిన్యాయరహితమో దుర్నీతియుక్తమో స్వార్థపూర్ణమో మాకు బాగుగఁ దెలియవచ్చినది.

హీరా—(కన్నులు పెద్దవిగఁ జేసి యామదుసలిరాజుఁ జూచుచు) ఓరాజా! నీ కేమిపట్టినది! మంచిది. నీవు నామెడ నిట్టివైరుగ్ధ్యముఁ బూనఁదలఁచిన నాసభలోని కేల వచ్చితివి! నామాట నొప్పుకొనకుండిన నోర్ఛాప్రాంతముల నడుగిడనేల?

కలిం—నీ కిట్టిమాట లాడ నధికారమే లేదు. ఓర్ఛారాజ్యముతో నీ కెట్టిసంబంధము లేదు. ఈయున్నతాసనముపైఁ గూరుచుండ నీకేమి యధికారమున్న దని ముందుగ నేనే నిన్నడుగుచున్నాను! ఓర్ఛారాజ్యముపై నధికారము వహింప నీవెవ్వతెవు?

హీరా—(పండ్లఁ బెదవులతోఁ గొఱుకుచు) పరలోకవాసి యగు రాజునకు భార్యను. యువరాజగు విమలదేవునితల్లిని.

కలిం—ఇదంతయుఁ గట్టిపెట్టుము. మరణకాలమునఁ బర్వతసింహుఁడు చెప్పినదానిని మేము మఱచియుండలేదు. "విమలదేవుఁడు నాకుమారుఁడు గాడు. చంపతరాయయే నిజముగ నాయుత్తరాధికారి" యని యతఁడు నుడివినమాటల నెల్ల రెఱుంగుదురు. ఇచ్చట నిప్పుడుపస్థితులగు నరపతులెల్లరు నాఁడు నుండిరి. మరణకాలమునఁ బర్వతసింహుఁ డేమనెనో వారే చెప్పెదరుగాక. విమలదేవుఁడు నాపుత్రుఁడు కాఁ డని యతఁడు స్పష్టముగ వచించియుండలేదా! ఓర్ఛాసింహాసనముపై ఛత్రసాలుఁడు కూర్చుండవలయు ననియేకదా యతనియంతిమవాంఛ!

చాలమంది—అవునవును!

ఒకరాజు—రాజా పర్వతసింహుని యంతిమేచ్ఛ నెఱవేర్పవల యును. ఓర్ఛాసింహాసనముపై ఛత్రసాలునిఁ గూర్చుండఁబెట్టవల యును. అజ్ఞానవశమున మనము చంపతరాయలయెడఁ బూనినవైరు ధ్యమునకుఁ బ్రతిక్రియఁ జేసికొనవలయును. ఛత్రసాలుఁడే యోర్ఛా సింహాసనాసీనుఁడు కాఁదగ్గుఁడు."

అంతఁ జాలమంది రాజులు "అవునవునట్లే" యనిరి. అంతఁ జాలమంది ఛత్రసాలజయజయధ్వానములఁ గావించిరి.

ఆసమయముననే గంభీరభావముతో సభామంటపముదెస కేగు దెంచుచున్న యువకుఁ డొకఁడు వారి కెల్లరకుఁ గన్పట్టెను. మరల నెల్లరురాజులు సరదారులు లేచి "ఛత్రసాలునికి జయము" అని యున్నతస్వరమునఁ బలికిరి.

హీరాదేవి క్రోధమున నత్యంతసంతప్తయై యీసాష్ట్యోర్ధ్వ కాఁ జొచ్చెను. ఛత్రసాలజయజయధ్వానము విని ఫిదాయిఖానుఁడును వికలుఁ డయ్యెను. సభామంటపమందలి రాజులును సరదారులును మిగులఁ బ్రసన్నులై కన్పట్టుచుండిరి. ఆసమయమున నాపరమేశ్వరుఁ డే వారికి సాక్షాత్కరించిన ట్లుండెను.

హీరాదేవికోపముపారముముట్టెను. ఆమెకన్నులెఱ్ఱఁజేసి ఛత్ర సాలునిఁ జూచుచు నిట్లులనియె:—నీ విట కేల్లు వచ్చితివి? వెంటనే యిటనుండి మరలిపొమ్ము. లేకున్నఁ బ్రదికియుండఁజాలవు. ద్రోహుల కిచ్చట నేమియు పనిలేదు.

ఛత్ర—(అధికవినయమున) ఇచ్చటినుండి వెడలిపోవుటకై నేను రాలేదు. వీరితోఁ గలిసియుండుటకుఁ బ్రేమపూర్వకముగఁ బ్రవ ర్తించుటకు వీరిమనసులందలి ద్వేషభావముఁ బోగొట్టుటకు వచ్చియు

న్నాను. నీకు నాపై నింతటినిష్కారణకోప మేల? నేను నీయెడ నెట్టి యపరాధముఁ గావించితిని?

హీం శా—నీయపరాధముల కొఱకు విన్పింప నాకుఁ దీఱుపాటు లేదు. ఈసభ సామ్రాజ్యభక్తిప్రదర్శనమునకై చేయఁబడినది. సభ ముగిసినపై నీయపరాధములు తెలియఁజేయఁబడును. తదుచితమగు దండనము నీ కొసంగఁబడును.

ఫిదా—(సభయముగ)ఔను.

ఛత్ర—(ఫిదాయీఖానుఁ జూచుచు శాంతముగ)బుందేలఖండమున మసల్మానులపరిపాలనావధి ముగిసినది. శీఘ్రకాలముననే బుందేలఖండము స్వాతంత్ర్యముఁ బొంది దాస్యముక్తమై యానంద మనుభవింపఁగలదు. నేఁడే చతుర్భుజాలయముకడ శుభకరమగు స్వాతంత్ర్యప్రయత్నసమారంభ మయినది. విమలదేవుఁడు తనసేనాని యగు చాముండరాయని వెంటఁగొని చతుర్భుజాలయరక్షణము సల్పుచున్నాఁడు. అధికసంఖ్యాకులిచ్చటిప్రజలు కూడఁ దత్సహాయమునకై సంసిద్ధులై యున్నారు. కొలఁదిసేపటిలో విమలదేవదలపతిచాముండరాయులువిజయులై యిట వచ్చెదరు. ఖాన్! చతుర్భుజాలయధ్వంసమునకై నీయంపినసైనికులు శీఘ్రముగనే యమపురముఁ జేరుదురు. నిన్ను బంధించుభారమును స్వయముగ నేను వహించితిని. నీవు మాటాడకుండ లేచి నావెంట వచ్చెదవేని నీప్రాణములు దక్కును. ఏమాత్రమైన నడ్డగింపఁజూచెద వేని యీఖడ్గము నిన్నంతమొందించివైచును. సత్వరము. సింహాసనమునుండి క్రిందికి దిగుము. నీ వీసమయమున నాఖైదీవి."

ఫిదాయీఖానుఁడు కొలఁదిసేపటివఱకు మాటాడక యాలోచించుచుండెను. అతఁడు మొదట నలువైపుల దృష్టి నిగుడించి

తుదకు హీరాదేవి దెసకుఁ జూచెను. తన్నింక నిస్సహాయునిగ నెఱిఁగి సింహాసనమునుండి దిగనున్నతరి, హీరాదేవి కర్కశస్వరమున నిట్లనియె :—

“ మహాశయా! మీ రీతుఱ్ఱువానికి సుమంతయు భీతిల్లకుఁడు. నే నిప్పటివఱకుఁ జెప్పిన దంతయు నసత్యము. మీసైనికు లీవాటికిఁ జతుర్భుజాలయముఁ బడఁగొట్టియుండరు. చాముండరాయలుగాని విఠలదేవుఁడుగాని వారితో నెన్నఁడుఁ బోరాడరు. ఓర్ఛాప్రజ లత్యంతవిశ్వసనీయులు. రాజభక్తులు. వా రెన్నఁడు నిట్టియనుచితకార్యము నొనరింపరు. మీరు నిశ్చింతులై కూరుచుండుఁడు. (రాజులఁ జూచి) మీ రందఱు విద్రోహియగు ఛత్రసాలునిమాటలకు లోనై చక్రవర్తితోడను సామ్రాజ్యముతోడను వైరముఁ బూనుట శుభకర మని యెంచుచున్నారా! చక్రవర్తియొక్క యింతటిమహాసామ్రాజ్యము నెదురఁగొట్టఁజూచుట మహామౌర్ఖ్యము. మీరు ఛత్రసాలునియీప్రయత్నముఁ బ్రతిఘటింపకున్న ఖానుమహాశయుఁడును, పాదుషావారును మీరు వానితో నేకీభవించుచున్నారని యెంచెదరు. ఛత్రసాలునిప్రయత్నములయెడ నసంతుష్టిని సామ్రాజ్యమునెడ సహానుభూతిని బ్రకటించుటకే నేఁ డీసభ జరుపఁబడినది. పాదుషావారు మీపై నాగ్రహింపకుండునట్లు, బుందేలఖండపుశాంతికి భంగము వాటిల్లకుండునట్లు, మీసామ్రాజ్యభక్తికిఁ గళంకము కలుగకుండునట్లు కేవలవాగ్రూపముగఁగాక క్రియారూపమునఁగూడ మీరు ఛత్రసాలునికార్యములకు వైరుధ్యముఁ బూనవలయును. సుబేదార్ మహాశయా! మీరు రవ్వంతయైన భీతిల్లఁదగదు. ఎవ్వఁడు మిమ్ము ముట్టనైన సాహసింపఁడు.”

ఛత్రసాలుఁడు వెనుకటియట్లే శాంతగభీరుఁడై యిట్లనియె:—

“ ఫిదాయీఖాఁ! నిరర్థకము గు వివపరీక్షఁ గావింపకుము. బుందే లులసాహసపరాక్రమములు నీవు బాగుగ నెఱుఁగుదువు. కావున మాటాడక నాకు స్వాధీనుఁడవు కమ్ము. ఇంక నీతో నే నేమియుఁ జెప్పను. ఇటుపై నా కార్యము ఖడ్గము నిర్వహించును. ”

అధికార తేజోభరితములగు ఛత్రసాలునిమాట లసహ్యములై తోఁప హీరాదేవిమాటల సుంకైఁ దలఁచుకొనక ఫిదాయీఖానుఁడు తనయాసనమునుండి గబగబ దిగి, ఛత్రసాలునికడ కేతెంచి యవనత శిరస్కుఁడై సవినయముగ నిట్లనె:— “ నేను తమయాజ్ఞకు బద్ధుఁ డను. అనుగ్రహించి నాప్రాణరక్షణ మొనరించి నన్ను నా పెండ్లాము బిడ్డలతోఁ గలిసికొన ననుమతింపుఁడు. ”

ఛత్ర—ఖాన్! వ్యాకులపడకుము. నీప్రాణములు హరింపఁ బడవు. (సభవైపుఁ జూచి) సోదరులారా! వింధ్యవాసినీదేవి యాశీ ర్వచనమునను, మీసహాయమునను, నేను వినష్టస్వాతంత్ర్యసంపాదన ప్రయత్నమునఁ దగిలియున్నాను. కాని మీ రెల్లరు నైకమత్యముఁ జెందుదనుక నీకార్యమున సాఫల్యము కలుగదు. బుందేలఖండస్వా తంత్ర్య మిచ్చటిప్రతివ్యక్తికి హితదాయకమే యగును. ఎవ్వరిహిత ము సమకూర్పఁ బ్రయత్నములు సేయఁబడుచున్నవో, వారే యైక్య ము నందకున్న, నాత్మహితదాతలతోఁ బోరాడుచున్న నింక స్వాతం త్ర్యప్రాప్తి యెట్లు! పరస్పరవిరోధములనే మనశక్తిశౌర్యములు వినష్ట ములుగఁ జేసికొన్న బానిసతనపుగోతిలోని కీడ్చుచు పరకీయశక్తితో మన మెట్లు పోరాడఁగలుగుదుము! ఇప్పటివఱకు మనయంతఃకలహ ములవలనఁ గలిగిన చెఱుగు మీ రెఱుంగనిది కాదు. ఫిదాయీఖానుఁ డు బుందేలఖండమున రాష్ట్రపాలకుఁడుగ నియమింపఁబడినాఁడు. మి మ్మతఁడు గొయ్యబొమ్మలయట్టు లాడింప నతని కధికార మొసఁగఁబడి

నది. దీనికి మీయంతఃకలహములే కారణము. బుందేలఖండమునవిరు పేదమొదలూగాని నిధీశ్వరునిదుక నెల్లరిపై నన్యాయముగు జిజియా పన్ను విధింపఁబడినది. దీనికి మీయంతఃకలహములేకారణము. బుందే లఖండమందలి దేవాలయము లన్నియు విధ్వస్తములు కాఁజొచ్చెను. పరమపూజ్యములగు దేవతావిగ్రహములు పాదదళితము లయ్యెను. అడుగడుగునకు ధర్మమున కవమానము గలుగుచున్నది. దీని కంత కునుఁ గారణము మీయంతఃకలహమే. మీరు తండ్రిగారితో విరో ధముఁ బూని వారిస్వాతంత్ర్యవిషయికప్రయత్నముల నాతంకములఁ గల్గించి వారిప్రయత్నముల సర్వవిధముల నిరర్థకముల నొనర్చితి రి. దీన మీకేమి లాభము చేకూరెనో మీరే యూహించుకొనుఁడు. దీనిచే బుందేలులకు మీ రెట్టిశుభము సమకూర్చితిరి! కొంచెము కన్నులఁ దెఱచి దేశస్థితిఁ జూచిన మీయంతఃకలహములమూలమున బుందేలఖండమున కెంతటియపరిమితమగు హాని వాటిల్లెనో తెలియఁ గలదు. మహాభారతగ్రంథమున మీరు కౌరవపాండవుల భయంకర యుద్ధవిషయముఁ జదివి యుండవచ్చును. పరస్పరవినాశనమునకై వా రెల్లు ప్రయత్నించుచుండిరి! కాని యన్యులతోఁ బోరాడవలసివచ్చి నప్పుడు వా రైకమత్యము నందుచుండిరో మీ రాలోచించుటలేదు. అంతఃకలహములఁ బాండవు లైదుగురు గౌరవులతోఁ బోరుచుం డిరి. కాని యన్యులతోఁ బోరాడవలసిన సమయమున వా రెంతటియభి మానముఁ గౌరవపాండవులమగు మేము నూటైదుగుర మని చెప్పు చుండిరి! నేఁడు మనము కౌరవపాండవులయీయుపదేశము ననుసరిం పవలయును. మీతోడను జక్రవర్తిసైన్యములతోడను బోరాడుటచే తండ్రిగారు ప్రాణముల వీడిరి. కాని వా రిప్పుడు జీవితులై యుండ లేదు. ఇప్పు డింక వారిపై మీ కెట్టిద్వేషము లేదుకదా! తండ్రిగారు

పరిణామవశమున, లేక తెలివిలేమిచే, కాక యహంకారవశులై మిమ్ము నే నొప్పించి యుండవచ్చును. మీతోడ విరోధముఁ బూనియుండవచ్చును. మీకు శారీరకమానసికకష్టములఁ గలిగించి యుండవచ్చును. కాని వారికార్యము లన్నియు నుదాత్తమగు స్వాతంత్ర్యాశయము కొఱకే యొనరించిరి. అట్లయ్యు నాకార్యము సిద్ధింపలేదు. తుదకు బంధుద్రోహపరస్పరవైరముల మూలమున నేతుదకు సాఫల్యము లభింపలేదని వా రెఱింగిరి. తమయీఘోరప్రమాదమునకై వా రత్యంతపశ్చాత్తప్తులైరి. కాని తమపొరపాటు నెఱుఁగునప్పటి కధికవిలంబ మాయెను. కావున వారు దానిని సవరించుకొనఁ జాలకపోయిరి. ఇప్పుడు నేను నాకార్యము స్వయముగ వహించితిని. తండ్రిగారు మీతోడ నొనరించిన యపరాధములకై నేను మీకడనుండి మన్నన వేడుచున్నాను. తండ్రిగారియపరాధ మక్షమ్య మని మీకుఁ దోచిన, దానికై యుచిత మని తలంచి మీరు విధించెడు దండనము ననుభవింప నేను సంసిద్ధుఁడనై యున్నాను. ఈ ఛత్రసాలుఁడు నిశ్శస్త్రుఁడై తనతండ్రిపక్షమున క్షమాప్రార్థన మొనరించి మీయెదుట నిలువఁబడి యున్నాఁడు. మీ కుచితమని తోచిన వెనుకటిసంఘటనముల మఱచి స్వాతంత్ర్యప్రయత్నముల నాకు సాయ మొసంగుఁడు. లేక నాకు నొక దండనము విధించుట యుచిత మని తోఁచిన నట్లొనరించి మీరు స్వేచ్ఛముగ స్వాతంత్ర్యసంపాదనప్రయత్నముఁ గావింపుఁడు. మీ శస్త్రాఘాతములను గాని క్షమావచనములను గాని సమానప్రేమమున స్వీకరింప నేను సంసిద్ధుఁడనై యున్నాను.”

గద్గదస్వరమున నొకభూపతి యిట్లు నుడివెను:—“ఛత్రసాలా! నీతండ్రి మాయెడ నెట్టియపరాధముఁ గావించియుండలేదు. మేము దుష్టయగు సింహాసనాదేవిసలలోఁ జిక్కియే యింతటియనర్థములఁ

జెప్పితిమి. చంపతరాయలప్రాణములఁ గొంటిమి. పరస్పరవైరమున నెంతటియనర్థము వాటిల్లెనో, వాటిల్లుచున్నదో యిప్పుడు మే మెఱుంగఁగల్గితిమి. ప్రాణనాథస్వామి మా వాస్తవావస్థను మా కెఱింగించెను. మా కన్నులమొనుసె భ్రమయవనిక పూర్ణముగఁ దొలఁగిపోయినది. మేము హీరాదేవిపక్షము వీడి నీకు సాయపడుటకు, స్వాతంత్ర్యకేతనచ్ఛాయ నిలుచుటకును సంసిద్ధులమై యున్నాము. మే మంతదనుకఁ జేసిన నింద్యకార్యములకై యుదారుఁడవై నీవు మమ్ము క్షమింతు వని మే మాశించుచున్నాము. హీరాదేవీ! అన్యాయమయము పాపకలితము నగు నీపక్షమును నేటినుండి మేము పరిత్యజించితిమి. ఇంక మేము ఛత్రసాలు ననుసరించెదము.”

హీరాదేవిక్రోధము మేరమీఱిపోయెను. ఆమె కిప్పుడు కర్తవ్యాకర్తవ్యములు తెలియుట లేదు. ఆమె దురాశాశిఖరమునుండి యవమానకూపమునఁ బడిన ట్లయ్యెను. లక్షలకొలందిగ వృశ్చికము లొక్కమాఱుగ నామెను గుట్టినట్లుగ నామె బాధపడుచుండెను. దృష్టి చంచలమయ్యెను. ఆమె తననేత్రములనుండి ఛత్రసాలునిపై నగ్నికణములఁ గురియుచున్న దని యెల్లరకుఁ దోఁచుచుండెను. ఆమె యధికవిలక్షణమగు దృష్టిచేఁ, దనచేతిఖడ్గమును, సమీపమున నిలిచియున్న ఛత్రసాలునిఁ జూచెను. కాళ్లు కంపించుచుండ నామె ఖడ్గమున ఛత్రసాలు నెదుటనే వికల యగుచుండెను. ఇంతలో ఛత్రసాలుని మధురగంభీరస్వర మామె చెవులఁ బడెను. ఛత్రసాలుఁడు మాటాడుచుండుటఁ గాంచి యామె యధికముగు నధికారగర్వమున దనయాసనముపైఁ గూలఁబడెను.

ఛత్రసాలుఁడు మిగులఁ బ్రసన్నుఁడై యిట్లనెను:—“ రాజులారా! నాయకులారా! మీరు నేఁడు నన్ను ధన్యునిఁ గావించితిరి.

ప్రాణనాథస్వామివర్యుల ధన్యులఁ గావించితిరి. బుందేలవంశమును ధన్యముఁ గావించితిరి. వెనుకటిపరస్పరాపరాధముల సైరించి బుందేలఖండకల్యాణరథమును దాస్యాంధకారకూపమునుండి బయల్వెడలించి, స్వాతంత్ర్యభవ్యభవనదిశకుఁ గొనిపొందు. రండు. మన మందఱ మానందపూర్వకాలింగన మొనర్చుకొని భావికర్తవ్యము నిశ్చయించుకొందము." ఛత్రిసాలుఁ డీమాటఁ జెప్పుచుండగనే రాజులు, నాయకులుఁ, బ్రేమపూర్వకాలింగనాభిలాషులై ముందునకు వచ్చుచునే యుండిరి. ఇంతలో హీరాదేవి యాడుపులివలె గర్జించుచు ఛత్రసాలునిపై కెగసెను. ఆమె తనఖడ్గమును ఛత్రిసాలునిపైఁ బ్రయోగింపనై యుండెను. కాని యింతలో నెవ్వరో పైనుండియే యామెహస్తముఁ బట్టుకొనిరి. ఆమె క్రోధభరితమగు దృష్టితోఁ దన హస్తముఁబట్టుకొనిన వారివైపు చూచెను. చూడఁగనే యామెక్రోధ మంతయు నశించిపోవ భీతయై చూడఁదొడంగెను.

మేఘగర్జనముఁ బోలు భీషణగర్జన మయ్యెను:—పాపినీ! అపవిత్రమగు నీహస్తమును స్పృశించుట నాదురదృష్ట మని నే నెంచుచున్నాను. కాని యమూల్యమగు నీబుందేలఖండరత్నముఁ గాపాడ నిరుపాయుఁడనై యట్లొనరింపవలయును. నీహస్తముఁ గ్రిందికి దింపుము. నీనేత్రముల కెక్కినరక్తము దిగమ్రింగుము. నిన్నుఁబోలునా తొసి యీభువనమున నెందు వెదకినను గాన్పింపదు. కాని నేఁడు నేను నీయపరాధముల కన్నిటికి దండన నొసంగెదను. ఆనాఁడు నీవు నన్ను మోసగించి పాఱిపోతివి. కాని నేఁడు నన్నుఁ దప్పించుకొనఁజాలవు. నే నడిగిన దానికంతకు సరియగు ప్రత్యుత్తరము నాకందవలయును. దాని నీ విసుమంతయైన మోసముఁ గావించినను, నీనోటినుండి యసత్యవాక్య మేదియైన వెలువడినను, నీయీఖడ్గమే నీరక్తముతో నిండి కన్పింపఁగలదు."

హీరాదేవిమొగము మిగుల నల్లవడిపోయెను. ఆమెయుం దొక్కమాటయైన నాడుటకు శక్తిలేకుండెను. కొంతసేపటి కామె యింక శుభకరణుఁడు తన్ను విడువఁడని యెఱిఁగెను. ఐనను నామె యతని ప్రశ్న కేమియుఁ బ్రత్యుత్తర మొసంగలేదు. ఆమెనేత్రములనుండి యశ్రుధార ప్రవహించుచుండెను.

శుభకరణుఁ డామె మాటాడకుండుటఁ గాంచి, మరలఁ గసరుచు నిట్లనెను:—"హీరాదేవీ! నాప్రశ్న కుత్తరము వెంటనే రావలయును. లేకున్న నింకొక్కక్షణములో నీశిరము భూమిపై దొర్లుట కానవచ్చును."

నిర్భాగ్యురాలగు హీరాదేవి వెక్కివెక్కి యేడ్చుచు నిట్లనియె:—"లలిత కౌమార్యమునకు భంగము వాటిల్లలేదు. ఆమెయాత్మహత్యయుఁ గావించుకొనలేదు. కొండగుట్టమీదినుండి పడి యామె మరణించెను."

హీరాదేవిమాటల నాలకించి కొంతసేపటివఱకు శుభకరణుఁడు నిశ్శబ్దముగ నుండెను. అటుపై నీవిషయమున హీరాదేవి యసత్యమేల చెప్పెనో యెఱుఁగగోరెను. కాని యామె యూరక యేడ్చుచుండెఁగాని యొక్కమాటయైన నాడలేదు. చాలసేపటి కామె యింత మాత్రమే నుడివెను:—"నేను ప్రజలమనములఁ జంపతరాయలపై నసహ్యతఁ గల్గించుటకే యీయసత్యమాడితిని." అటుపై నామె మరల వెనుకటిచందమున నేడ్చుచుండెను.

శుభ—(సోద్రేకముగ) రాజులారా! నాయకులారా! నేఁటికిఁ బదునాఱేండ్లకుఁ బూర్వము చంపతరాయునిప్రాణము హరించెద ననియు, నతనిస్వాతంత్ర్యప్రయత్నముల భంగముఁ గలిగింతు ననియు, మీయెదుట నేను ప్రతిజ్ఞఁగైకొని యుంటిని. కాని నేఁడు మీయెదు

శుభ — ఎవ్వరితో?

ఛత్రి — చతుర్భుజాలయవిధ్వంసమునకై యేగిన యవనసైన్యములతో.

శుభ — రాజులారా! నాయకులారా! విమలదేవునింబోలు యువకుండు చేతఁగత్తిఁగొని పోరాడుచుండ మనయస్త్రీవారి కిటుఁ గూరుచుండి వాగ్యుద్ధ మొనరించుట తగదు. నడువుఁడు. అందఱముఁ జతుర్భుజాలయముకడ కేగుదము."

శస్త్రముల భయంకరఘణఘణకార మయ్యెను. వెంటనే యెల్లరు ఛత్రిసాలజయజయధ్వానముఁ గావించుచుఁ జతుర్భుజాయతనము దెసకుఁ బరువిడిరి.

---

## ఇరువదియేడవప్రకరణము.



### బాందేలఖండస్వాతంత్ర్యదినము.

ఓర్ఛాదుర్గమున విజయలక్ష్మి ఛత్రిసాలునిగళమున మాలిక నిడెను. ఓర్ఛాప్రాసాద శిఖరమునను సింహద్వారముపైనను స్వాతంత్ర్యపతాకలు విరాజిల్లసాగెను. స్వాతంత్ర్యరవిప్రభముకిరణజనితాహ్లాద నౌర్ఛాప్రజలకు లభించెను. వారిచతుర్భుజాలయదర్శనము మిక్కుటమైన ప్రేమతో జరుగుచుండెను. కావుననే యోర్ఛాజనులు ఛత్రి

సాలునిఁ బరమేశ్వరావతారమునుగ భావింపఁదొడఁగిరి. స్వాతంత్ర్యము నకై వారు త్రికరణశుద్ధిగఁ బోరాడ నిశ్చయించుకొనిరి.

ఛత్రసాలునివిజయవార్త కడువేగమున సమస్తబుందేలఖండము నను వ్యాపించెను. అనతికాలమున నెల్లరును ఛత్రసాలుఁడు ఫిదాయీ ఖాను నోడించి బంధించె ననుమాటయే యుచ్చరించుచుండిరి. బుం దేలఖండమున నటనటఁ జెదరియున్న ముసల్మానులెల్లరు ఫిదాయీఖా ను బందీకృతుఁ డయ్యెనను వార్త విని పాఱిపోయిరి. ఛత్రసాలుఁ డోర్ఛాలో స్వాతంత్ర్యయుద్ధసన్నాహములఁ గావించుచుండె నను వార్త వినినతోడనే బుందేలయువకులు గుంపులుగుంపులుగ నాతని కడ కేతేరఁ గడఁగిరి. ఛత్రసాలుని తేజోబలములు నానాటికి శుద్ధపక్ష చంద్రునివలె వర్ధిల్లుచుండెను.

సభామండపమునఁ గూడినరాజులును సరదారులును దనపక్ష మునఁ జేరుటఁజూడ ఛత్రసాలుని కమితానంద మొదవియుండెను. శుభకరణునంతటి వీరశిరోమణికూడఁ దనపక్షముననుండి యాజిస ల్పుటఁ గాంచినతోడనే యతనియానందమున కవధిలేకుండెను. ఇఁక నీకార్యము తప్పక నెఱవేఱు నని యతఁడెంచెను.

దలపతిరాయశుభకరణులు పరస్పరాలింగనముఁ జేసికొనలేదు. కాని యుద్ధమున వారిరువురుఁ జూపిన యమేయపరాక్రమమునకు దేవగణ మాకసమునుండి వారిపై పుష్పవృష్టిఁ గురిపింపవలసెను. వా రిరువురు నన్యోన్యము, దృష్టులచేతను, ముఖవికాసముచేతను నమరో త్సాహాగ్జనములచేతను నాలింగనము సేసికొనిరి. కాని వారియానం దముఁబోలు నానందము నేఁటివఱకు జగమున నేజనకతనయులకుఁ గలిగియుండదు.

పూపువలె లలితము, వెన్నవలె మృదులము, రిక్కవలెఁ గాంతిమంతమునగు విమలదేవునియద్భుతవిక్రమము ఛత్రసాలునికన్నుల యెదుటినుండి తరలఁజాలకుండెను. విమలుఁడు యుద్ధము ముగియువఱకుఁ గత్తి త్రిప్పుచునే యుండెను. ముఖమునందలిస్వేదమును శుభకరణుఁ డభిమానపూర్వకముగ స్వహస్తములచేఁ దుడుచుచుండ శ్రాంతిచే వరుణిమ గడలుకొన సముదితభాస్కరునిపగిది వెలుంగువానుం డసుకుమారకుమారుఁ డొక్కమ్మడి నదృశ్యుఁడగుటచే ఛత్రసాలుని కుండియుండి కడుంగడు నాశ్చర్యమగుచుండెను. ఆకోమలకుసుమము రణక్షేత్రమున రాలిపోయిన దేమో యని ఛత్రసాలుని కనుమానమొదవఁదొడఁగెను. అతఁడు విమలుని వెదకఁ బోఁబోవ శుభకరణుఁడు చెప్పుచు నిట్లనియె:—

“ఛత్రసాలా! నీవు విమలునిఁగూర్చి చింతసేయకుము. అతఁడు కుశలముగ నున్నాఁడు. కాని యతఁ డింక నీయెదుటికి రా నిచ్చగించుట లేదు.”

శుభకరణునిమాట విని ఛత్రసాలుఁ డింకను వెఱఁగందెను. ఛాయవలె ననుకూలముగ దనతో నుండుమిత్రవరుఁడగు విజయదేవు నాతఁడు విమలదేవునిజాడఁ దెలిసికొను మనెను. కాని యాతనినుండియు శుభకరణునియుత్తరమే లభించుటచే నతఁడు విభ్రాంతిఁగందెను. “విమలదేవుఁడు నన్నుఁ గలిసికొనఁగోరుటలేదా” యని ఛత్రసాలుఁడు విజయు నడిగెను. “తగువేళ వచ్చునరికి స్వయముగనే కలిసికొనును” అని విజయుఁ డుత్తర మొసంగెను. ఛత్రసాలుఁడు కష్టముపైఁ దన్నుఁ దాసమాధాన పఱిచికొనెను. పిదప నతఁడు రణదులహాఖానువిషయమై ఘాంఘేరమువఱకుఁబోవ సిద్ధపడుచుండెను.

ఛత్రసాలపారిణాఖులకుఁ గల్పనాతీతమగు కీర్తి లభించెను.

బుందేలుర స్వాభావికౌదార్యము సంపూర్ణముగ నుత్తేజితమయ్యెను. క్రమక్రమముగ ఛత్రసాలునిబలము వర్ధిల్లెను. ఓర్ఛాలోనుండుట ఆతనికి కష్టమయ్యెను. ఓర్ఛాదుర్గము చిన్నదై యుద్ధకార్యములకు ననుపయుక్తముగ నుండెను. ప్రాణనాథస్వామియొక్కయు శుభకరణుని యొక్కయు సమ్మతిపై "గఢాకోట" దుర్గమున సామగ్రియంతయు నిలుపఁబడి యదియే సేనాకేంద్రముగఁ జేయఁబడెను. చాముండ రాయఁడోర్ఛాను గాపాడుచు నచటనుండెను.

హీరాదేవి సభామంటపమునుండి వెలువడుటతోడనే మాయ మైపోయెను. ఆమె యెప్పు డెచ్చటికి బోయెనో యెవ్వరికి నింతయుఁ దెలియలేదు. ఛత్రసాలునిసేవకుఁ డొకఁ డొకయువ్వపురుషవేషమున నున్న యున్మాదిని ఢిల్లీదెసకుఁ బోవుచుండుటఁ జూచెను. ఆమె హీరాదేవియా మఱొకతెయో యాతనికి నిశ్చితము కాలేదు.

ఛత్రసాలుఁడు కొలఁదిసేనతో ధాంధేరునకుఁ బయనమయ్యెను. శుభకరణదలపతిరాయులు ధాంధేరుమీఁదుగ స్వకీయమగు సాగరరాజధాని కేఁగునుద్దేశముఁ బ్రకటించిరి. ప్రాణనాథస్వామి మహలాదేవినిఁ గలిసికొనఁగోరెను. కాన ఛత్రసాలుఁడు వీరితోడనుఁ గొలఁది సైన్యముతోడను ధాంధేరునకుఁ బయలుదేరెను.

ధాంధేర సమీపమున నుండఁగనే యాకస్మికముగ విజయదేవుఁడు మాయమయ్యెను. తొలుత విమలదేవుఁడు వీడుటకే ఛత్రసాలుఁడు ఖిన్నుఁడయ్యెను. ఇపుడు విజయదేవునిఁగూడ వీడుట కతఁడు మఱింత ఖిన్నుఁడయ్యెను. కాని లోకమున నేది వచ్చినను మేలుకొఱకే యను ప్రాణనాథస్వామియొక్క శుభోపదేశము వినియే యతఁడు సమాధానపడవలసివచ్చెను.

రణమలహాఖానునకుఁ దనరాజ్యము ధారవోయ సంకల్పించిన

కంచుకిరాయలయవస్థ చాల శోచనీయమైపోయెను. విజయ యొకసామాన్యుఁడగు సరదారుకుమారునకుఁగాక చౌర్యముననో ర్వాయువరాజగు విమలదేవునికి వివాహిత మయ్యె నని రణదులహాఖానునికిఁ దెలిసెను. కంచుకిరాయలు తన్నేదియో మోసగింపఁజూచుచుండె ననియు రాజ్యవిషయమునఁగూడ నేదియో మాయసేయు ననియు నలెఁడెంచెను. విజయను విమలదేవునకుఁ బెండ్లిసేయుట యతనికిఁ జాల నవమానకరముగఁ గన్పట్టెను. కావున నతఁడు మిగులఁ గోపముఁడై "నీవు శీఘ్రముగ రాజ్య మంతయు నాయధీనముగావించి నాకై దీవికమ్ము. లేనిచో యుద్ధమునఁ జచ్చుటకు సంసిద్ధుఁడవు కమ్ము" అని కంచుకిరాయలకు వార్త నంపెను. కంచుకిరాయ లాతనికిఁ దనరాజ్యమొసఁగఁగోరినను, దనజీవితమునఁగాదు. కాని రణదులహాఖాను తన్నే బందె నుంపఁగోరుట విన నతఁడు మిగుల భయపడెను. యుద్ధము మాట విని మఱియు భయంపడెను. ఏమిచేయుటకు నాతనికిఁ దోఁచుట లేదు. అతఁడు తనరాజపదవినిఁ బ్రాణములకంటెను, బ్రాణముల రాజపదవికంటెను మిన్నగఁ జూచుకొనుచుండెను. ఆరెంటిలో దేనిని గూడ విడువఁజాలఁడయ్యె.

సాయంకాలమున రణదులహాఖానుఁడు కోపమునఁ గెంపువాఱిన నేత్రములతోఁ గంచుకిరాయలదర్బారులోనికి వచ్చెను. కంచుకిరాయల కతఁడు సరిగ యమదూతవలెఁ దోఁచెను. అతనినోటినుండి యప్రయత్నముగనే "ఈయమదూతబారినుండి నన్నెవరు రక్షింతురు!" అనువాక్యము వెలువడెను.

"ఛత్రసాలుఁడు." అని యింతలో నెవ్వరో పలికిన ట్లాయెను. భయవిస్ఫారితనయనుఁడై కంచుకిరాయ లెదుటికిఁ జూచెను. యథార్థముగనే కొందఱిజనులతో ఛత్రసాలుఁడు వచ్చుచుండుట కాన

వచ్చెను. ఈసమయమున ఛత్రసాలుఁడు తక్క వేఱెవ్వరుఁ దన్నుఁ గాపాడఁజాల రని యాతఁడు నిశ్చయించుకొనెను. అతఁడు పరువిడి ఛత్రసాలునిచరణములఁ బడఁబోవుచుండ నింతలోఁ బ్రాణనాథస్వామి యిట్లనియెను.

" మీరాయల్లునికాళ్లపైఁ బడుట యుచితము కాదు. ఆపదనుండి మిమ్ముఁ గాపాడుట ఛత్రసాలునకుఁ గర్తవ్యము."

కంచుకిరాయలు కొలఁదిమాటలలోఁ గడుప్రేమతో ఛత్రసాలునకు స్వాగతమిడి తనకుమిగుల సమీపమున నొకయాసనముపైఁ గూరుచుండఁబెట్టెను. ఎల్లరును వెంటనే యాసనములపైఁ గూరుచుండిరి. ఆసమయముననే పరిథాని సజ్జనరాయలుగూడ సభలోని కేతెంచెను. సభాకార్యక్రమమంతయు నాతనియానతివడువునఁ గాజొచ్చెను. శుభకరణునివెంట వలువముసుంగులలో నుండిన ముప్వురు వనితలును జవనికచాటున సుఫలాదేవిచెంతఁ గూరుచుండిరి. శుభకరణునివెంట నామూఁగురుకాంతలు నెటనుండి వచ్చి రని ఛత్రసాలునకు సక్కజమొనవెను. అతని నాశ్చర్యావిష్టునిగఁ జూచి దలపతిరాయలు మందహాసము సేయుచుండెను.

రణదుల్హాఖానుని ఛత్రసాలునిసైనికు లిరువురు బంధించిరి.— పిదప సజ్జనరాయలు ప్రాణనాథస్వామితో నిట్లనెను:—

" స్వామీ! గతవింధ్యవాసినీవార్షికోత్సవసమయమున విజయామిమలదేవులు కూర్చినమాలికను దేవి ఛత్రసాలునికంఠమున వేయించి ప్రకటించిన యిచ్ఛను సంపూర్ణముగ నెఱవేర్చుట యసంభవమగుటచే నగమైన నెఱవేర్ప సుఫలాదేవిరాణిగారు కోరుచున్నారు. రాజకుమారి యగు విజయ ఛత్రసాలునకుఁ గడు ననురూపిణి యగు వధువు. ఈవిషయమున వధూవరులమాతలగు సుఫలాసరళాదేవులకుఁ

దోలుతనే మాటలు జరిగినవి. కాన విజయ వెనుకటినుండియు ఛత్రసాలునకు నిశ్చితయగు వధువు. తమ రనుమతి నొసంగినచో, శీఘ్రముగఁ బరిణయసన్నాహము కావింపఁబడును."

ప్రాణనాథస్వామి కంచుకిరాయల నిట్లడిగెను:— "తమకు రాణిసుఫలాదేవియుద్దేశము సమ్మతమేకదా! ఛత్రసాలునికి మీకొమరితె నిచ్చి వివాహముసేయ నిచ్ఛగింతురుకదా!"

కంచు—స్వామీ! ఇంతకన్న నేమికావలయును? కాని చిక్కేమనిన విజయ యింతకుముందుగనే విమలదేవునకు వివాహితయయ్యెను.

ప్రాణ—మీ రీవిషయమునఁ జింతింప నక్కఱలేదు. విజయను, మీరాజ్యమును గాపాడుటకే యీయుపాయ మొనరింపఁబడెను. విమలదేవుఁడుగూడ వాస్తవమున విజయవలెనే కుమారి. కావున విజయను కన్యకగనే పాటింపనగును.

కంచు—(సంతసమున) నేనెన్నఁడును దమయాజ్ఞకు బద్ధుఁడనే. తమరు నుడివినదంతయు నాకు సమ్మతమే. నేను కేవలము నారాజ్యము రణదులహఖానునిచేతఁ బడరా దని మాత్రమే వాంఛించుచున్నాను.

ప్రాణ—ఈవిషయమున నేమియుఁ జింతింపకుఁడు.

పిదపఁ బ్రాణనాథస్వామి విజయను బిలిపించెను.

కొంచెముసేపటికి విజయ తెరచాటునుండి వెలుపలికి వచ్చెను. కాని యామె యొంటరిగ లేదు. ఆమెతోఁగూడ నింకొక సుందరియగు యువతి ప్రాణనాథునివైపునకు వచ్చుచుండెను.

విజయ నందఱు గుఱుతించిరి. కాని యారెండవబాలికను శుభకరణదలపతిచ్ఛత్రసాలులుతక్క మఱెవ్వరు గుఱుతింపలేదు.

ఛత్రసాలునకు జయసాగరసరోవరసంబంధమగు దైవికమానవికసౌందర్యములు జ్ఞప్తికి వచ్చెను. అతఁడు పలుసారులు విమలదేవుఁడు వేషధారియగు వనిత యని విని యుండెను. వింధ్యవాసినివరము పూర్ణముగ నెఱవేఱునేమో యని యతఁ డనుమానించెను.

ప్రాణనాథప్రభుఁడు విజయ నిట్లడిగెను:— “ విజయా ! నేను నిన్నొకతెనే పిలిచితిని. ఈమెనుగూడ నేల వెంటఁ గొనివచ్చితివి ?”

విజ—వింధ్యవాసినీదేవి మాయిరువురిపై ననుగ్రహముఁ జూపెను. దానిఫలముఁగూడ మాయిరువురకు సమానముగనే లభింపవలయునని మేము కోరుచున్నాము.

ప్రాణ—విమలదేవకుమారునివేషమున నున్నదియీబాలికయే!

విజ—చిత్తము.

ప్రా—కాని పర్వతసింహునికన్యకు ఛత్రసాలునితో నెట్లు వివాహసంబంధము కాఁగలదు !

శుభకరణుఁడు తనయాసనమునుండి లేచి నిలిచి గంభీరముగ నిట్లనె:— “ ఈవిమల పర్వతసింహునిపుత్రిక కాదు. నాపుత్రిక.”

శుభకరణునివచనములు విని యెల్లరు విస్మితులైరి.

శుభకరణుఁ డది చూచి మరల నిట్లనియె:—

“ విమలదేవుఁడు—అనఁగా—విమల నాపుత్రిక యనుమాట వినుటకు మీ కెల్లరకు నాశ్చర్యము కలుగుచున్నది. హీరాదేవి చంపతరాయలయెడఁ బన్నినకుట్రకు విమలదేవుఁ డొకముఖ్యాంగము. హీరాదేవికి సుతుఁడు లేకుండెను. కావున నోర్ఛారాజ్యము చంపతరాయనివంశమునకుఁ జెందునను భయమున నామె నలువురిగర్భవతులగు వనితల నంతిపురి నుంచుకొని తాను గర్భవతి యని ప్రకటించెను. ఆనలువురిలో నొక్కతె కేనియుఁ బుత్రుఁడు పుట్టినచో, నోర్ఛాగా

జ్యము చంపతరాయలకుఁగాని యాతనిసంతతికిఁగాని చేఁబడుట తప్పా వని యామె యూహించెను. ఆనలువురిలో నాభార్యయొకతె. మొదట మిగిలిన ముప్పురుస్త్రీలును బ్రసవించిరి. మువ్వురకును బాలికలే పుట్టిరి. పిదప నాభార్యకూడ నీవిమలను బ్రసవించెను. హీరాదేవి మిగుల దుఃఖతురాలాయెను. కాని యామె సాధారణవనిత కాదు. ఆమె తనకుఁ బుత్త్రుఁడు కల్గె నని ప్రకటించెను. అది మొదలు నా కన్య విమల దౌర్భాగ్యయుద్ధమువలన విమలదేవరూపమున నుండెను."

విమలదేవునిచరిత్రము విని యందఱు విస్మితులైరి. ఛత్రసాలునియా నందమున నాశ్చర్యముఁగూడఁ జాలగ మిళితమయ్యెను.

వింధ్యవాసినియిచ్ఛ విభక్తముగఁగాక సంపూర్ణముగ నెఱవేఱె నని సజ్జనరాయ లమితానందముఁ బ్రకటించెను.

ఛత్రసాలునివికసితవదనముఁ దిలకించుచుఁ బ్రాణనాథస్వామి విమలావిజయులహస్తముల ఛత్రసాలునిచేతి కందిచ్చెను.

అందఱు వింధ్యవాసినీజయజయకారముఁ గావించి వధూవరులకు మంగళాశీర్వచనముఁ గావించిరి.

ఆసమయమున బదరున్నీసాదలపతిరాయలసంబంధవిషయమునుఁగూడఁ బ్రాణనాథస్వామి చాలఁగఁ జింతించుచుండెను. అప్పటి వఱ కతఁ డేమిచేయుటకు నిశ్చయింపఁజాలకుండెను. ఇంకను నిశ్చయింపకుండు టనుచితమని యతనికిఁ దోఁచెను. కనుక నతఁడు మొదట బదరున్నీసాను వెలుపటికిఁ బిలిచి పిదప నెల్లరకును విశేషించి శుభకరణునకును, బదరున్నీసాదలపతిరాయుల యన్యోన్యప్రేమవృత్తాంతమును దెలియఁజేసి, పిమ్మట బదరున్నీసా యవనకన్యక యగుటచే నొకయార్యరాజకుమారుని వివాహిత యగుట లౌకికదృష్టిచే ననుచితముగఁ దోఁచుననియు, నదిగాక వివాహమువలన సాగరరాజవంశము

కలంకితమగుట సంభవమనియుఁ, గాన బదరున్నీసా కన్యగనే యుండి దలపతిరాయలకు సేవఁ జేయఁదగు ననియు నిశ్చయించెను. దానసే బదరున్నీసా సంతుష్ట యయ్యెను. ఉపస్థితులగు వందతికి నదియే యుక్త మని తోఁచెను.

ఏనాఁడు బుందేలు లందఱు నైక్యము నందిరో, యేనాఁడు శుభకరణుఁడు, రాజు లందఱు ఛత్రసాలునిపక్షమునఁ గలిసిరో, యా నాఁడే బుందేలఖండము స్వతంత్రమయ్యెను. రణదులహాఖానునకుఁ గూడ ఫిదాయిఖానునకుఁబలెనే ప్రాణదాన మొసఁగఁబడెను. కాని యతఁడు కృతఘ్నతఁ జూపెను. హీరాదేవి పాదుషాతోఁ గలిసి బుందేలఖండముపై మరల దాడిసల్పుటకై పంపినసేన కాతఁడే నాయకత్వము వహించెను. "గిరహా" యనుగ్రామమున విజయవిమలల తో ఛత్రసాలుని కతివైభవముగ వివాహము జరుగుచుండినసమయమున, నదియే తగినవేళ యని యెంచి రణదులహాఖానుఁ డతనిపై దండెత్తెను. ఛత్రసాలున కది తెలియుటతోడనే వివాహోచితవేషముతోడనే యతఁడు ఖాను నెదుర్కొనఁబోయెను.

ఆయుద్ధమున రణదులహాఖాను రూపుమాసెను. అందే హీరాదేవియు మడిసెను.

బుందేలఖండస్వాతంత్ర్యసంపాదకుఁడగు ఛత్రసాలునకు విమల విజయప్రాప్తితోఁబాటు విమలావిజయాప్రాప్తియు లభించెను. శీఘ్రముగనే యాతఁడు మహావైభవమునఁ దనరాజధానినిఁ బ్రవేశించెను.

---

# ఆంధ్ర ప్రచారిణి గ్రంథనిలయము,

(1911 వ సంవత్సరములో స్థాపింపఁబడినది.)

## పిఠాపురము.

నవలలు—నవరసభరితములగునవలలు—పుణ్యచరిత్రములు. 200-250 పుటలకు మించకుండ—రెండుమాసములకొక్కటిగా వెలువడును.

చందాదారులసౌకర్యమునకై నవలలవెలలు చౌకచేసి పోస్టేజి మేమే భరించి పూర్వపునిబంధన లీక్రిందివిధముగా మార్చినాము.

—◆ నిబంధనలు ◆—

1. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా 0—4—0 చెల్లింపవలయును.

2. ఇందురెండేసిమాసములకొక్కటిగ వెలువడుచుండు మంచి రేపరుబైండుగల ప్రతిగ్రంథమును పోస్టేజి మనీఆర్డరు కమీషనులు మేమేభరించి రు 1-0-0కిమాత్రమే చందాదారులకుఁ బంపుచుందుము.

3. చందాదారు లగువారు వెనుకటిగ్రంథములన్నియుఁ గొన వలయునను నియమములేదు. కాని వారు కోరినచో వెనుకటిపుస్తకములుకూడఁ జందాదారుల వెలలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

4. ఇందుఁ బ్రకటింపఁబడు అనుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

5. సంవత్సరముచందా అనఁగా ముందుప్రకటింపఁబడు ఆరు పుస్తకములకు రు 5—4—0 లు ముందుగఁ బంపువారికి ఆరుపుస్తకములవరకు ప్రతిపుస్తకమును అక్నాలెజుమెంటు రిజస్టర్డుపార్సెలుగా పంపుచుందుము.

**Awarded abundant Certificates.**

# FUTURE READING.

*Free!* ABSOLÜTELY *Free!*

జీవితరహస్య ముచితము ! మీ భవిష్యజ్జీవితరహస్య ముచితము

## అంజనాలయము

లోనే తెలిసికొని ఆనందించుడు. మీ జీవితరహస్యమంతయు అంజనమూలముచే( గన్నులకు( గట్టినట్లువ్రాసి పంప(బడును. జాతకములున్న వ్రాసి పంపవలెను. జాతకములు లేనివారు తొమ్మిది అక్షరములు సుమారువయస్సుతో వ్రాసిపంపవ(లయును.

| | | |
|---|---|---|
| 4 వారములకు | ... | రు 0—2—0 |
| క్లుప్తముగా గతము | ... | 0—3—0 |
| దశలవయిని జీవితము | ... | 1—0—0 |

### ఫలితములు వ్రాయుటకు ఛార్జీలు.

### Reading Charges.

| | మాసములవారీ Monthly | వారములవారీ Weekly |
|---|---|---|
| సంవత్సరఫలితములు (1 Year) | రు 1—8—0 | రు 2—4—0 |
| దశకు ఫలితములు (10 Years) | రు 6—4—0 | రు 8—8—0 |
| పూర్ణజాతకము (Full Life) | రు 15—8—0 | రు 25—8—0 |

అయిదురూపాయల పైఆర్డరుకు సగము పైకము అడ్వాన్సు పంపవలెను.

వి. సోమనాథశర్మ, కాకినాడ.

(తూర్పుగోదావరిజిల్లా.)

225

# ఆంధ్రప్రబంధగ్రంథమాల.

ఇందుఁ బ్రాచీనకవులచే రచియింపఁబడి ఇంతవఱకును ముద్రితములు కానట్టియు, ముద్రితములైనను నిపుడు ప్రచారములో లేనట్టియు నత్యుత్తమప్రబంధములును పురాణములును ప్రకటింపఁ బడుచుండును.

2. ఇందు చందాదారులుగా చేరువారు చందారుసు మీయ నక్కరలేదు. ప్రకటింపఁబడిన గ్రంథములను గొనుచుండుటయే.

## —◆ రాధామాధవము. ◆—

కృష్ణదేవరాయల కాలములోనివాఁడై రాయలచే రాధామాధవ బిరుదము నందిన చింతలపూడి యెల్లయకవికృతమైన రాధామాధవమను శృంగారప్రబంధమును మొదటిగ్రంథముగాఁ బ్రకటించుచున్నారము. అల్లసానిపెద్దనకవీంద్రుఁడు రాయలయాస్థానమున 'గరు' 'తగరు' 'తొగరు' 'వగరు' అనుపదములను ప్రాసస్థానములయందు నుంచి రామాయణభారతభాగవతపరములుగా పద్యములను చెప్పుమని సమస్య యీయఁగా మనోహరములుగా పద్యములనువిరచించిన మహాకవియీతఁడే.

విభవసంవత్సర మకరసంక్రాంతిదినమున వెలువడును. క్రౌను సైజున నించుమించు 300 పేజీలు. చక్కనిపేపరుమీఁద నందముగా ముద్రింపఁబడును.

క్యాలికోబయిండు — రు 1—8—0

పేపరుబయిండు — 1—4—0

వి. పి. ఖర్చులు కొనువారివి.

వలయువారు:—

మేనేజరు:—ఆంధ్రప్రబంధగ్రంథమాల,
కపిలేశ్వరపురము.
(తూర్పుగోదావరిజిల్లా.)

అని వ్రాయువలయును.

# పురాణగ్రంథమాలిక, పిఠాపురము.

(తూర్పుగోదావరిజిల్లా.)

సంపాదకుడు:—నడకుదుటి వీరరాజుపంతులు.

ఇందు రెండుమాసముల కొకసంపుటముగా సంపుటము 1 కి 200—250 పుటలవంతున రెమ్మాసైజున పదునెనిమిదిపురాణములను, ఉపపురాణాదులను సంస్కృతమునుండి క్రమముగా వచనరూపమున నాంధ్రీకరించి సంవత్సరమున కాఱుసంపుటములుగాఁ బ్రకటించుచు నాంధ్రదేశమున మాయోపినకొలఁది భాషాసేవనొనర్చుచుంటిమి,

(1) ఇందుఁ జందాదారులగువారు రు 0-4-0 ప్రవేశరుసుము చెల్లింపవలయును. (2) చందాదారులకు పోస్టేజీ మేమేభరించి యొక్కొక్కసంపుట మొకరూపాయకుమాత్రమే పంపుచుందుము. మనిఆర్డరు కమిష్షన్‌తో రు 1-0-0 మాత్రమే యగుచుండును. (చందాదారులు కానివారికి పోస్టేజిగాక రు 1-8-0 లు)

ఇందు ప్రకటింపఁబడి వెలకు సిద్ధముగ నున్న గ్రంథములు.

| | చందాదారులకుపోస్టేజితో వెల. | | ఇతరులకుపోస్టేజికాక వెల. |
|---|---|---|---|
| 1. శివపురాణము ౧ సం. | 1-0-0 | | 1-8-0 |
| 2. శివపురాణము ౨ సం. | 1-0-0 | | 1-8-0 |
| 3. శివపురాణము 3 సం. | 1-0-0 | | 1-8-0 |
| 4. శివపురాణము ౪ సం. | 1-0-0 | | 1-8-0 |
| 5. శివపురాణము ౫ సం. | 1-0-0 | | 1-8-0 |
| 6. బ్రహ్మపురాణము ౧ సం. | 1-0-0 | | 1-8-0 |
| 7. బ్రహ్మపురాణము ౨ సం. | 1-0-0 | | 1-8-0 |
| 8. వామనపురాణము ౧ సం. | 1-0-0 | | 1-8-0 |
| 9. వామనపురాణము ౨ సం. | 1-0-0 | | 1-8-0 |
| 10. వామనపురాణము 3 సం. | 1-0-0 | | 1-8-0 |
| 11. శివపురాణము ౬ సం. | 1-0-0 | బైండులో | 1-8-0 |
| 12. శివపురాణము ౭ సం. | 1-0-0 | నున్నవి. | 1-8-0 |

వామనపురాణము సంపూర్ణగ్రంథము:—చందాదారులకు పోస్టేజితో రు 2-8-0. ఇతరులకు పోస్టేజీగాక రు 4-0-0 లు.

సంపాదకుడు, పురాణగ్రంథమాలికా కార్యస్థానము, పిఠాపురము.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A109 B102 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 229 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | K.Naveen |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |